# పోతన భాగవత రత్నాలు

వ్యాఖ్యాత :

"శాంతిశ్రీ" బొత్సకవి



రోహిణీ పబ్లికేషన్స్

మెయిన్ రోడ్ రాజమండ్రి-533101

పోతన

భాగవత రత్నాలు - శాంతిశ్రీ బొత్సకవి.





డిశంబరు - 1994

Rs. 25/-

ముఖచిత్రం : బాలి

ముద్రణ :
రామకృష్ణ ప్రింటర్స్
రాజమండ్రి.

ప్రకాశకులు : ఫోన్ : 73444
రోహిణీ పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్,
రాజమండ్రి-1.

ఓమ్ ఆంజనేయాయ నమః

# పీ ఠి క

దైవాత్మ స్వరూపులారా! పరమ భాగవతులారా!

సహజ పాండిత్యుడగు శ్రీ బమ్మెర పోతన మహాకవి యొక్క శ్రీమదాంధ్ర మహాభాగవతంలో గల కొన్ని పద్యాలను యేరి నా ఉపాసనా దేవత శ్రీ హనుమః దివ్యకటాక్షంతో నా బుద్ధికి తోచిన చిన్న వ్యాఖ్యానాన్ని వ్రాశాను.

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మి చూలికైన"

అంతటి కారణజన్ముడైన మహాకవి "భాగవతము తెలిసి పలుకుట హర బ్రహ్మాదులకూ చిత్రమైన మాటే" అన్నాడు; అలా ఊరుకున్నాడా? లేదు.

"విబుధ జనుల వలన విన్నంత, కన్నంత
తెలియ వచ్చినంత తేట పరతు"

నాకన్న అన్ని విధాలా మిన్నలగు మహాత్ముల వలన నేను చిన్ననాటి నుండీ విన్నవాటి వలన, అంతేకాదు శ్రీ తారకరామ నామామృతపానము వలన నా కన్నుల యెదుట సాక్షాత్కరించి నర్తించిన విషయాలను యెన్నో చూశాను. వీటన్నిటి వలనా నా కెంతవరకే తే తెలుసునో

దానిని మాత్రం నేను తేటతెల్లం చేస్తానన్నాడు మహాకవి పోతన.

అయన కారణజన్ముడు. అలా అనడానికి సామర్థ్యము ఉండి అన్నాడు. నేనో! యేవిధంగా జూచినా చాలా చిన్నవాడినే! ఐనా యెందుకు యిలా వ్రాయడానికి పూనుకొన్నానంటే, యీ విధంగానైనా మహాకవి భాగవతం మరొకసారి చదివి దానిలోగల అర్థాన్ని గ్రహించ గలిగినంత గ్రహించి నాతోడివారికి అందించే బాధ్యత నామీద ఉందిగాబట్టి యిలా వ్రాయ సాహసించాను.

భాగవత మాహాత్మ్య మేమనిచెప్పగలం? యీకార్య క్రమాన్ని ప్రోత్సహించి నాచేత వ్రాయించిన మిత్రుడు శ్రీ పైల అప్పారావు (రోహిణి పబ్లికేషన్స్, రాజమండ్రి) గారికి సమస్త శుభసంపత్తి కలగాలనీ, వారికి నిరంతరం హనుమత్ప్రభువుకటాక్షం కలుగుగాక!

సర్వం హనుమదర్పణమస్తు.

వ్యాఖ్యాత.



# భాగవత రత్నాలు

## శ్రీమద్భాగవతము :

ఈ మహాగ్రంథాన్ని నారాయణుడైన శ్రీ వ్యాసుల వారు రచించారు. లక్షశ్లోకాలు గల శ్రీ మహాభారతాన్ని వ్యాసమహర్షే దీనిని వ్రాశారు. మహాభారతాన్ని వ్రాసిన తరువాత వ్యాసముని మతిభ్రమణకు గురయ్యారు. రాత్రీ పగలూ తిరుగుతుండగా నారదమహర్షి వచ్చి "శ్రీమద్భాగవతము" వ్రాయమని ప్రబోధించగా అప్పుడు వ్యాసులవారు దీనిని వ్రాశారు.

వ్యాస భాగవతము 18 వేల శ్లోకాలు గలది. శ్రీమద్భాగవతం పారాయణ వలన సమస్త కోరికలు సిద్ధిస్తాయి. సప్తాహ దీక్షగా దీనిని పారాయణచేసి తను తమ కార్యాల్ని విజయం చేసుకొనే భక్తులు కోకొల్లలుగా కనిపిస్తారు.

అటువంటి మహాగ్రంథాన్ని సహజపాండిత్యశోభితుడు, ఆంధ్రుల నోము ఫలమూ అమృత కవితా సంపన్నుడైన బమ్మెర పోతనామాత్యుడు ఆంధ్రీకరించాడు. భాగవతంలో ఒక మహావిశిష్టత యింతంత అనరానిది యిమిడి ఉంది. భాగవతాన్ని "భావగతం" చేసికొన్నవారు సమస్తశుభాల్ని పొంది యిహంలో, తుదిని మోక్షం పొందుతారు.

భాగవతంలో చాలా గహన రహస్యాలెన్నో దాగున్నాయి. అందుకే సంప్రదాయజ్ఞుడైన పరమగురువు దగ్గర అధ్యయనం గావించాలి. అది అందరికీ సాధ్యమయ్యేపనేనా? అందువల్ల శ్రీ పోతన మహాకవి వ్రాసిన భక్తిభావ గరిమా, ఆధ్యాత్మ విద్యాప్రపత్తి కలిగిన పద్యాలను ఏరి వాటిలో దాగున్న రహస్యాల్ని మనం తెలిసికొందాం. ముందు పోతన ప్రార్థనా పద్యాన్ని పరిశీలించుదాం.

"శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు! భక్తపాలన కళా సంరంభకున్! దానవో
ద్రేక స్తంభకు! గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండ కుంభకు మహానందాంగనా డింభకున్"

అత్యద్భుత సహజ కవితానల్ప శిల్పంతో అతీంద్రియ ద్రష్టవ్యంతో శబ్దానికున్న మహాశక్తిస్ఫోరక కవితా వనితా లలామ కత్యంతానందాల క్రియలలో ఉత్తమోత్తమ మహాలంకారమైన అంత్యాను ప్రాసతో, సర్వ శుభ, సన్మంగళ, శ్రీకారముతో, కేవల ముక్తికాంతా పరిగ్రహణేచ్ఛతో, శ్రీమద్భాగవత మహాపురాణాంధ్రీకృతి సుకృతి నందజేయు నందనందన డింభక ప్రార్థనతో, సర్వకార్య విజయాన్నే చేకూర్చగల మహా గురువులు గల "మ గ ఇ" ప్రస్తారంతో ప్రారంభింపబడింది ఈ పద్యము.

తాత్పర్యం : సమస్తలోకాలు రక్షించగల ముఖ్యమైన కర్మగలవాడు, భక్తజన పాలనయందు ఎంతో నేర్పు

గలవాడు, రాక్షసుల మదాన్ని నాశనంచేయువాడు, మహా
త్తల తల విలాస భాసమానంగల దృష్టిచేత భూ, నభో,
బ్రహ్మాండాలనుసృష్టిజేయువాడు, పరమపావని శ్రీనందుని అర్ధ
శరీరమైన శ్రీ యశోదమ్మకు ముద్దుబిడ్డడైన శ్రీకృష్ణ
పరమాత్మ అఖిలసంపదల కాలవాలమైన దివ్యమోక్షాన్ని
నాకు సమకూర్చుటకు గాను శ్రీవారిని నా హృదయంలో
ధ్యానిస్తున్నాను.

ఇది ప్రార్థనా పద్యమే కాదు, మొత్తం భాగవతకథా
సంబంధి కూడా! దీనిలో సర్వశాస్త్రాలూ ఉన్నాయి. అవన్నీ
వివరించాలన్న అదే ఒక మహాగ్రంథ మౌతాది. మహాకవి
సర్వమంగళా వాప్తికొరకు శ్రీకృష్ణపరమాత్మను మనసార
మొట్టమొదట ధ్యానించాడు.

పోతన మహాకవి చాలా చిత్రమైన జన్మగలవాడు.
ఈవిషయం తెలియాలన్న శ్రీ వానమామలై వరదాచార్యుల
వారి "శ్రీ పోతన చరిత్ర" చదవాలి. ఆచార్యులవారు
పోతన రెండవ జన్మ.

పోతన కవిచంద్రుని తండ్రి కేశనామాత్యుడు. శైవా
గమ నిష్ణాతుడు. సోదరుడు తిప్పన్న పరమశివాసక్తుడు. ఇంక
మన కవియో మహేశ్వరారాధనా పరుడు. అటువంటి
యాతడు పరమ పరమశివారాధనలో నుండగా కలలో
శ్రీరామచంద్రమూర్తి కనుపించారు. ఏలాగ [illegible]

లిప వ సర్గలో హనుమ సీతమ్మవారికి శ్రీరాముని మూర్తి మత్వము వర్ణించినట్లుగా కాన్పించాడు.

సీ. "మెరుగు చెంగట నున్న మేఘంబు కైవడు
నువిద చెంగటనుండ నొప్పువాడు
చంద్రమండల సుధా సారంబు పోలిక
ముఖమున చిరునవ్వు మొలుచువాడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగి
బలువిల్లు మూపున బరగువాడు
నీలనగాగ్ర సన్నిహిత భాను భంగి
ఘన కిరీటము దల గలుగువాడు
పుండరీకయుగము బోలు కన్నులవాడు
వెడద యురమువాడు, విపుల భద్ర
మూర్తివాడు, రాజముఖ్యుఁ డొక్కరుడు నా
కన్నుగవకు నెదుర గానబడియె॥"

క్రొక్కారుమెరుగు చెంగటనుండే మేఘమండలములా సీతమ్మ ప్రక్క గాన్పించినవాడు, చంద్రమండలములో గల అమృతసారమువలె నున్న మోమున చిరునవ్వు మొలిచిన వాడు, తమాల వృక్షానికి ప్రాకిన లతవలె మూపుపై కోదం డాన్ని ధరించినవాడు, నీలగిరిందాగ్రభాగాన అతి సన్నిహి తంగా ఉన్న సూర్యభగవానునివలె నవరత్నస్థగిత కిరీటాన్ని గలిగినవాడు, విప్పారిన పద్మ పత్రాల్లాంటి నేత్రాలు కల వాడు, విశాలమైన వక్షం కలవాడు, అతిశయించిన భద్రమైన

మూర్తి కలవాడు, ఒక రాజోత్తముడు నా కన్నుల ఎదుట సాక్షాత్కరించాడు.

ఈ విధంగా పోతన మహాకవికి శ్రీరామచంద్రుని దర్శనం కలిగింది. విశేష మేమనగా పరమశివారాధనలో చిత్తం హత్తుకొనగా, శ్రీరామచంద్రుని సాక్షాత్కారం మహాకవికి కలిగింది. అనగా పోతనకు హరిహరాద్వైత భావనా సామ్రాజ్యాధికారం సిద్ధించిందన్న మాట. అన్న మాట కాదు, ఉన్నమాట.

అలా ప్రత్యక్షమైన శ్రీ రఘురాముడు "నేను రామభద్రుడను, నాకు శ్రీమద్భాగవత పురాణం తెలుగుచేసి అంకిత మీయు" మని ఆదేశించగా పోతన

"పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
బలికిన భవహర మగునట
బలికెద వేరొండుగాథఁ బలుకగ నేలా?"

ఓహో మహాకవి వాక్కు లమృతోపమానాలు. యిందులో మంచి చమత్కారం ద్యోతకమౌతుంది. పలికించునంట ! భాగవతము అట విభుండు రామభద్రుడు; అట పలికిన భవహరమగును; అట, అట, అట, మొత్తం మూడు" అట లున్నాయి. యీ మూడు అట లేమిటి? అవి త్రిమూర్త్యాత్మకం. యీ చిన్న కదంలో నందన వన చందనంలాంటి అందం పొందుపరచాడు.

ఇక పోతనగారి వినయ నయ సంపత్తికి యీ క్రింది పద్యం అద్దం పడుతుంది.

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన, తమ్మి సూలికైన;
విబుధ జనుల వలన విన్నంత, కన్నంత
తెలియ వచ్చినంత తేట పరతు."

ఉత్ఫుల్ల నవమల్లికా వేల్లిత మీ హృద్యమైన పద్యం. శ్రీ వ్యాసభగవానుని శ్రీమద్భాగవతం పలుకుట మహాచిత్రమైన పని. ఎవరికి? శూలి=ఈశ్వరుడు, తమ్మిచూలి=బ్రహ్మ; ఈశ్వర, బ్రహ్మలకుగూడ భాగవతం తెలియదు. పోతే మరి నాకెట్లా తెలుస్తుంది? విబుధజనులు=పండిత ప్రకాండులు, వారి వలన నిరంతరమూ పోతన శ్రీ వ్యాసభాగవతాన్ని వినేవాడన్నమాట. వినడమేమి ఆ విబుధులు భాగవతాన్ని భావగతం చేసికొని వివరిస్తుండగా యీ మహాకవి దాన్ని విని, ఆ కథానల్ప శిల్పాన్ని హృదయాల్లో మూర్తిగా కట్టించుకొని తన మనో నేత్రాలతో చూచేవాడు; ఇంక ఆ చూచినదంతా వ్రాయగలడా? లేదు, అందువలన నాకు తెలిసినంత వరకే శ్రీ మహాభాగవతాన్ని వ్రాస్తానుసుమండీ!, అని [illegible] పలికాడు, నాకన్న మిన్న లెవరైనా భవిష్యత్తులో శ్రీ భాగవత పురాణాన్ని తెనిగిస్తే ఆనందిస్తానన్నాడు.

అబ్బా! పోతన ఎంతగడుసువాడు? అంతేనా? తాను తెనిగించబోయే మహాగ్రంథాన్ని అందరూ చదివి, అన్ని విధాలానందాల్ని పొందాలని యీ దిగువ కందంలో అందం చిందించాడు.

> "కొందరికి తెనుగు గుణమగు
> కొందరికిని సంస్కృతంబు గుణమగు; రెండున్
> గొందరికి గుణములగు; నే
> నందరి మెప్పింతు కృతుల నయ్యైయెడలన్"

కొందరు తెనుగు మృదుమధుర శబ్దాలన్న చెవికోసుకుంటారు; మరికొందరు కేవల శబ్దాడంబరంతో నుండిన వాటిని చూచి ఆనందిస్తారు; యింకా మరికొందరున్నారు చూచారా! తెనుగూ, సంస్కృతము సమానంగా ఉన్న గ్రంథాలనే చదివి ఆనందిస్తారు. అందువలన నేను అన్నిరకాల మనస్తత్వాలు కలిగినవారందరనూ మెప్పిస్తాను." యిది యెంత గడుసుతనం? బస్తీమీద సవాలు. నేను తెనిగించే శ్రీభాగవతం ఏరకమైనవారూ తిరస్కరించడానికి లేదు. కారణం శ్రీరామచంద్రుడే పలికిస్తున్నాడు కాబట్టి? ఎంత ఆత్మవిశ్వాసం గలవాడు పోతన మహాకవి? యీ క్రింది పద్యాన్ని వినండి.

> "ఒనరన్ నన్నయ, తిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్
> తెనుగుల్ చేయుచు, మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
> తెనుగుంజేయరు మున్ను భాగవతమున్; దీనిం దెనింగించి, నా
> జననంబున్ సఫలంబుజేసెద, బునర్జన్మంబు లేకుండగన్"

నన్నయ, తిక్కనాది మహాకవు లెందరో పురాణాల నెన్నిటినో తెనుగుభాషలో వ్రాశారు. నా పూర్వపుణ్య మేమో అందులో ఏ ఒక్కరూ శ్రీ వ్యాస మహాభాగవత పురాణాన్ని మాత్రం తెనుగు చేయలేదు. అందువలన యీ మహాగ్రంథాన్ని తెనిగించి నాకు పునర్జన్మ లేకుండగా చేసికొంటాను. అద్దిరా! యేమి యీ భావం? పోతనగారు శ్రీ భాగవతాన్ని తెనిగించి పునర్జన్మ లేకుండా చేసికొన్నారు. యిక మనమంతా అనగా తెనుగువారమందరం యీ మహాగ్రంథాన్ని సప్తాహదీక్షలో పారాయణ గావించి మరల పుట్టు వందకుండా చేసికొందాం. శ్రీ భాగవత పురాణ పారాయణ వలన యెందుకు తిరిగి పుటువుండదో చూడండి.

"లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభి
రామంబు, మం
జు, లతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞే యమున్, సుందరో
జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబునై
వేలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజశ్రేయమై"

తాను తెనిగించు భాగవతం తెనుగులకు కల్పవృక్ష మన్నాడు పోతన మహాకవి. యీ కల్పవృక్షానికి, లలిత లలిత మైన మొదలు, శ్రీకృష్ణ చరిత్రయే దీని మూలం, శుక మహర్షి వాక్యామృతత మె అభివృద్ధి మధుర మంజులత్వ మే లతలు. సువర్ణ సుమనస్సులు తెలిసినవారే పుష్పాలు, సుందర మత్తేభ శార్దూలాది వృత్తాలే దీని వృత్తం, మహాఫలం అనగా

తిరిగి పుట్టకపోవడం, వ్యాసాలవాలం గలదిది. యీ భూమిపై సద్విజులకు శ్రేయస్సు యీ కల్పవృక్షం యిస్తుంది. సద్విజ
జుత్తి=జన్మ చేత ఏ జాతిలో పుట్టినా? వారి వారి సుకర్మల వలన ద్విజన్మ రెండవ జన్మ లభిస్తుంది. యింతవరకూ తన శ్రీ భాగవత మహాపురాణాన్ని గూర్చి శ్రీ పోతన మహాకవి చెప్పాడు.

పోతనకు "శ్రీరామ తారకమంత్రం, సరస్వతీమంత్రం" యోగిరూపంలో వచ్చిన యీశ్వరుడే బాల్యంలో ఉపదేశించి యీ రెండుమంత్రాల సిద్ధి యెలాగో ఆయన చెప్పాడు. అలాగే పోతన జపించి సిద్ధి పొందాడు. అందుచేతనే శ్రీ భాగవత మహాపురాణ రచనా దురంధరు డయ్యాడు.

యిక పోతన శ్రీ మహాభాగవతంలో గల మనోహర మహనీయ మంజుల రసానంద హృద్యపద్యాలను సహృదయులై వేద్యంగా చదువుకుందాం.

అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తుకు ధర్మరాజాదులు పట్టాభిషేకం చేసి వారందరూ అరణ్యాని కేగారు. పరీక్షిన్మహారాజు అరణ్యానికి వేటకు వెళ్ళి, అచట బాగా అలసిపోయి దప్పికతో శమీకమహర్షి ఆశ్రమానికి వెళ్ళి అచ్చట ఆయన తపోదీక్షలో ఉన్నాడు. మహారాజు నీరిమ్మని వింత పిలిచినా పలుకక పోవడంతో కోపించి అచ్చటగల చచ్చిన పాము నాశాపసి మెడలో వేసి వెళ్ళిపోయాడు. [illegible]

ఆసమీపంలో తపస్సుచేస్తున్న శమీకముని కుమారుడు శృంగి అనువాడు తన తండ్రి మెడలో చచ్చిన పామును తగిలించినవాడు "ఏడు రోజులలో చచ్చుగాక!" అని శపించాడు. యీ విషయం తెలిసిన పరీక్షిత్తు చేసినదానికి వగచి తుదకు సర్వమూ త్యజించి ప్రాయోపవిష్టుడయ్యాడు. ఆ సమయమున దిగంబరుడైన శ్రీ వ్యాసపుత్రుడు శుకమహర్షి వలన ఏడు రోజులలో పరీక్షిత్తు శ్రీ భాగవత మహాపురాణాన్ని విని మోక్షంపొందాడు. యీ కథ సూతమహర్షి శౌనకాది మహర్షులకు నైమిశారణ్యాన వినిపించాడు.

ఈ భాగవతం పదిరెండు స్కంధాలు గలది. ఒకొక్క స్కంధానికీ కొన్ని అధ్యాయాలున్నాయి. ప్రతి స్కంధంలో గల ప్రతి తొమ్మిదవ సర్గకూడా శ్రీహరి ప్రార్థనా విషయమే అగుట యిందులోగల మహాచిత్రం. అనగా పది రెండు అధ్యాయాల్లో పదిరెండు ప్రార్థనాఘట్టము లున్నవన్నమాట. ప్రథమ స్కంధంలో, నవమ స్సర్గలో భీష్ముడు శ్రీకృష్ణ పరమాత్మను స్తుతించడం.

"త్రిజగన్మోహన నీలకాంతితను వుద్దీపింప ప్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్"

విజయు డనగా అర్జునుడు అతన్ని చేరడము, ప్రేమాభి మాన పురస్సరంగా వన్నెలాడు శ్రీకృష్ణపరమాత్మ. నిజంగా వన్నెలాడే! మూడు లోకాల్నీ మోహసాగరాన ముంచగల నీలకాంతి అనగా శ్యామల వర్ణంగల శరీర మెంతో మోహ రసోద్దీపనం కలిగిస్తుండగా, ప్రభాత కాలాన అప్పుడే ఉదయి స్తున్న సూర్యభగవానుని అరుణారుణ కాంతుల వంటి కాంతిని విరజిమ్మిన బంగారు శాలువా భుజముపై వల్లె వాటుగా అందము చిందింపగా, నీలిరంగు గాజులవలె వంక రలు తిరిగిన జునపాలు, అందరిచేతా సేవింపబడే ముఖపద్మం విజృంభించగా, ఉన్న ఆ విజయుని చేరిన వన్నెలాడు నా హృదయంలో ఆవేసించుగాక !

ఎంత మధురాతి మధురమైన శ్రీకృష్ణ పరమాత్మ యొక్క వర్ణనా చిత్రమిది. వేరొకటి—

సీ. కుప్పించి యెగసిన గుండలంబుల కాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నురికిన నోర్వక యుదరంబులోనున్న
జగముల వ్రేగున జగతి గదల,
జక్రంబు చేపట్టి చనుదెంచు రయమున
బైనున్న పచ్చని పటము జార,
నమ్మితి నాలావు నగుబాటు సేయక
మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ

గరికి లంఘించు సింహంబు కరణి మెరసి
నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున ! మద్విశిఖావృష్టి
నెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

ఇది పోతన మహాకవి కవితా చిత్రాల్లో మకుటాయమానం

శ్రీ మహాభారత రణరంగాన పార్థసారథియైన శ్రీకృష్ణ పరమాత్మ భీష్ముని బాణఘాతాల తాకిడికి అర్జునుడే వివశుడుగాగా, తానూ గంగానందనుని బాణపు దెబ్బలకు తాళలేక అర్జునా! యిప్పుడు భీష్ముని చంపి నిన్ను రక్షిస్తానన్నాడు. ఆ విషయం స్ఫురణకు తెచ్చుకొనిన భీష్ముడు శ్రీకృష్ణపరమాత్మని ధ్యానించడం.

రథంపై నుండి హఠాత్తుగా యెగిరి క్రిందకు దూకాడు కృష్ణపరమాత్మ. ఆ సమయాన ఆతని కుండలాల దివ్యకాం

ఫుట్‌నోట్ : 1958 సం॥ మొదలు సుమారు యిరవయేండ్లు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, శ్రీ యస్వీ జోగారావు, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ మొదలగువారమంతా "భువనవిజయం" మహాసభలు ఆంధ్ర, ఆంధ్రేతర మహాపట్టణాలలో వందలాది ప్రదర్శన లిచ్చాం; ఆ సమయములలో శ్రీ జంధ్యాలవారు యీ పద్యాల వ్యాఖ్యాతను తమ్ముడూ! అని పిలిచి యీ పైపద్యాన్ని చదివి మనోహరమైన దానిలోగల అర్థాన్ని వివరిస్తూ ఉండేవారు. *

తులు గగనభాగమంతా కప్పివేసాయి. అతడు రథంపై నుండి క్రిందికి ఉరకడంలో పదునాల్గు భువనాలూ గల అతని ఉదరం కదులుటచేత యీ భువనాలన్నింటి భారంతో జగమంతా గదఃగా, చక్రాన్ని హస్తంతో ధరించి హఠాత్తుగా క్రిందికి దిగుటవలన అతని భుజముపైనున్న బంగరు శాలువా జారు చుండగా, హే పరమాత్మా! నీ బలాన్ని సంపూర్ణంగా నమ్మాను, నా బలాన్ని యిచ్చట సగుబాటు చేయకు నన్ను మన్నింపుమని అర్జునుడు ప్రతిమాలు చుండగా, ఏనుగుపైకి లంఘించ దలచు సింహంవలె విజృంభించి, భీష్ముని చంపి, నిన్ను రక్షిస్తానసే పరమాత్మయే నాకు దిక్కగుగాక!" అని అద్భుత కవితారామణీయ కవితా చిత్రాన్ని పోతన నిర్మించారు.

## ప్రహ్లాద చరిత్ర

ఇక ప్రాధాన్యంగల ప్రహ్లాద చరిత్ర సప్తమస్కంధాన్ని చూద్దాం. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. నీ కేమి కావాలో కోరుకోమన్నాడు. ఇక హిరణ్యాక్షు కోరికలు వినండి. అందుకే కోరరాని కోర్కెలు కోరేవార్ని "హిరణ్యాక్ష వరాలని" సామెతగా చెప్పుకుంటారు. అనవసర ప్రశ్నలు వేసేవారిని "యక్ష ప్రశ్నలు" అనడం కద్దు.

"గాలింగుంభిని, నగ్నిఁ, నంబువుల, వ్యాకాశస్థలిన్, దిక్కులన్ రేలన్, ఘస్రములన్, దమఃప్రభల, భూరి గ్రహ... ... రత్నో...

వ్యాఘ్రాదిత్య, నరాది, జంతు కలహవ్యాప్తిన్ సమస్తాస్త్ర, శ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే"

ఎలాంటి కోరికలు కోరాడో విన్నారా? గాలిచేత, భూమిచేత, అగ్ని, నీట, ఆకాశాన, దిక్కుల, రాత్రి, పగళ్ళ వలన, చీకటి, వెలుగుల, గొప్ప మొసళ్ళ, రక్కసుల, సర్వ మృగాల, సర్పాల, ఆదిత్యుల, నరుల, జంతువుల యుద్ధాల, సమస్త అస్త్ర, శస్త్రాల వలన దేనిచేతా నాకు మృత్యువు లేకుండునట్లు వరాలుయిప్పింపమని హిరణ్యాక్షుడు బ్రహ్మను కోరాడు. "నఖరాయుధాలవల్ల నాకు మారకం లేనట్లుగా" వరమిమ్మనగా బ్రహ్మదేవుడు "నఖరాయుధం వలన నీకు మారక ముండునని వరమిచ్చాడు; నఖము కోరు.

ఒక్క పద్యంలో యిన్నివరాల్ని మహార్థగాంభీర్యంగా యిమడ్చగల శక్తి ఒక్క పోతన మహాకవికే ఉంది.

ఫుట్‌నోట్ : 1960 లో ఏలూరు "భు[illegible] విజయము" సభ వచ్చి ఒక సాహిత్యోపాసకుడైన రెడ్డి రుయ్యడు "నవ గ్రహాలు, త్రిమూర్తులు, త్రిదేవులు, దశావతారాలూ ఒక పద్యములో వ్రాసినవారికి వేయినూటపదారురూపాయ లిస్తానన్నాడు. అందుకు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు "తమ్ముడూ! నీవు వారింట ఉండి వ్రాయమని నన్నాదేశించాడు. ఆ పద్య మిది.

"తనయందు, నఖిల భూతములందు, నొకభంగి
సమహితత్వంబున జరుగువాఁడు,
పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడి
జేరి, నమస్కృతుల్ జేయువాఁడు,
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన చేసి మరలువాఁడు,
తల్లిదండ్రుల భంగి, ధర్మవత్సలతలు
దీనులగావ జింతించువాఁడు,

"ఇన, శశి, కుజ, బుధ, గురు కవి
శశి, ఫణీ, కే; త్ర్యజుల అజుల సతులను, ఝష, కూ
ర్మణ, నృహరి, వర్ణి, భార్గవ
ఘన తామద్వితయ బుద్ధ కల్కులఁగొల్తున్"

తా॥ ఇన=సూర్యుడు; శశి=చంద్రుడు; కుజ=కుజుడు; బుధ=బుధుడు; గురు=బృహస్పతి; కవి=శుక్రుడు; శని=శని; ఫణి-కేతులు = రాహు కేతువులు; అజుల = బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల; అజుల సతులను = వారి భార్యలను; ఝష= మత్స్యము; కూర్మ = కూర్మము; ఇ=వరాహము; నృహరి= నరసింహము; వర్ణి=వామన; భార్గవ=పరశురాము; ఘనరామ ద్వితయ బుద్ధకల్కులు = శ్రీరాము, బలరామ, బుద్ధ, కల్కి అవతారముల గొల్తును. ఈ పద్యము వ్రాయడానికి శ్రీ రెడ్డి గారింటిలో రెండు రోజులుండి ప్రత్యక్షరం [illegible] మొత్తం పద్యాన్ని శ్రీ హనుమ కటాక్షముతో వ్రాసి [illegible] శ్రీ బాలరాజు. వ్యాఖ్యాత నుట్.

సముల యెడ సోదరస్థితి బరుపువాడు
దైవతములంచు దలచువాడు
లీలలందును బొంకులు లేనివాడు
లలిత మర్యాదుడైన ప్రహ్లాదు డధిప"

ఈ పద్యం అచ్చు పోతనమహాకవి తన జీవితచిత్రణ తనయం దే పరమాత్మ ఉందో, అదే పరమాత్మ సమస్త సృష్టి భూతజాలాల్లోనూ ఉందని తెలిసికొని దానిని ఆచరిస్తే వేదాలూ, వేదాంతాలూ, తపస్సూ యేదీ అక్కరలేదు. తన యందుసర్వ భూతాలందు ఒకేరీతిసమహితత్వంతో ఉండేవాడు.

పెద్దలను గాంచెనా, వారి దగ్గర పనిచేసిన వారివలె వారిం జేరి హృదయ పూర్వక నమస్సుమనస్సుమాలందిం చేవాడు.

"సర్వేంద్రియాణాం నయనంప్రధానం" మనకు సర్వేం ద్రియాల్లో కన్ను మిన్న. తన రెండు నేత్రాలకూ పెర కాంతలు కాన్పించారా! వారి యందు మాతృత్వాన్నే దర్శించి మరలి పోయేవాడు. సమాజంలో నూటికి నూరు పాళ్ళూ కాంతా కనకాలవల్లనే కారాని యిక్కట్లు వస్తు న్నాయి. ఆ రెండింటినీ వీడినవాడు దైవంతో సమానుడే.

దీనజనుల్ని చూచి తన మాతా పితృ రూపాలుగా ఎంచి వారికి తగిన సహాయం గావించేవాడు, తన వయస్కులు తన సోదరులేయని భావించేవాడు, గురువుల్ని త్రిమూర్త్యా

త్మకులుగా పూజించేవాడు, ఆటలందు కూడా అబద్ధమాడే వాడు కాడు. మధుర హృదయుడైన ప్రహ్లాదుడు తన జీవిత మిలా మహా సత్వగుణంతో నిరూపించాడు. హృద్యాన పద్య సద్యోఽమృత లలితభావాస్పద మీ పద్యం హరికి నైవేద్యం

"పానీయంబులు త్రావుచున్, గుడుచుచున్ భాషించుచున్, హాస లీ
లా నిద్రాదులుచేయుచున్, దిరుఁగుచున్ లక్షించుచున్,సంతత
శ్రీమన్నారాయణ పాదపద్మయుగళీ చింతాఽమృతా
స్వాద సం
ధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!"

అపూర్వ భావనా శబలిత మీ పద్యం.

నీరు త్రాగినా, భోంచేస్తున్నా, మాటలాడుచున్నా, హాస్య లీలా నిద్రావస్థలలో నున్నా, తిరిగినా, దేనియందైనా ఏకాగ్రతతో నున్నా యెప్పుడు శ్రీనారాయణుని పాదపద్మ ధ్యానామృతాన్నే త్రాగుతూ యీ సకల ప్రపంచాన్ని మరచాడు ప్రహ్లాదుడు ఓ ధర్మరాజా!" అని నారదుడు ధర్మజునికి చెప్పాడు.

ఈ ఒక పద్యంలోగల అర్థాన్ని ఒంటపట్టించుకున్న సమస్త శాస్త్రాల కన్న మిన్న. అనగా ప్రతి మనిషి భగవదారాధనా, ధ్యానానూన భక్తిభావం యెల్లాగ ఉండాలో ప్రహ్లాదు డిందు నిరూపించాడు. భక్తియోగం చేపట్టాల నెంచే వారి కీపద్యం చాలును.

యిలా నారదుడు చెప్పగా విన్న ధర్మరాజు ఆశ్చర్యంతో యిలా అన్నాడు.

"బాలు! ప్రభా విశాలు! హరి పాదపయోరుహ చింతనక్రియా
లోలు! కృపాళు! సాధు, గురులోక, వదానతఫాలు! నిర్మల
శీలు! సమస్త సభ్యనుతశీలు! విఖండిత మోహవల్లి కా
జాలు! నదేల తండ్రి వడి జంపగ బంప మునీంద్ర? చెప్పవే"

బాలుడు యిలా ఉండాలనీ, పోతనగారు తన చిన్నతనంలో అచ్చంగా యీ పద్యంలాగే ఉండేవారనీ మనకు పోతన చరిత్ర చదివిన వారికి ధ్వనిస్తుంది.

"బాలస్తు మూఢః" అని, కాని యీ బాలుడో! విశాలమైన ప్రభావం కలవాడు, శ్రీహరి పాదపద్మాల్నే నిరంతరం ధ్యానలోలత్వంతో చింతించేవాడు, మహా కృప గలవాడు, సాధు, గురువుల దగ్గర వారి పాదాలపై తన శిర ముంచి నమస్కారం చేసేవాడు, సమస్త జనులచేత నుతింప బడే శీలం కలవాడు, మోహం దేనియందూ లేనివాడు. యిన్ని సుగుణాలున్న ఆ బాలుని తండ్రి ఎందుకు అంత తొందరగా చంప బంపాడో మునీంద్రా చెప్పు।

యీ ప్రశ్న మనకూ కలుగుతుంది. పోతనగారిలో యేది చెప్పినా మనస్ఫూర్తిగా వినినవారు ఆచరించాలనే ధ్యాస కలిగినట్లుగా చెప్పగల శక్తి ఉంటుంది. అంత్యప్రాసా లంకారం యీ మహాకవికి అన్వయించినట్లు మరే కవులకూ చందగించలేదు.

ప్రహ్లాదుని గురువుల కప్పగించి కొంతకాలం పోయిన తరువాత కుమారుని పిలిచి నీవు చదివిన చదువు చెప్పమనగా హిరణ్యకశిపునకు

ఉ॥ "ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి నూతిలోపలం
 ద్రెళ్ళక, వీరు, నేమను మతిభ్రమణంబున ఖిన్నులై ప్రవ
 ర్తిల్లక, సర్వమున్నతని దివ్యకళామయ మంటంచు విష్ణునం
 దుల్లము జేర్చి తాఅడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ!"

పోతనగారు సమస్తశాస్త్ర విద్యావిశారదునిగా, మంచి మాటకారిగా, యింద్రియాతీత విజ్ఞానిగా, వాక్య విశారదునిగా ప్రహ్లాదుని పాత్ర తీర్చిదిద్దారు. ఆదికవి వాల్మీకి మహర్షి "హనుమ పాత్ర" నెంత మహామహునిగా శ్రీమద్రామాయణంలో చిత్రీకరించారో, శ్రీరామోపాసకుడగు నీతడు రామాయణాన్ని నిత్య పారాయణచేస్తూ వాల్మీకిమునీంద్రుని పాత్రౌచితీ మర్యాదా, శబ్దస్ఫూర్తి, భావభాగ్యయోగ్యతా, అలంకారాదర్శమూ భావగతం చేసుకొని భాగవతాన్ని వ్రాశాడు.

నిశాచరాగ్రణీ=రాక్షసులలో కెల్ల పెద్దవాడా! తండ్రిని యెలా సంబోధించాడో! ప్రహ్లాదుడు చాలా గడుసువాడు, పెంకివాడు, జంకుపెరుగని ఆత్మవిశ్వాసం కలవాడు. మొత్తం భాగవతంలో ప్రహ్లాదుని పాత్ర మిన్న! అలాగే స్త్రీలలో రుక్మిణి పాత్ర. ఎంత మృదువుగా వేదవేద్యాంతరార్థం యీ పద్యం.

మనుజులు అనలేదు. "శరీరధారులు" అనగా ఆత్మ శరీరాన్ని ధరిస్తుంది. అందువలన "ఎల్ల శరీరధారులు" యీ "ఎల్ల" శబ్దం అమోఘం! శరీరాలు ధరించే వారందరకు ఇల్లనే గాఢాంధకారమైన ఒక నుయ్యి ఉండనే ఉంది. దానిని వారే తవ్వుకున్నారు. అందులో వారు పడకుండా ఉండాలి ముందు. యిక "నీవూ, నేనూ" అనే మతిభ్రమణ యీ శరీరాదు లందరకూ మనస్సుల్లోనుంచి వైదొలగాలి; యిక పోతే యేంచేయాలి? అందరకూ వెలిగా అందర్లో కలిసే వాడొకడున్నాడు. ఆతని దివ్య కళాలయమే యీ సర్వమూ. ఆతడెవరూ? విష్ణువు. అనగా సర్వమూ వ్యాపించినవాడు. ప్రతీ శరీరధారిలో ఉన్నవాడు. అందువలన యీ మతిభ్రమణ తొలగాలన్న అతనికి యీ హృదయం అంకితంచేస్తే చాలు. అడవిలో ముక్కుమూసుకొని ఉండనక్కరయేలేదు ఓ నిశాచరాగ్రణీ!"

ఎలా ఉన్నాయి ప్రహ్లాదుని వాక్యాలు? హిరణ్యకశిపుడు యీ మాట లాలించి కుమారుడని యేమీ అనక సామ దాన, భేదంతో యిలా అన్నాడు.

"సురలన్ద్రోలుటయో! సురాధిపతులన్ ద్రుక్కించుటో!
సిద్ధులం
బరివేధించుటయో! మునిప్రవరులన్ బాధించుటో! యక్ష కిన్నర గంధర్వ విహంగనాగపతులన్నాశంబు నొందించుటో!
హరియంచున్ గిరియంచు నేలచెడ మోహాంధుడవై పుత్రకా!"

మహాకవికి అంత్యానుప్రాస మొక హేల.

ఓరీ పుత్రకా! "హరి - గిరి" అనే మోహం నీకెందు కురా? "విష్ణువు" అని ప్రహ్లాదు డనగా కాదు "హరి-గిరి" హిరణ్యాక్షుడన్నాడు. హరించుకుపోయేవాడే హరి, నిలిచిపో యేది గిరి. చలనంలేంది. ఎంతో హాస్యంగా అన్నాడు. పోతనగారు పాత్రపోషణ అద్భుతమని అనుకొన్నాం కదా! అందువలన గడుసువాడైన ప్రహ్లాదుడు గాంభీర్యంగా మీసాలు మెలివెట్టి పలికిన తండ్రితో అతి మృదువు, లాలిత్యం, లలి తంగా యెంచక్కా చెప్పాడో విందాం.

"మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు?
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు?
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు?
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు?
అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల?"

ఈ పద్యం శ్రీభాగవతంలోనే అపూర్వ మాధుర్య ధుర్యం కలది. కవితా సహృదయం గలవారికెల్ల యీపద్యం కంఠగతం.

ప్రహ్లాదుడు తండ్రిని తన వాక్యచమత్కృతితో యెంత చక్కగా లాలించాడో! "సద్గుణం శీలములతో స్తోత్రం చేయబడిన వాడా? అని వెంటనే నీవు వేయిమాట లాడనేల? నేను చెప్పింది జాగ్రత్తగా విను.

మందార పుష్పాల మకరంద మాధుర్యం అనుభవించే తుమ్మెద ఉమ్మెత్త పుష్పాలపైకి పోవగలదా? యిందులో "మా"లు అయిదున్నాయి. మా = లక్ష్మి.

నిర్మలాతి నిర్మలంగా స్వచ్ఛ శతమఖావని గగనగంగా తరంగాలలో తేలి ఆడుతు గల్గు ఆ మృణాళాదులను భక్షించు రాజహంస చిన్న మురికిగుంటలవంటి తుచ్ఛ తరంగిణులకు చనునా?

తీయమామిడి గున్న చిగురుటాకులు తిని ఆనందించు కోయిలమ్మ ఉమ్మెత్త పూవులకు సేరుతా?

పరిపూర్ణ పూర్ణిమా చంద్రునిలోగల అమృతకిరణాల్ని ఆహారంగా గొను చకోరం దట్టమైన మంచుగడ్డల కరుగునా? అలాగే శ్రీమద్విష్ణుపాదారవింద ధ్యానామృత పానంతో విశేషమైన మత్తుగల నా చిత్తం యింకొకదానికి చేరుతుందా? చేరదు. ఎంత సహజ మధుర మంజుల మకరందాల మహిమ మనకు మనోజ్ఞంగా మహనీయంగా అందించారు మహాకవి.

గూర్చి చదివివాను. అంతే కాదు, నే చదివినవి చాలా ఉన్నాయి. యింతెందుకు ? చదువులలో మర్మము అనగా చదువులందు దాగున్న రహస్య మంతా నేను చదివాను.

కమలాక్షు! నర్చించు కరములు! కరములు!
శ్రీనాథు! వర్ణించు జిహ్వ! జిహ్వ!
సురరక్షకుని! జూచు జూడ్కులు! జూడ్కులు
శేషశాయికి! మ్రొక్కు శిరము! శిరము!
విష్ణునాకర్ణించు! వీనులు! వీనులు!
మధువైరి! దవిలిన మనము! మనము!
భగవంతు వలగొను పదములు! పదములు!
పురుషోత్తముని మీది బుద్ధి! బుద్ధి!
దేవదేవుని చింతించు దినము! దినము!
చక్రిహస్తుని ప్రకటించు చదువు! చదువు!
కుంభినీ ధవు జెప్పెడి గురుడు! గురుడు!
తండ్రి! హరిఁజేరు మనియెడి తండ్రి! తండ్రి!"

ఈ పద్యమున గల భావార్థాలంకారాలు అమోఘం! అద్భుతం! ఆశ్చర్యం! ఆరాధ్యం! ఆనందం!

"శ్రీ లక్ష్మీనాథునికి సేవచేసిన హస్తములే హస్తాలు, శ్రీనాథుని వర్ణిచే జిహ్వ! జిహ్వ!, దేవతారక్షకుడైన విష్ణుని ధ్యానయోగాన చూచినవే చూడ్కులు, శేషసాయికి మ్రొక్కినదే శిరము, శ్రీవిష్ణు కథల నాలకించేవే చెవులు,

హరికి అంకితమైనదే మనస్సు, భగవంతునికి ప్రదక్షిణగావించేవే పాదాలు, పురుషోత్తముని గూర్చి ఆలోచించేదే బుద్ధి, దేవదేవుని ధ్యానించేదే దినము, చక్రాయుధుని గూర్చి చదివినదే చదువు, పురుషోత్తమునిపైన నుంచిన బుద్ధే బుద్ధి, భూభర్తగు హరిని గూర్చి చెప్పినవాడే గురువు. ఓ తండ్రీ! హరిని జేరుమనేవాడే తండ్రి!, నీవు మాత్రం తండ్రి వెంత మాత్రం కావని ప్రహ్లాదు డెంత ఖండాఖండిగా చెప్పేడు. యీ పద్య మొక అమూల్య రత్నం.

"కంజాక్షు! నకు గాని కాయంబు కాయమే ?
పవన గుంభిత చర్మ భస్త్రిగాక !
వైకుంఠుc బొగడని వక్త్రంబు వక్త్రమే ?
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక !
హరి పూజనములేని హస్తంబు హస్తమే ?
తరుశాఖ నిర్మిత దర్వి గాక !
కమలేశుc జూడని కన్నులు కన్నులే ?
తనుకుడ్య జాల రంధ్రములుగాక !
చక్రి చింతలేని జన్మంబు జన్మమే ?
తరళ సలిల బుద్బుదంబుగాక !
విష్ణుభక్తి లేని విభుదుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక !

అద్భుతాద్భుత కవితా చిత్రాని కీ పద్యం తార్కాణము. కమలాక్షుడైన శ్రీహరిని ఆరాధించని శరీరం శరీరమా ?

కమ్మరి ఊదుకొనే తోలుతిత్తిగా, వైకుంఠనాథుని స్తుతించని నోరు నోరుమాత్రం కాదు, ఢమఢమని వాగిన ఢక్క-ఔతుందిగాని, హరిని పూజించని చేతులు చేతులేకావు, కఱ్ఱతో తయారుచేసిన గరిటే ఔతాయి. లక్ష్మీనాథుని ధ్యాన దృష్టిని చూడలేని కన్నులు కన్నులౌతాయా? పుట్టు గంధాలే ఔతాయిగాని, హరిని ధ్యానించని జన్మ ఒక జన్మేనా! ప్రవాహాన పుట్టి మరల ప్రవాహంలో కలిసిపోయే నీటి బుడగే ఔతుంది గాని, విష్ణుభక్తి లేని పండితుడు పండితుడా! రెండు కాళ్లున్న పశువే ఔతాడు గాని.

"సంసార జీమూత సంఘంబు విచ్చునే?
చక్రి ధాస్య ప్రభ జనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లారు ?
విష్ణు సేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాశు లింకునే ?
హరి మనీషా బడబాగ్ని లేక
ఘన విపద్గాఢాంధకారంబు లణగునే?
పద్మాక్షు నుతి రవి ప్రభలు లేక
నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకునైన దానవేంద్ర!"

ప్రహ్లాదు డిచ్చట "దానవేంద్ర!" అని సంభోధించాడు, నిజంగా హిరణ్యకశిపుడు రాక్షసరాజే అని, సంసారమనే గొప్ప మేఘ సంఘం తూలిపోతుందా? శ్రీహరి సేవా మహా తుపాను లేకుండా? కాదు.

సంసార తాపత్రయమనే ఘోర మహాఘ్ను లారునా, శ్రీవిష్ణు సేవ అను అమృతవర్షము లేకుండా ?

మహా ఆపదాంధకారము అడగునా పద్మాక్షుడను సూర్యప్రభలు లేకుండా ?

యీడులేని కళంకం లేని మోక్షమనే మహానిధి కన్పిస్తుందా? శ్రీహరి కోదండ చింతన లేకుండా, ఓ దానవేంద్రా ! బ్రహ్మ దేవునకైనా శ్రీహరి కటాక్షం లేకుండా యేదీ జరగదన్నాడు. బ్రహ్మనే యెందుకు చెప్పవలె ననగా! హిరణ్యకశిపునకు మహత్తర వరాలిచ్చాడుగదా ! బ్రహ్మ దేవుడు నాకు వరాలిచ్చాడంటావేమో ! శ్రీ నారాయణుని కటాక్షం లేకుండా నీ బ్రహ్మదేవుడు కూడా యేమీ చేయలేడని చెప్పడమన్నమాట !

అందుకు ప్రహ్లాదుడు చాలా గడుసువాడని మీకు ముందుగానే మనవిచేశాను. యింకా తండ్రినిచూచి యిలా అన్నాడు.

"అచ్చపు చీకటింబడి, గుహ ప్రవేశులై విషయ ప్రవిష్టులై చచ్చుచు, పుట్టుచున్, మరల జిహ్వతో చర్వణముల సేవార్కిన

జేచ్చెర బుట్టునే? పరులు సెప్పినసైన, నిజేచ్ఛనైన, యే
మిచ్చినసైన, గానలకు నేగినసైన హరిప్రబోధముల్"

"గాఢమైన" చీకటిలోపడి, కేవల సంసారాన్నే వరించి, నానావిషయ లంపటులై చచ్చి, మరల జన్మించి, మరల మరణించి. మరలపుట్టిన దౌర్భాగ్యులకు వారిమనసులో సహజంగా పుడుతుందా? లేదు. యెవరు చెప్పినా చెవికెక్కునా? యేమిచ్చినా వారికి వినబడునా? లేదా మహారణ్యాలకేగి తపస్సు వారు గావించినా హరినామ కీర్తనలు వారికి వినిపింపవు, కానుపింపవు.

ఓరీ మూర్ఖుడా! నీవు ఘోరారణ్యంలో పుట్ట బలిసి పోయినట్లు తూడులోకాలూ అల్లల నాడినట్లు ఘోరాతి ఘోరమైన తపస్సు గావించావు, యేమి పొందావు? అహంకారం మాత్రం అందుకున్నావు, శ్రీహరి అణుమాత్ర కటాక్షమైనా అందుకోగలిగావా? అని దెప్పిపొడిచాడు ప్రహ్లాదుడు.

యింకా గాఢంగా చెప్పతున్నాడు. అతి మృదువుగా హరినామామృత మందించినా హిరణ్యకశిపున కెక్కుతుందా? దానిని కక్కివేస్తాడు గాని;

"కానని వాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్
గానని భంగి. గర్మములు గైకొని కొందరు కర్మబద్ధులై
కానరు విష్ణు గొంద, రటగం దురకించన వైష్ణవాంఘ్రి సం
స్థానరజోఽభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!"

ఓ రాక్షసరాజా! యిది విను. కన్నులు లేని కబోది యింకొక కబోదిని పట్టుకొని ఊతగా విశిష్ట వస్తు సముదాయాన్ని ఎలా చూడలేడో! ఎందుచేత? కన్నులున్నవాడైనచో, చూపున్నవాడినే ఊతగా విశిష్ట వస్తువులను తాను చూడగలడు. వీడసలే కన్నులు కన్పించని వాడగుట వేరొక కన్నులు లేనివానిని పట్టుకున్నాడు. యెలా వీని బ్రతుకు? వారు చేసిన ఘోర దుష్కర్మలకు వారే బద్ధులై అణువు మొదలు బ్రహ్మ వరకు సమానరూపంగా వున్న శ్రీవిష్ణువును చూడలేరు. కొందరు, కొందరట చూడగలరు. "అట" అనగా యెట్లైనా అని, వారెలా చూడగలుగుతారనగా అణుమాత్రమైన విష్ణు సంబంధులైన వైష్ణవుల పాదధూళి సంస్థానమును శిరములపై అభిషేకించుకొని దానివలన సకల దుష్కర్మలు వాసి, సత్కర్మలు చేసినవారు శ్రీహరిని దర్శిస్తారు సుమా! అని ముదలక్షించాడు

తండ్రిని గాంచి తాను చదువుకోలేదేమో అని అత డనుకుంటాడని యిలా అని గర్జించాడు.

"శోధింపంబడె సర్వశాస్త్రములు, రక్షోనాథ! వేయేటికిన్
గాథల్ మాధవ శేముషీతరణి సాంగత్యంబునంగాక. దు
ర్మేధం దాటగ వచ్చునే? సుత, వధూమిూనోగ్ర వాంఛా మహా
క్రోధోల్లోల విశాల సంసృతి మహాఘోరామితాంభోనిధిన్"

తండ్రీ! నేనుమాత్రం సర్వశాస్త్రాలూ చదువులేదనుకో గాదు, ఆ శాస్త్రాలలో యేముందో అని పాటిలోగల ప్రత్య

క్షరం పరిశోధించాను. యేమిటి లాభం? సతీ, సుతులను యీ వాంఛలను కామ క్రోధాదులతో యెంతో విశాల సంసార మహాసాగరాన్ని దాటడానికి శ్రీ విష్ణు కథలను చిన్న నావ చాలును. తక్కిన చదువు లెందుకు? దాంతో హిరణ్యకశిపుడు పట్టరాని ఒడలు తెలియని ఘోరాకారాన్ని దాల్చాడు.

"అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి, శేషాంగశ్రేణికి రక్షసేయు క్రియ, నీ యజ్ఞుం, గులద్రోహి, దుష్టంగుం గేశవ పక్షపాతి, నధముం జంపించి, వీరవ్రతో త్తుంగఖ్యాతి జరించెదరు కులము నిర్దోషంబుఁ గావించెదన్"

శస్త్ర వైద్యుడు శరీరభాగంలోగల దుష్టాంగాన్ని తీసేసి, తక్కి శరీరాన్నంతా రక్షించిన లాగున, యీ అజ్ఞానిని, రాక్షస లావికే ద్రోహం గావించే వానిని, దుష్టసాంగత్యము గలవానిని, ముఖ్యంగా నాకా జన్మ విరోధి, శ్రీహరి భక్తుని, అధముని చంపించి, నేను మహా వీరాధివీరుడను గొప్ప ఖ్యాతి నార్జించి, నా కులానికే యేదోషం లేకుండా చేస్తాను అని ప్రహ్లాదుని బాలుడనక యెన్నో రీతుల హింసించినా చావలేదు.

"ఒకమాటు! దిక్కుంభియూధంబు దెప్పించి
కెరలి బాలకుని ద్రొక్కింప బంపు,
నొకమాటు? విషభీకరోరగ శ్రేణుల
గడువడి నర్భకు గరవ బంపు,

నొకమాటు! హేతిసంఘోగ్రానలములోన
విసరి కుమారుని వేయ బంపు,
నొకమాటు! ఘూలంకషోల్లోల జలధిలో
మొత్తించి శాబకు ముంప బంపు,

విషము పెట్టి బంపు, విదళింపగా బంపు
దొడ్డ కొండచరుల ద్రోయ బంపు,
బట్టి కట్ట బంపు, బాధింపఁగా బంపు,
బాలు గినికి దైత్యపాలుఁ డధిప."

హిరణ్యకశిపుడు రెట్టింపు భీకరకోపాన్ని వహించి,

ఒకమారు బాలకుడైన ప్రహ్లాదుని దిగ్గజాలతో ద్రొక్కించేవాడు, యింకొకమాటు మహాఘోర విషసర్పాలతో ఆ యర్భకుని గరిపించేవాడు,

యింకొకమారు ఆ కుమారుని ప్రళయాగ్నివంటి అగ్నిలో వేయించేవాడు,

వేరొకమారు కూలంకషంబై కెరటాలతోగల సముద్రంలో యీ కుర్రని మొత్తించి దా[illegible]లో [illegible]యించేవాడు, విషమిప్పించేవాడు, యెంతో యెత్తునుంచి వేయించేవాడు, కొండచర్యలో త్రోయించేవాడు, కట్టించేవాడు, ఘోరం[illegible] బాధించేవాడు, ఆ బాలుణ్ణి వీడు క్రోధంతో చేయించేవాడు. కాని ప్రహ్లాదుడు చావలేదు.

దానికి హిరణ్యకశిపుడు తల కొట్టుకొంటూ ఎలా వీడు చస్తాడని ఆలోచించాడు. ఆ సమయంలో తండ్రి తెలివి లేని ఊహలకు చిరునవ్వు నవ్వి ఓ అమాయకపు తండ్రీ!

"లోకములన్నియున్ గడియలోన జయించినవాడ, వింద్రియా
నీకము, చిత్తముం గెలువ నేరవు, నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకర శత్రు లార్వుర ప్రభిన్నుల జేసిన ప్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా!"

"నీకు విరోధులున్నారని భ్రమించుచున్నావు, లోకాలన్నీ గడియలోన జయించేవాడవేనైనా, నీ యింద్రియాల్ని, నీ చిత్తాన్ని జయించలేక పోయావు, నీలోగల కామ, క్రోధాదులు ఆర్గురు శత్రువు లున్నారు, వీరే నిన్ను పట్టి బాధించుచున్నారు. నువ్వు నేర్పుతో ఆలోచిస్తే నీకు విరోధి ఒకడూ లేడు.

ఆహా! ఏమి పద్యం? యిది మూడు కాలాల్లో ప్రతి మనిషి జీవితానికి సంబంధించింది గదా!

అది విని హిరణ్యకశిపుడు హరీ! హరీ! అని అఘోరించుచున్నావు, ఆ హరి యెక్కడరా? అనగా ప్రహ్లాదుడు—

"కలఁడంబోధిఁ, గలండు గాలిఁ, గలఁడాకాశంబునన్, గుంభినిం
గల, డగ్నిన్, దిశలన్ బగళ్ళ నిశలన్, ఖద్యోతచంద్రాత్మలన్,
గల డోంకారమునం, ద్రిమూర్తుల, ద్రిలింగ వ్యక్తులం
దంతటన్
గల డీశుండు, గలండు దండ్రి! వెదకంగా నేల యీ యా
యెడన్."

హిరణ్యకశిపుడు కోరిన వరాల్లాగే, ప్రహ్లాదుడు శ్రీవిష్ణుని ఉనికి నిలా చెప్పాడు

తండ్రీ! యిచ్చటా అచ్చటా శ్రీవారిని గూర్చి వెదుకుటెందుకు? యెచ్చట నీవు చూడగలిగితే అచ్చటే కాన్పిస్తాడు.

సముద్రంలో, గాలిలో, అకాశంలో, భూమిలో, అగ్నిలో, దిక్కుల్లో, పగలూ, రాత్రుల్లో, సూర్య, చంద్రాదు లాత్మల్లో. ఓంకారంలో, త్రిమూర్తుల్లో, త్రిలింగ వ్యక్తుల్లో, అంతటా ఉన్నాడు. లేనిచోటు లేనేలేదు.

అంతే కాదు—

"ఇందు కల డందు, లేడను
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి వింటే?"

ఇదిగో ఓ దానవాగ్రణీ! నీవు నా మాట వింటే, "యిందు కలడూ" అంటున్నాను; ఎందువల్ల? నేను చూచాను కనుక; నీవు శ్రీహరిని చూడలేదు కనుక యెచ్చటా లేడను చున్నావు. శ్రీహరి సర్వమూ నిండియేయున్నాడు, నీవెచ్చట వెదకిన అచ్చట తప్పకుండా కన్పిస్తాడు.

ఈ పద్యం ప్రతివారికి వచ్చియే తీరుతుంది. యిచ్చటితో భాగవతంలో గల ప్రఖ్యాతి వహించే ప్రహ్లాద చరిత్ర పూర్తయింది.

## గజేంద్ర మోక్షం

ఇది గజేంద్ర మోక్షం. యిది యోగేశ్వరోపాసనతో గూడింది. అందుకే భాగవతంలో దీనికి ఒక ప్రత్యేకత కాన్పిస్తుంది. పరీక్షిత్తు శుకమహర్షి నడుగుతాడు. మహాత్మా!

"నీరాట వనాటములకు
బోరాటం బెట్లు గల్గె? పురుషోత్తముచే
నారాట మెట్లు మానెను?
ఘోరాటవిలోని భద్ర కుంజరములకున్?"

ఏమి ప్రశ్న? మంచి ప్రశ్న వేస్తే మంచి జవాబు వస్తుంది. పోతన మహాకవి కవిత్వంలోగల చమత్కారం యిందెంతో కన్పిస్తుంది! నీటిలోగల దానికి, వనములో నున్న దానికీ పోరాట మెలా కలిగింది? పోనీ కలిగిందే అనుకుందాం, ఆ యుద్ధం పురుషోత్తముచే ఎలా శాంతించింది? ఘోరమైన మహారణ్యంలో బహు భద్రంగా ఉన్న యేనుగుకు యీ మొసలికీ యుద్ధమా? ఆశ్చర్యంగా లేదూ! అదే మహాకవి యొక్క గొప్పతనం. న్యాయవాదికీ, కవికీ యెత్తుగడ ఎంతో యెత్తునుంచి రావాలి? ఈ పద్యం ప్రాసం గలది, "నీరాట - పోరాట - ఆరాట - ఘోరాట" భాషా యోషకీయలంకారాలు అద్భుత సౌందర్యాన్ని చేకూరుస్తాయి.

ఈ దిగువ పద్యాన్నీ, వీనిలోగల నిగూఢార్థాన్ని తీసిన సంప్రదాయజ్ఞులు శ్రీ పోతన రామభక్తునిగా గుర్తించి జోతలందించారు.

మొసలి నీటిలో దిగిన గజేంద్రుని యెంచక్కా పట్టుకుందో యిందు అద్భుతంగా చెప్పబడింది.

"పాదద్వంద్వము నేలమోపి, పవనున్ బంధించి,
పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి "బుద్ధిలతకున్ మారాకు హత్తించి" ని
ష్ఖేద బ్రహ్మపదావలంబన గతిం డించు, యోగీంద్రుదు మ
ర్యాద నక్రము విక్రమించె కరి పాదాక్రాంత నిర్వక్రమై"

పరమాత్మను పట్టుకొనదలచిన యోగీంద్రుని మర్యాదతో మొసలి ఏనుగును అడ్డులేని మహాబలంతో పట్టుకొన్నది

ఈ పద్యం రెండవపాదంలో "బుద్ధిలతకున్ మారాకు హత్తించి" అని ఉంది. "బుద్ధి అనే లత మరో ఆకును తొడిగింది, అనే అర్థం మామూలుగా అందరూ చెప్పుకొన్నదే! పోతే "మా" "రా"కు హత్తించి" అనగా రా ప్రక్క మా చేర్చిన అవుతుంది "రామా" అన్నమాట. మహాకవి ఎంత చక్కగా యిచ్చట రామా శబ్దాన్ని యిమిడ్చాడు?

ఇక యోగీంద్రుని మర్యాదను తిలకిద్దాం.

మొసలి తన రెండుపాదాల్ని గట్టిగా నేలకానించి, తనలోనున్న గాలిని కుంభించి, పంచయింద్రియాల పరుగుల్ని

అరికట్టి. బుద్ధి అనే లతకు యింకొక ఆకు తొడిగి, అనగా బుద్ధియోగాన్ని రెట్టించి, సర్వమూ పరమాత్మయందే యుంచి క్రీడిస్తాడు యోగి. అలాగే మొసలి. యెంత శ్లేషగా వ్రాశాడు పోతన మహాకవి ?

గజేంద్రునికి యేదిక్కూ తోచలేదు. అప్పుడు ఈశ్వరుని ప్రార్థించింది.

"ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపల నుండు లీనమై,
యెవ్వని యందు డిందు బరమేశ్వరుఁడెవ్వడు, మూలకారణం
బెవ్వ, డనాది మధ్యలయుడెవ్వడు, సర్వము దానయైనవా
డెవ్వడు, వాని, నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్."

ఈ పద్యంలో ఏకేశ్వరోపాసనంతా యిమిడుంది;

జగం ఎవనిచేత సృష్టింబడుతుంది? "ఈశ్వరుని చే" అని జవాబు. లీనంగా యెవనియందుంటుంది ? ఈశ్వరుని యందు. ఎవనిలో నిల్చి ఉంటుంది? ఈశ్వరునిలోనే. పరమే శ్వరు డెవ్వడు? ఈశ్వరుడే. మూలకారం ఎవడు? ఈశ్వరుడే. సర్వమూ తానె ఐన వాడెవడు? ఈశ్వరుడే. ఆత్మభవు డెవడు? ఈశ్వరుడే. ఎంత అలంకారం కలదీ పద్యం ! సర్వా లంకారాలూ గలదే; అటువంటి ఈశ్వరునే వేడికొంటాను.

"లోకంబులు, లోకేశులు,
లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వడు
నేకాకృతి వెలుగు నతనినే సేవింతున్."

ఈపద్యం కూడ సాలంకారం గలదే!

లోకాలూ, లోకపాలకులు, లోకాల్లో నివసించేవారూ అంతమందిన తరువాత ఒక అలోకం యేర్పడుతుంది. అప్పుడు మిగిలింది చిమ్మ చీకటి, గాఢాంధకార బంధురం. అప్పుడు చీకటి కవతలి భాగంలో ఒంటిగా వెలిగిన అనగా జ్యోతి స్వరూపునిగా ఉన్న వానినే ఈశ్వరునే నుతిస్తాను.

ఈ పద్యం సర్కస్ ఫీట్సు లాంటి కవితాచిత్రాలంకారం.

"నర్తకుని భంగి, బెక్కగు
మూర్తులతో నెవ్వడాడు? మునులున్, ద్విజులున్
కీర్తింపనేర; రెవ్వని :
వర్తన మొరుతెరుంగ కట్టివాని నుతింతున్."

నాట్యవేత్త ఏవిధంగా రకరకాల పాత్రలతో రాణిస్తాడో అలాగే అనేక రూపాల్లో ఆడి మునులూ, బ్రహ్మవేత్తలూ, దేవతలూ కూడ ఎవని స్తోత్రం చేయలేరో! ఎవని ఉన్న రూపు నెవరూ తెలిసికోనలేరో!, అటువంటివాని ఈశ్వరునే స్తోత్రం గావిస్తాను.

"కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణములపాలం,
గలడందు రన్ని దిశలను,
గలడు గలం డనెడివాడు గలడో? లేడో?"

దీనుల యెడ ఉన్నాడంటారు, పరమయోగులందూ ఉన్నా డంటారు, నాల్గు దిక్కుల్లోనూ ఉన్నాడంటారు, "ఉన్నాడు ఉన్నాడు" అనేవా డసలు ఉన్నాడో? లేడో?

మనిషికి సందేహముండరాదు. ఆ సందేహమే మనిషిని కాకుండా, ఆతనిపని యేదీ కాకుండా చేస్తుంది. అని యీ పద్యం ముఖాన మహాకవి సందేశ మిచ్చాడు.

గజేంద్రుని సందేహం వలనే ఈశ్వరుడు అతని రక్షణకు రాలేక పోయాడు. ఇది విషయం మనకు చెప్పడ మన్న మాట.

"లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె
బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె, దనువున్ డస్సెన్,
శ్రమంబయ్యెడిన్,
"నీవే తప్ప యితః పరం బెరుగ, మన్నింపందగున్ దీనునిన్"
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!"

ఈ పద్యంలో భక్తుడు భగవంతుని చేరే విధానం నిరూపింప బడింది.

నేను చిక్కిపోయాను, ధైర్యం చెదరింది, ప్రాణాలు వాటి స్థానాలు తప్పుతున్నాయి. మూర్ఛ వచ్చింది, శరీర మంతా డస్సింది, శ్రమయింది, నీవు తప్ప నాకింకెవరూ లేరు.

నా తప్పులు మన్నించు, దీనుడను, రక్షింపగా యీశ్వరా రమ్మని, భద్రాత్మకా;

ఇచ్చట ఒక చమత్కారం చారు సమ్మోహనరాగ రసం కన్పిస్తుంది. యీ క్రింది పద్యాల్లో వింతలు చూద్దాం.

"అలవైకుంఠపురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము "పాహి! పాహి" యన గుయ్యాలించి
సంరంభియై"

మొసలి పట్టు విడిపించుకోలేని గజరాజు మొరపెట్టి మొరపెట్టి, కొంతవరకు సందేహించి, తరువాత దిక్కుతోచక చివరకు "నీవే తప్ప యితః పరంబెరుగ" నని చేతులెత్తాడు. అప్పుడు శ్రీమన్నారాయణు డెలా ఉన్నాడో పై పద్యం నిరూపిస్తుంది.

వైకుంఠపురంలో ఆమూల సౌధంబు దాపల మందార వనంలో, అమృత సరోవరం ప్రక్కన ఉన్న చంద్రశిలా వేదిపై కలువ పూపాన్పుపై కూర్చొన్న ఆపన్న ప్రసన్నుడు గజేంద్రుని మొర ఆలకించాడు.

"సిరికిం జెప్పడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింప డే
పరివారంబు జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్కనొత్తడు వివాదప్రోద్ధత శ్రీ కుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై"

ప్రక్కనున్న శ్రీదేవికి చెప్పలేదు, శంఖ చక్రాలు ధరించలేదు. పరివారాన్నైనా పిలువలేదు. గరుత్మంతుని కూడా పిలువలేదు. ఇంతెందుకు? సరస పరిహాసాకుశలుడై శ్రీలక్ష్మి పైటచెరగు పట్టుకొని గజేంద్ర రక్షణ కొరకు లాక్కొని పోతున్నాడు.

"తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దాని వెన్కను బక్షీంద్రుడు, వానిపొంతను ధనుః కౌమోదకీ శంఖ చక్రనికాయంబును, నారదుండు, ధ్వజనీకాంతుండు దావచ్చిరో య్యన వైకుంఠపురమునంగలుగు వా రాబాలగోపాలమున్"

ఇలా లాక్కొని పోతున్న నారాయణుని వెంట శ్రీలక్ష్మి, తరువాత అంతః పరివారం గరుత్మంతుడు, శంఖ చక్రాదులు, నారదుడు మొదలగు వైకుంఠపురంలో గల ఆబాలగోపాలం బయల్దేరి వచ్చారు.

"తనవేంచేయు పదంబు పేర్కొన డనాధ స్త్రీ జనాలాపముల్ వినెనో, మ్రుచ్చులు మ్రుచ్చిలించిరో, బొలువ
వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధు డేడి చూపుడని ధిక్కారించిరో దుర్జనుల్."

శ్రీదేవి మనసులో అనేకాలోచన్లు పొరలాయి. తానెచ్చటికి వెడుతున్నారో చెప్పరు, అనాధస్త్రీ దీనారావం విన్నాడో, దొంగలు దొంగిలించారో, దుర్మార్గులు

వేదాల్ని పట్టుకుపోయారో, అమరావతిపై అసురులు దండె త్తేరో, భక్తుల్ని నీ భగవంతుని చూపుమని దుష్టులు బాధి స్తున్నారో అని అనుకొని వెంటనేగుతుంది. అడగడానికి వ్యవధే లేదు. మడుగుదగ్గర కందరూ వెళ్ళేరు.

చక్రాయుధంతో మొసలిని ఖండించాడు గజేంద్ర రక్షణ జరిగింది. యిందులో విషయ మేమిటంటే "అలవై కుంఠ పురంబులో" అని యెత్తుకొని మత్తేభ వృత్తంలో తరువాత వరుసగా "సిరికిం జెప్పడు" అని మత్తేభ వృత్తాన్నే ప్రయోగించి, తరువాత "తనవెంటన్ సిరి" మత్తేభమే, మరల "తనవేంచేయు పదంబు పేర్కొనడు" ఇచ్చటా మత్తేభ వృత్తమే, మరల "వినువీధిం జనుదేర గాంచి రమరుల్" అను నదీ మత్తేభ విక్రీడితమే, అటుతరువాత "చనుదెంచెన్ ఘను డల్లవాడె హరి పజ్జంగంటిరే లక్ష్మి" అని మరల మత్తేభ వృత్తాన్నే వ్రాసి, ఆఖరుకు "కరుణాసింధుడు శౌరి వారిచర మున్ ఖండింపగా బంపె"అన్న పద్యాన్నీ మత్తేభాన్నే పైకె త్తేడు. ఆహా! యీమొత్తం ఘట్టాన్నంతా మత్తే భాలతోనే నడిపించావామహాకవి.

యిందులో యేదైనా రహస్య ముందా ?

మొట్టమొదట "మత్తేభ యూధంబు మడుగుసొచ్చె" అని వ్రాశాడు. మత్తేభ దీనాలాపంతో భగవానుని హృదయ మంతా మత్తేభ మయింది. అటువంటి దివ్యుని ఆరాధనా

హృదయం కూడా మత్తేభమయం కాకుండా ఎట్లా ఉండగలదు ? అందువలన పోతనగారు కూడా అన్నీ మత్తేభాలే వ్రాశారిచ్చట లేకున్న అన్ని మత్తేభా లెందుకుంటాయి యిచ్చట? యీ ఘట్టాన్ని యిలా ముగించాడు మహాకవి.

## 3 వ స్త బ కం

పరమశివుడు హాలాహలము మ్రింగు సందర్భమున—

శుకమహర్షిని జూచి పరీక్షిత్తు "మహాత్మా! ముల్లోకాలనూ కల్లోల మొనరించే హాలాహలాన్ని హరుడు మ్రింగుటకు సగభాగమైన ఆర్యాదేవి యెలా ఒప్పుకొన్న" దని ప్రశ్నకు శుకమహర్షి

"మింగెడువాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ !
మంగళ సూత్రంబు నెంత మది నమ్మినదో!"

ఫుట్‌నోట్ —

మంగళసూత్రము నమ్మెచు
మంగళమగు ననుచు సర్వమంగళ ధవునిన్
మ్రింగమనె హాలాహలమును
పొంగుచు లోకంబులెల్ల పొంగగ నధిపా !

కలకత్తా ఆంధ్ర సంఘంవారి ప్రశ్నకు ఈ వ్యాఖ్యాత చెప్పిన పద్యం—

ఆహా ! యేమి అద్భుత భావం ?

మ్రింగేవాడు విభుడనీ, మ్రింగెడిది మహా విషమనీ తెలుసును ఎవరికి సర్వమంగళకు; ఐనా లోకాలన్నీ సంతోషిస్తాయని, మంగళ సూత్రాన్ని నమ్మి తినమన్నది. "సర్వ మంగళ – మంగళసూత్రం" యీ రెండు శబ్దాల్లో ఉన్న దంతా ఉంది. మహాకవి ప్రయోగం.

"హరుడు గళమునందు హాలాహలము పెట్ట
గప్పు కలిగి తొడవు కరణి నొప్పె
సాధు రక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేణ్య!"

పరమశివుడు గరళాన్ని మ్రింగి గళములో నుంచుకొనగా ఆతనికి శరీరమంతా తెలుపు కంఠం వద్దర నలుపు వికారంగా లేక అదొక అద్భుతమైన నీలమణిగా నైయింది. సాధు జనరక్ష భూషణమే అవుతుంది గదా ! యీ తీర్పు పోతనగారి దెంత చక్కగా ఉంది ?

యిక మహాత్తర ఘట్టమైన వామన చరిత్రను వీక్షిద్దాం

"అన్నమైన, దోయమైన, ద్రవ్యంబైన
శాకమైన దనకు జరుగు కాలది
నతిథి జనుల కడ్డపడక యిచ్చురేని
వేము ! వారు కలిగి లేనివారు"

"అతిథిని చూచి కశ్యప ప్రజాపతి పలికిన పలుకు లివి. అన్నమో, నీరో, ద్రవ్యమో, శాకమో తనకు కలిగిన దానిలో నుంచి అతిథుల కివ్వరిడనో వారు కలిగియు లేని వారే సుమా!" బంగారు కైతైన మాటలు,

దానధౌరేయుడైన బలిచక్రవర్తిని సూచిన వామనుడు

"ఇతడే దానవ చక్రవర్తి! సురులోకేంద్రాగ్ని కాలాది దిక్పతి గర్వాపనయ ప్రవర్తి! గతలోభస్ఫూర్తి! నానామఖా
వ్రత దానప్రవణానువర్తి! సుమనోరామామనోభేదనో
ద్ధత చంద్రాతపకీర్తి! సత్య కరుణ ధర్మోల్లసన్మూర్తి దాన్"

కవికి పద్యం ఎత్తుగానే నేర్పు తెలియాలి. అది అందరి సొమ్ము కాదు. చూడండి పై పద్య మెంత మహత్తరమైన యెత్తుబడియో!

ఇతడే దానవ చక్రవర్తి! ఈడే రాక్షస చక్రవర్తి!! ఇతడే దానవ చక్రవర్తి? యీతడు దానవచక్రవర్తి కానే కాడు; ఐనచో శ్రీవిష్ణు ప్రీతిగా శతాశ్వమేధ యాగాలు చేయునా? అందుచేత కాడు. ఇతడే దానవ చక్రవర్తి, ఈతడే మానవ చక్రవర్తి; కారణం రాక్షస చక్రవర్తు లెవరూ శ్రీ మహావిష్ణు భక్తులు లేరు గనుక!

అంతే కాదు అష్టదిక్పాలుర గర్వాన్ని ఖర్వమొనర్చిన వాడూ యితడే! అణుమాత్రమైనా లోభంలేని చక్రవర్తి యితడే! అంతేకాదు అనేకానేక యజ్ఞయాగా లొనర్చి,

ఆ యాగాంతాల్లో మహత్తర దానయోగ చక్రవర్తి యితడే! అంతేకాదు, సత్య దాన దయా - ధర్మాలు మూర్తీభవించిన చక్రవర్తీ యితడే !

యేమి యీ పద్యనిర్మాణం!

వామనుడు కుశ పవిత్రాక్షతలు గల దక్షిణ హస్తమెత్తి—

"స్వస్తి! జగత్త్రయీ భువన శాసనకర్తకు, హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు, సుధాపదవ్యవహర్తకున్, మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు, నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు, దానవలోక భర్తకున్"

మహాదాన ధౌరేయుడైన బలీంద్రునికి ముందుగా స్వస్తి పలికాడు. "స్వస్తి" శబ్దానికి "జయము - ముగింపు" రెండర్థా లున్నాయి. అనగా బలిచక్రవర్తికి జయము - మరియు ముగింపూ రెండు అర్థాలూ అన్వయించే లాగున పలికాడు. మూడు భువనాల్నీ శాసించే వానికి స్వస్తి!, మూడు భువనాలనూ శాసించేవాడు శ్రీవిష్ణు. ఐన బలి శాసకర్త యెలా ఔతాడు అదే కవితా చమత్కృతి తో వామనమూర్తి వ్యంగ్య హాస్యం ఉందిందులో. చిరునవ్వుతో మహేంద్రుని- గూడా విధ్వస్తం గావించేవానికి స్తి! యిందులో గూడా వ్యంగ్య ధోరణి ఉంది. మహాదార నా నికి అర్హుడైనవానికి స్వస్తి! మహామునీంద్ర వందితుడై

మంగళకర యోగాట గావించే విహర్తకు స్వస్తి! దేవకాంతల గళసీమల నలంకరించే మంగళసూత్రా లపహరించే వీనికి స్వస్తి !

యిందులో యెంత హాస్యాద్భుత యోగభావముందో చెప్పలేం.

బలిచక్రవర్తి అడిగిన ప్రశ్నకు వామనమూర్తి

"ఇవి నాకు నెలవని యేరీతి బలుకుదు
    నొక చోటనక నిండి యుండనేర్తు,
నెవ్వని వాడ నం చేమని పలుకుదు
    నాయంతవాడనై నడపనేర్తు,
నీ నడవడి యని యెట్లు వక్కాణింతు
    బూని ముప్పోకలఁ బోవనేర్తు,
నదినేర్తు, నిదినేర్తు నని యేల చెప్పంగ
    నేరుపు లన్నియు నేన నేర్తు,

నొరులు గారు నాకు, నొరులకు నేనాదు
నొంటివాడ జుట్ట మొకడు లేడు
సిరియు దొల్లి గలదు చెప్పెద నాటెంకి
సుజనులందు తరచు జొచ్చియుందు"

మహా వ్యంగ్య వైభవము గలదీ పద్యం.

నా ఉనికి యిదీ అది అని ఎలా చెప్పేది ? ఒకచోటన కుండా అంతటా నిండి వుంటాను.

నే నెవ్వరి వాడనని చెప్పుట నాయంతటి వాడిగా నడవనేర్తును.

ఈలాగు నా నడవడియని చెప్పలేను మూడు విధాలా పోతుంటాను.

అది నేర్తునూ, యిది నేర్తునని చెప్పగలనా?

నేరుపు లన్నీ నేను నేర్చాను. ఒరు లెవ్వరూ నాకు కారు, నేనుమాత్రం ఒరుల కౌతాను, ఒంటివాడను, చుట్టం ఒక్కడు లేడు, సిరి తొలి ఉండేది, యింతెందుకు మంచి వారిలో తరచుగా ఉంటాను. నేను శ్రీమహావిష్ణువునని చెప్పక చెప్పాడు. అద్దిరా యీ పద్యం అమోఘం.

"ఒంటివాడ నాకు నొకటి రెండడుగులు
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల,
కోర్కె దీర బ్రహ్మ కూకటి ముట్టెద
దానకుతుక సాంద్ర! దానవేంద్ర!"

బలిచక్రవర్తికి వామనుని జవాబు.

బలీంద్రా! నే నొంటి వాడనని ముందు చెప్పానుకదా! అందువలన నాకు ఒకటి + రెండు = మూడడుగులు భూమి మాత్రమే నాకావాలి, ధనం మాత్రం వద్దు. దానము చేయుటయందే మహానందము పొందిన దానవేంద్రుడవు గాదా! దానికి బలి ఆశ్చర్యముతో:

"వసుధా ఖండము వేడితో, గజములన్ వాంఛించితో వాజులన్
వెస నూహించితొ, కోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీ వడుగ, నీభాగ్యంబు లీపాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీనేర్చునే?"

అయ్యా! నీవు పసిబాలుడవు, అడుగుట కూడా నీకు చేతకాదు. భూమిఖండ మంతా అడిగావా? ఏనుగులుగాని, గుఱ్ఱాలనుగాని, నవయవ్వనవతులగు స్త్రీలనుగాని వాంఛించావా? యీమాత్ర భాగ్యమీ అసురేంద్రు మూడడుగులు యియ్య నేర్చునే! అప్పుడు వామనుడు

"గొడుగో, జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మమెక్కడ, మదాకాంక్షామితంబై మూ
డడుగుల్ మేరయె త్రోవ చ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్"

అయ్యా! మహానుభావా! గొడుగో, జందెమో కమండలమో, మొలత్రాడో, దండమో నాకావాలి! ఏంచేత నేను బ్రహ్మచారిని కనుక, భూములు, యేనుగులు వామాక్షులు, గుఱ్ఱాలూ యెందుకు? నే నివ్వలేననకుండా

నాకు-వలసిన మూడడుగులు నీవీయగలిగితే అదే నాకు బ్రహ్మాండమౌతుంది;

"వ్యాప్తిం బొందక, వగవక
ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్
దృప్తిం జెందని మనుజుండు
సప్త ద్వీపముల నైన జక్కంబడునే ?
ఓ బలీంద్రా !

కావాలని అనక వగవకుండా, తనకు ప్రాప్తించిన అటుమాత్రమైన అదే చాలా యెక్కువని ఆనందించ తృప్తి లేని మానిసికి సప్తద్వీపాలు వచ్చినా సంతోషించ గలడా ? అనీ, అటువంటి తృప్తిలేనివాడు సప్తద్వీపాల్లో ఎచ్చటైనా బ్రతకగలడా ?

యీ పద్యం సంస్కారం ఉన్నవారెందరో ఉపమానంగా వాడతారు.

"ఆశాపాశము దా గడున్నిడుపు వేదంతంబు రాజేంద్ర ! వారాశి ప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం గాసింబొందిరిగాక వైన్య, గయ భూకాంతాదులున్నర్థ కామాశన్ బాయగ నేర్చిరే మును నిజాశాంతంబుఁం జూచిరే"

దానవీరా! యిదికూడా విను.

ఆశ అనే త్రాడు చాలాపొడవు. దీనికి అంతమే లేదు. నాలుగు సముద్రాల మధ్యస్థలములో నున్న భూభాగమంతా

చేస్తూరినా యింకా యెక్కువ కావాలనే దురాశాపరు లయ్యేరే గాని "వేనుడు - గయుడు" మొదలైనవారంతే ఆశను విడిచారా? యిచ్చట మహాకవి ధ్వని నిరూపించాడు. "ఆశా తృష్ణా దిశా ప్రోక్తా" "ఆశ"కు దిక్కు, తృష్ణ రెండర్థాలున్నాయి. వారు "నిజాశాంతంబులం జూచిరే" అనగా ఆశను విడువలేదనీ, దిగంత ఖ్యాతి నార్జించలేదనీ చెప్పుకోవాలి.

యిలా వామనుడు పలుకగా, శుక్రాచార్యులు బలి చక్రవర్తికి "యీ వామనుడు త్రివిక్రముడైన శ్రీహరి; నిన్ను మోసంచేయడానికే వచ్చాడు. వీనికి అడిగినది యెంత మాత్రం యియ్యవద్ద"ని చెప్పగా బలి

"కారే రాజులు రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటగట్టికొని పోవంజాలిరే? భూమిపై
బేరైనంగలదే?, శిబి ప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కెలు వారలన్మరచిరే యిక్కాలమున్ భార్గవా!"

గురుదేవా ! ఎందరో రాజులు రాజ్యాలను పాలించి గర్వంతో విర్రవీగలేదు, పోనీ వారి సిరుల్ని వారితో పాటు మూటగట్టుకు పోయారా? వారి పేరైనా యీ భూమాతపై ఉందా ! మహాదానవీర ధారేయులు "శిబి" మొదలైన ప్రముఖ చక్రవర్తులును మహాసంతోషంతో కోరిన వారి కోర్కెలు తీర్చలేదా? అటువంటి వారిని యిప్పుడు కూడా యెవరైనా మరువ జాలిరా ,

అంతే కాదు - మీరన్నట్లు

"ఉడుగని క్రతువుల వ్రతముల
బొడగన జననట్టి పాదవు, పాదవున గురుచై
యడిగెడినట! ననుబోటికి
గడరాదె మహానుభావ యిష్టార్థంబుల్"

యజ్ఞయాగాది మహాక్రతువు లొనరించిన వారికి కూడా కానరాని శ్రీవిష్ణువు నిజముగా యీతడైన పదు నాల్గు భువనాలు నిండి పాదవులలోకెల్ల పాదవగు నాతడు బహుకుఋచగా వచ్చి నన్ను యాచించాడు కదా! అటువంటి వాని కోర్కెలు తీర్చుట తప్పా?

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై, దనువుపై, నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై, గపోలతటిపై, బాలిండ్లపై, నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నాకరంబుంట మే
ల్గాదే? రాజ్యము, గీజ్యమున్ సతతమే? కాయంబనాపాయమే"

యీ పద్యంలో చాలా గంభీరార్థ మున్నది. శ్రీ మహాకవి పోతనను నుతించడానికి నాకు భాషలో శబ్దాలే దొరుకలేదు.

మొదటిసారిగా శ్రీలక్ష్మి తలనీలాలపై, శరీరంపై, భుజములపై నున్న పైటపై, పాదపద్మాలపై, చెక్కిళ్ళపై, పాలిండ్లపై, శ్రీహరియొక్క దివ్యహస్తం స్పృశించి ఆనంద మందింది. అటువంటి నూత్నమర్యాద నందిన ఆ పవిత్ర

హస్తం క్రిందై, నా హస్తం పైనున్న కంటె యింకేమి కావాలి నాకు ? యీ రాజ్యం శాశ్వతమా ? యీ శరీరానికి అపాయం లేకుండా ఉంటుందా ?

---

ఫుట్‌నోట్ : 1963 సం॥ తూ॥ గో॥ జిల్లా కోరుకొండలో జగత్ప్రసిద్ధులగు శ్రీమాన్ టి. కె. గోపాలాచార్యులవారి అన్నగారు, మహాకవులూ, అష్టావధానులూ, శ్రీమాన్ టి. కె. వరాహస్వామివారి ఆధ్వర్యంలో ఈ వ్యాఖ్యాత వామన చరిత్ర ఉపన్యసిస్తూ—

కన్యామణికి వివాహానంతరం నూత్న దంపతుల ప్రథమ సమాగమం అదే శోభన మంటారు. నూతన వరుడు ఆమెను దగ్గరకు తీసుకొని మంచంపై కూర్చుండబెట్టి ఆమె జుట్టును దువ్వి లాలిస్తుండుటయే "ఆదిన్ శ్రీసతి కొప్పుపై" అనగా మొట్టమొదటి సారిగా తలపై తన హస్తహంతో స్పృశిస్తాడు, ఆ తరువాత ఆమె శరీరాన్ని తాకి స్పృశిస్తాడు, తరువాత ఆమె భుజముపైనున్న ఉత్తరీయం అనగా పైటను లాగును, దానివలన ఆమె అంతకుముందెన్నడూ మగవాడు ముట్టని ఎరగనందున, సిగ్గుతో మంచంపై ముడుచుకు పోతుంది. అప్పుడాత డామె పాదాలదగ్గర చేరి పాదాలు సాచేలాగు చేసి ఆమె చెక్కిళ్ళు ముద్దిడుకొని పాలిండ్లు చక్కబరచి ఆమెకు సిగ్గూ బిడియం భయం, కొంకూ, అనుమానం అన్నీ నెమ్మదిగా జారేలాగ చేసి ఆమెకు ఆమె యిష్టంపైనే సుఖాన్ని చేకూరుస్తాడు. అదీ నూత్నమర్యాదం జెందు కరమనగా !

(పుట్‌నోట్ తరువాయి పేజీలో)

"నిరయంబైన నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన, గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ముపో
హరుడైనన్ హరియైన, నీరజభవుం డభ్యాగతుండైననా;
దిరుగన్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య! వేయేటికిన్"

ఆహా ! యేమి విధాన్యతగలదీ పద్యం

ధీవర్యుడవగు గురుదేవా! నాకు నరకమురానీ, బంధన
రానీ, యీ భూదేవి నిర్మూలింపబడనీ, దుర్మరణమేరానీ,
నా రాక్షసకులం అంతమందనీ, నిజముగా యివన్నీ రానిమ్ము,
యేమి జరిగినా కానీ, హరియే కాదు, హరుడైనా, బ్రహ్మ
దేవుడైనా నన్నడగడానికి వచ్చి అడిగినప్పుడు మాత్రం
యిస్తాను చెప్పిన నా నోటికి తిరుగులేదు. మీరు వేయి
చెప్పండి నేను వినను.

యింత చెప్పిన మహాకవి ముక్తాయింపు వినండి.

వాత్సాయన మహర్షి కామసూత్రాలకు ధ్వని స్ఫూర్తి
కాన్ని పోతన మహాకవి తెలుగులో అవసరమైన సమయం
చూసి యీ పద్యంలో మన కందించాడు" అని చెప్పగా
నిత్యమూ శ్రీ మహాభాగవతాని పారాయణచేసేవారు
కూడా ఎంతో ఆనందించి, ఈ వ్యాఖ్యాత
ఈ మహాకవిలో వెలికేవాని శక్తిని బ[illegible] రత్నాలు మనకు
లభింపగలవని మనవి.

"బ్రతుక వచ్చుగాక!, బహుబంధనములైన
వచ్చుగాక!, లేమి వచ్చుగాక!,
జీవ, ధనములైన జెడుగాక!, పడుగాక
మాట, దిరుగలేరు మానధనులు."

అంటే బ్రతుకుండనీ, యెన్నివిధాల బంధనలైనరానీ, లేమికూడా రానీ, ప్రాణమూ ధనమూ పోయిన పోనీ, మాట పడిన పడనీ, యిచ్చినమాట తిరుగలేరు మానధనులైనవారు. "మాట పడుట" అనగా యెందరిచేతనో నిందింపబడుట, లేదా నోటిమాట కూడా మూగవోవుట. అంతటివానిగా బలిచక్రవర్తిని తీర్చి దిద్దాడు మహాకవి.

ఫుట్‌నోట్ : కవితా కళానిధి శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతం ఈ వామనచరిత్రలో గల యీ ఘట్టాన్ని యెంత కాలమో పారాయణచేసి, తన "సత్యహరిశ్చంద్రీయ నాటకములో" హరిశ్చంద్రునితో యిలాంటి సమయాన యేమని పించాడో వినండి,

"ఇటులెంతైన ధ ంబు చ్చినను రానీ, గాధిరాట్సూనతి నా
కెటు కష్టంబులు చ్చె నియ్యును దేవీ! సర్వభోగమ్ము ల
టికి నా జడదారి యి చ్చనను నీనీ త్యమ్ముందప్ప, నే
టు కార్యార్థటు ధూరెనే యు విన్నుం మీరు
ముమ్మాటికిన్."

పోతన వేరొక ముక్తాయింపు పలికాడు.

"కమలనాథు నెఱిగి, కాలంబు దేశంబు
నెఱిగి, శుక్రుమాట లెఱిగి, నాశ
మెఱిగి, పాత్రమనుచు నిచ్చె దానము బలి
మహీ వదాన్యుఁడొకఁడు మరియుఁగలడె?"

వచ్చినవాడు శ్రీపతి అని తెలిసినా, తనకు యెంతో బాధ కలుగుతుందని తెలిసినా, తానుకూడా నశిస్తానని తెలిసినా బలిచక్రవర్తి దానానికి తగిన పాత్ర అనగా తగిన వాడు లభించాడని దానంచేశాడు; కనుక యీ భూమిలో బలిచక్రవర్తిని మించిన దానవీరు డెవరున్నారు ?

"ఇంతింతై, వటు డింతయై, మరియు దానింతై, నభోవీధి పై నంతై; తోయదమండలాగ్రముల కల్లంతై ప్రభారాశిపై నంతై; చంద్రునికంతయై ధ్రువునిపై నంతై, మహర్వాటిపై నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై."

"రవిబింబంబుపమింప బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై, శ్రవణాలంకృతమై, గళాభరణమై, సౌవర్ణ కేయూరమై, ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంట్రమై, నూపుర ప్రవరంబై; పదపీఠమై వటుడు దా బ్రహ్మాండము నిండుచున్"

మూడడుగులే అడిగిన వామనమూర్తిని చూడండి

ఇంతింతై, తరువాత దానింతై, ఆకాశాని కంతై, మేఘమండలాగ్రాని కల్లంతై సూర్యమండలాని కంతై,

చంద్రునంత, ధ్రువుడంత నభోమండలానికంతై, సద్యసదంతో బ్రహ్మాండమంతయ్యాడు.

ఈ వామన బ్రహ్మారికి—

సూర్యబింబం గొడుగయింది, శిరోరత్నంగా, చెవుల కలంకారమై. గళానికి ఆభరణంగా, బంగారు భుజకీర్తులుగా, కంకణముగా, నడుముకు వస్త్రంగా, కాళ్ళకు పెండెరంగా, పాదపీఠంగా వటుడు బ్రహ్మాండమంతా నిండిపోయాడు.

"ఒక పాదంబున భూమి గప్పి, దివి వేరొంట
న్నిరోధించి, యొం
డొకటస్మీద జగంబులెల్లదోడి నొండొంటన్ విలంఘించి, ప
ట్టక బ్రహ్మాండ కటాహముం బగిలి వేండ్రంబై పగులుగాన రా
నొకడై వ ర్ధిల్లగలభ్యుడై హరివిభుండొప్పారె విశ్వాకృతిన్"

ఒకడుగున భూమి కప్పి, వేరొకడుగున ఆకాశాన్ని కప్పి, యిక మరి స్థలంచాలక బ్రహ్మాండం పగిలింది. వామనుడు విశ్వాకృతి దాల్చాడు.

గరుత్మంతుడు వారుణపాశంతో బలిని బంధించాడు. చిరునవ్వుతో త్రివిక్రముడు వదాన్యశేఖరా! మూడడుగు లిస్తానని ధారవోశావు, యిప్పుడు రెండడుగులు మాత్రమే యివ్వగలిగావు, యింకొక అడుగేదీ? అనగా బలి

"సూనృతంబుగాని నుడియదు నా జిహ్వ
బొంకజాల, నాకు బొంకులేదు,
నీ తృతీయపదము నీ నాశిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ"

మహాత్మా ! నా నోట సత్యమే నిలువగలదు. నేను బొంక జాలను, నాకు బొంకులేదు. అందువలన నీ మూడవ అడుగు నా ఉత్తమాంగంపైనే ఉంచండీ అన్నాడు. బలి చక్రవర్తి అర్ధాంగి యేడుస్తూ, తన పతికి కలిగిన విపత్తుకు మూర్ఛపోయింది. బ్రహ్మ వచ్చి నారాయణ! నీకిది తగునా? తన సర్వస్వ మిచ్చిన నీతని కిదియా శాస్తి" అనగా శ్రీహరి విధిని జూచి

"ఎవ్వని కరుణింప నిశ్చయించితి వాని
యఖిల విత్తంబు నే నపహరింతు,
సంసార గురుమద స్తబ్ధుడై యెవ్వడు
దెగడి లోకము నన్ను ధిక్కరించు,
నతడెల్లకాలంబు, నఖిల యోనులయందు
బుట్టుచు దుర్గతిఁ బొందు, బిదప.
విత్తవయోరూప విద్యాబలైశ్వర్య
కర్మ జన్మంబుల గర్వమందు,
యేకవిధమున విమలుడై యెవ్వడుండు
వాడు నాకూర్చి రక్షింప వలయువాడు
స్తంభలోకాభిమాన సంసార విభవ
మత్తుడై చెడనొల్లడు మత్పరుండు"

నే నెవరిని రక్షింపనెంచానో, వారి సర్వస్వమూ ముందు తీసికొంటాను. నన్ను కానకుండా సంసారములోనే మునిగున్నవాడు పుట్టడం, చావడం, మరల పుట్టడం యిలా యెన్నో జన్మ లెత్తుతూ అనేక దుర్గతులకు లోనౌతాడు; ధన, వయో, రూప, విద్యా బలైశ్వర్య కర్మ, జన్మల వలన గర్వములేక సర్వమూ నేననే భావంతో యెవడుంటాడో వాడే నాచే రక్షణనందగలడు" అని చెప్పి బలిని యింద్ర పదము నందినవరకూ పాతాళలోకంలో ఉంచాడు వామనుడు.

## 4 వ స్తబకము

### -* అంబరీషోపాఖ్యానము *-

"చిత్తంబు! మధురిపు శ్రీపాదముల యందు,
పలుకులు హరిగుణ పఠనమందు,
కరములు! విష్ణుమందిర మార్జనములందు,
శ్రవములు హరికథా శ్రవములందు,
చూపులు! గోవింద రూపవీక్షణమందు,
శిరము కేశవ నమస్కృతుల యందు,
పదము! లీశ్వర గేహ పరిసర్పణములందు,
కామంబు చక్రి కైంకర్యమందు,

సంగ మచ్యుత జన గుణ సంగమందు,
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమల మందు,
రసన తులసీ దళములందు, రతులు పుణ్య
సంగతుల యందు; ఆరాజ చంద్రమునకు"

చిత్తము శ్రీహరి పాదాలయందు, భాషణలు నారాయణుని పఠనములోనే. హస్తాలు విష్ణుమందిరము పరిశుభ్రము చేయుటకే, చెవులు హరికథ లాలకించుటకే, చూపులు గోవిందుని రూపాన్ని చూడ్డానికే, శిరస్సు కేశవుని నమస్కరించుటకే, పాదాలు హరిదేవాలయం చుట్టూ ప్రదక్షిణ చేయడానికే, కోరిక శ్రీహరి కైంకర్యానికే, కలయిక హరి భక్తులలో కలయుటకే, శ్రీహరి భక్తుల పాదపద్మాల వాసన కొరకే, తులసిదళాల వాసనకొరకే రసన, పుణ్యసంగతులు కొరకే ఆ అంబరీష చక్రవర్తి జీవిత మంతయై యున్నాడు.

ఆ రాజచూడామణి భక్తికి మెచ్చి శ్రీహరి చక్రాయుధాన్నిచ్చాడు. అంబరీషుడు ఏకాదశీ వ్రతాన్ని ముగింపు సమయానికి దూర్వాసమహర్షి రాగా రాజచంద్రుడాతని గౌరవించి తమతో ద్వాదశి పారణచేయ నొప్పించగా, దుర్వాసుడు స్నానం చేస్తానని వెళ్ళి యెప్పటికి రాక ఆలశ్యం చేయగా—

ద్వాదశి పారణము దాటిపోవు సమయానికి మహర్షి రాకుండుటచే రాజు ఘుంచితీర్థాన్ని సేవించే సరికి దుర్వాసుడు

వచ్చి రాజుపై మండిపడి తన జడదీసి నేలపై కొట్టగా "కృత్య" అనే పెనుభూతం పుట్టింది. దాన్ని అంబరీషునిపైకి పంపాడు దుర్వాసుడు; ఆ కృత్య శూలాన్ని పట్టుకొని రాజు పైకి వెళ్ళింది.

సర్వాంతర్యామి శ్రీహరి కృత్యపైకి తన చక్రాయుధాన్ని పంపాడు, అది కృత్యను దహించి దుర్వాసునిపైకి నేగింది. దుర్వాసుడు భయంతో

"భువిదూరన్ భువిదూరు, నబ్ధిజొర నబ్ధుల్ జొచ్చు, నుద్వేగియై
దివి ప్రాకన్ దివి ప్రాకు, దిక్కులకుబోఁ దిగ్వీధులంబోవు, జి
క్కి, వెసంగ్రుంగిన గ్రుంగు, నిల్వ నిలుచున్, గేడింప
గేడించు, నా
క్కువడిం దాపసు వెంటనంటె హరిచక్రం బన్య దుర్వక్రమై"

ఆ తపసి భువిలో దూర చక్రంకూడా భువిలో దూరేది, సముద్రంలో చొరగా అదీ సాగరంలో చొచ్చేది, ఆకసానికి పాకగా, అదీ పాకేది; దిక్కుల కాతడు పరువిడితే అదీ దిక్కులకు పరుగెత్తేది; క్రుంగిన క్రుంగేది ఆతనేదిచేస్తే వెంట నంటిన శ్రీహరి చక్రాయుధ మాపనే చేసేది.

సమస్త లోకాలూ తిరిగాడు హర, బ్రహ్మలదగ్గరకు వెళ్ళాడుగాని వారు మావశం కాదన్నారు. శ్రీహరి దగ్గరకు పోవగా హరి మునినిజూచి "నీవా అంబరీషుని దగ్గరకే వెళ్ళు" మనగా తిన్నగా వచ్చి ఆ రాజచంద్రుని కాళ్ళపై బడ్డాడు

ముని. అంబరీషుడా దుర్వాసుని రక్షింపమని చక్రాన్ని యెంతో ప్రార్థన గావింపగా ఆ చక్రాయుధం శాంతించి శ్రీహరి దగ్గరకు వెళ్ళింది.

## * శ్రీ రామ చంద్రుడు *

మహాకవి పోతన శ్రీరామ తారక మంత్రోపాసకుడు నవమ స్కంధమందు అవకాశం వచ్చింది కనుక సంక్షిప్తంగా శ్రీరామచంద్రుని చరిత్ర వ్రాసినా అద్వితీయంగా ఉంది. పోతన మహాకవి శ్రీమద్రామాయణమే వ్రాయాలని ఊహించి భాస్కరాదులు దాన్ని చెరిపి శారని రామాయణం వ్రాయలేదని ఒక కథ నిజమో కాదో ఉంది.

ఇచ్చట రామాయణం ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది. మొత్తం సప్త కాండాల కథనంతా సుమారు వద్య గద్య పద్యాల్లో మహాకవి వ్రాసి నప్పటికీ, ప్రతీద్యన్యాను ప్రాసతో. రసరాజ్య పూజ్య సామ్రాజ్యన్నే విందిచ్చట శ్రీరామచరిత్ర.

పద్యానికి "ప్రారంభం, నిర్వహణ, ముగింపు" అను ఒక గొప్ప శక్తి ఉంది. కొందరు చాలా బాగా పద్యాన్ని ప్రారంభిస్తారు, మరి కొందరు పద్య నిర్వహణ చేయగలరు, వేరొకరు పద్యాన్ని బాగా ముగిస్తారు. పోతనమహాకవి త్రిస్థా రుల శక్తులవలెనే ప్రారంభ - నిర్వహణ - ముగింపు [illegible]

మూడింటి యందూ మంచి నేర్పరిగా మనకు కనిపిస్తాడు. ఈ ప్రారంభ పద్యం వినండి.

“అమరేంద్రాశకు పూర్ణచంద్రు డుదితుండైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణ శిరస్సంఘాత సంచ్ఛేదన
క్రమణోద్దాముడు! రాముఁడా గరితకున్ కౌసల్యకున్ సన్నుతా
సమ నైర్మల్యకంచిత జనుస్సంసార సాఫల్యకున్.”

ఎంత అందంగా పద్య ప్రారంభ నిర్వహణ, ముగింపు పెరిగింది. “అమరేంద్రాశకు పూర్ణచంద్రు డుదితుండైనట్టుగా” “అమరేంద్రాశ” తూర్పుదిక్కు అనవచ్చునుకదా! అలా అంటే పద్యగాంభీర్యమే పోతుంది. “ఆశ” శబ్దం యెంతో గొప్పగా యిచ్చట కుదిరింది. మహేంద్రాదు లందరను చిందరవందరచేసిన రావణుని చావు కావాలి, మహేంద్రుడాశ చెప్పలేనంత ఉంది. అందువలన అతని ఆశకు పరిపూర్ణ రామచంద్రుడే పుట్టాడు; తూర్పుదిక్కులో పూర్ణిమా చంద్రు డుదయించి నట్లుగా, యిచ్చటి ధ్వనిని జాగ్రత్తగా వినాలి; యెంతైనా వ్రాయవచ్చును. దండకారణ్య వర్ణన—

“పుణ్యుడు రామచంద్రు డటపోయి ముదంబున గాంచె దండకా
రణ్యము! తాపసోత్తమ శరణ్యము! సుద్ధత బర్హి బర్హలా
వణ్యము! గౌతమీ విమల వారికణ పర్యటన ప్రభూత సా
ద్గుణ్యము! నుల్లసత్తరు నికుంజవరేణ్యము! నగ్రగణ్యమున్.”

ఈ పద్యమెంత మృదుమధురానుభవ శ్రవణయో గ్యమో అలంకారమో చెప్పలేముగదా! యుద్ధభూమిలో రావణుని చూచిన శ్రీరాముని పలుకులా ములుకులా! ఎంత వ్యంగ్యం;

చపలత్వంబున్నడాగి హేమమృగమున్ సంప్రీతి బుత్తెంచుటో! కపట బ్రాహ్మణమూర్తివై యబల నాకాంతార మధ్యంబునం దపలాపించుటయో! మదీయ శిత దివ్యామోఘ బాణాగ్ని సం తపనం బేగతి నోర్చువాడవు దురంతంబెంతయున్ రావణా!"

చపలుడ్వ, బంగారు లేడిని సృష్టించావు, బ్రహ్మ వంశంలో పు న నీవు మరల కపటబ్రాహ్మణ వేషధారి వయ్యావు. అటువంటి నీవు నా బాణాగ్నిని యెలా ఓర్చుకో గల్గవు రావణా! రావణుని చావు విని వానిభార్యలు రావణుని శవము జూచుటకు వచ్చిన వారి రాగను చూడండి—

"కొప్పులు బిగివీడ కుసుమ మాలికలతో
నంసభాగంబుల నావరింప,
సేస ముత్యంబులు చెదర, గర్ణికలూడ
గంఠహారంబులు గ్రందుకొనగ,
వదన పంకజములు వాడి వాతెర లెండ,
గన్నీళ్ళ వరద లంగములు దడువ [illegible]
సన్నపు నడుములు జవ్వాడ, బాలిండ్ల [illegible]
భుజములు నడుముల బెబ్బకొనగ [illegible]

నొ_త్తి మోదుకొనుచు, నెరిబయ్యాదలు జాఱ
నట్టు నిట్టు తప్ప టడుగు లిడుచు
నసుర సతులు వచ్చి రట భూత భేతాళ
సదనమునకు ఘోర కదనమునకు"

ఈ కవితాచిత్ర శిల్పాన్ని బాగా గమనిస్తే మన కళ్ళకు కట్టినట్లు లేదూ ?

నె_త్తీ నోరూ మోదుకొని రాక్షస కాంతలు అన లేదు, అసుర సతులు, "యుద్ధభూమి" అనలేదు, "భూత భేతాళ సదనము! ఘోర కదనము" అనగా 7 రోజుల యుద్ధంలో యెన్ని కోట్లమంది చచ్చారో ! హాయిగా భూతభేతాళా లానందంతో ఆ కళేబరా లారగించారో కదా! మహాకవి యెంత వర్ణనగానీ, చెవులకూ హాయినిచ్చే శబ్దములనే ప్రయోగిస్తాడు. చదువుచున్న కొలదీ చదవాలనే ఉంటుంది. మన స్సుకూ, సర్వేంద్రియాలకూ తర్వణమే శ్రీమహాభాగవతము.

అయోధ్యాపట్టణ రాజమార్గమున సీతారాములేగు సమయాన వారిని చూచిన పౌరులు

"ఇతడే రామనరేంద్రుఁ డీయబలకా యిందాఱి ఖండించె, న
ల్లతడే లక్ష్మణుఁ డాతడే కపివరుం డా పొంతవాఁడే సుర
త్సుతు, డా చెంగట నా విభీషణుఁ డటంచున్ శేతులంజూపుచున్
సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్."

వీరిని చూచినవారు మగవారుకాదు, మగువలు, యెంత రమణీయకంగా అక్కా చూశావా? "ఇతడే రామ నరేంద్రుడు" ఇదిగో! యీ యబాలే రావణుని వధించింది, ఖండించింది; అదుగో ఆతడే లక్ష్మణుడు, ఆతడు కపివరుడు సుగ్రీవుడు, ఆ పొంతవాడు మరుత్పుత్రుడు "హనుమ" అన లేదు. సృష్టిలో గాలికిగల మహాశక్తి దేనికీ లేదు, అలాగే గాలిలేక కనురెప్పపాటైనా జీవి జీవించలేదు. అటువంటి వాయుదేవుని కుమారుడని చెప్పి, విభీషణుని జూచారు! ఎలా? పరికించి; యేమి పద్యం? హుళక్కి భాస్కరుడూ మొదలగు వారు శ్రీమద్రామాయణాన్ని చెరపకుండా ఉన్న యీవిధం గానే నేను సప్తకాండములు గల శ్రీ రామాయణమును వ్రాసి ఉండేవాడననేగదా పోతన మహాకవి యింత మహా భాగవతములో యీ రామాయణము ప్రత్యేకముగా ఉన్నట్లు వ్రాసుంటాడని భావించాలి.

రామరాజ్యములో గల వర్ణన వినండి—

"పొలతుల వాలుజూపులయంద చాంచల్య,
మబలల నడుముల యందె లేమి,
కాంతాలకములంది కౌటిల్య సంచార,
మదివల నడుపుల యంద జడిమ,
ముగుదల పరిరంభములయంద పీడన,
మంగనా కుచముల యందపోరు,
పడతుల రతులంద బంధ సద్భావంబు,
సతుల బాయుటయంద సంజ్వరంబు,

ప్రియులు, ప్రియురాండ్రు మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు! వల్లభు లాత్మసతుల
నాగి క్రొమ్ముళ్లు పట్టుటం దక్రమంబు
రామచంద్రుడు పాలించు రాజ్యమందు."

సామాన్యంగా రాజ్యంలో "చంచలత - లేమి - కుటి-
లత - జడిమ - పీడన - పోరు - బంధము - జ్వరము-తార్పులు -
చౌర్యము - అక్రమము" ఇవి తప్పకుండా యెంత గొప్పరాజు
రాజ్యాన్ని పరిపాలించినా ఉండియే తీరును. మరి రామ
రాజ్యంలోనూ తప్పనిసరిగా యివన్నీ ఉన్నాయి; ఉంటే
ఎలా ఉన్నాయి? వినండి;

"చంచలత" యౌవనవతుల వాలుచూపుల్లోనే
ఉన్నాయి, అనగా వేరొకచోట లేవన్నమాట. "లేమి"
స్త్రీల నడుములు సన్నంగా ఉంటాయని కవి సమయం —
అందువలన "లేమి" అచ్చటగల స్త్రీల నడుంలందే చిక్కిపో
యింది, "కుటిలత" అయోధ్యానగర స్త్రీల జుట్టులలో కట్టు
బడ్డది, "జడిమ" అచట కాంతల నడలలో జడిమ యిమిడి
పోయింది, "పీడన" ఆ అంగనల కౌగిళ్ళలోనే పీడన పీడింప
బడుతుంది, "పోరు" ఆ కాంతామణుల కుచములందే పోరు
చేరింది, "బంధన" పడతుల రతులలోనే బంధన బంధింప
బడింది. పురుషులు ఆ సతులను యెడబాటులో జ్వరం హరింప
బడింది, "తార్పు" ప్రియురాండ్రూ, ప్రియులూ, పరస్పర
మనస్సులలో చిక్కింది. పతులు వారివారి సతులంటే

"చౌర్యం" కాంతల క్రొమ్మెళ్లు వారి భర్తలు పట్టుటలందే "అక్రమము" అంతేగాని వేరొకచోట లేనేలేదని అర్థం :

యేమి యీ యలంకారం కూర్పూ, నేర్పూ యెవరైన వ్రాయగలరా? యెంతైనా వివరింపవచ్చును. గౌరవ భారంచేత విరమిస్తాను,

శ్రీరామ భక్తాగ్రేసరుడైన పోతన చివర శ్రీరామ చంద్రుని స్తోత్రంతో ముగింపు చేస్తాడు. ఆ ముక్తాయింపు చూద్దాం—

> "ఆదిదేవుడైన యీరామచంద్రుని
> కబ్ధి గట్టు టెంత?, యసురకోటి
> జంపు టెంత?, కపుల సాహాయ్య మదియెంత?
> సురల కొరకు క్రీడ జూపెగాక"

ఆ రామచంద్రు డాదిదేవుడు, అతని కీ కార్యాలేల? యివన్నీ సురలకొరకే క్రీడ జరిపించాడంతే!.

"నల్లనివాడు! పద్మనయనంబులవాడు! మహాశుగంబులన్ విల్లును దాల్చువాడు! గడు విప్పగు వక్షమువాడు! మేలు పై జల్లెడివాడు! నిక్కిన భుజంబులవాడు! యశంబు దిక్కులం జల్లెడివాడు! నైన రఘుసత్తముడీవుత మా కభీష్టముల్."

పోతన మహాకవికి తన మనసుకు వచ్చిన పద్యమున్న అటువంటి పద్యాన్ని కొంచం మార్చి దాన్నే యింకొక పద్యం వ్రాయుట పరిపాటి. ఆ విషయం యింకొక దగ్గర వివరిస్తాను.

## 5వ స్తబకము

శ్రీకృష్ణపరమాత్మ జన్మించాడని నారద మహర్షి కంసునకు చెప్పినది మొదలు కంసుడు

"తిరుగుచు, గుడుచుచు, దాగుచు
నరుగుచు, కూర్చుండి లేచు చనవరతంబున్
హరి దలచి, తలచి, జగమా
హరిమయమని దలచె కంసు డారని యలుకన్"

శ్రీహరి నామామృతపాన మత్తచిత్తుడు ప్రహ్లాదు డెలాగో విరోధించి, కృష్ణపరమాత్మను కంసుడు కూడా అలాగే మనస్సులో విరామం లేనట్లు తలంచుచున్నాడు. ఇంకా వినండి—

"శ్రవణ రంధ్రములనే శబ్దంబు వినబడు
నది హరి పలుకని యాలకించు,
నక్షిమార్గమున నెయ్యది చూడబడు నది
హరిమూర్తిగా జోపు నంచు జూచు,
దిరుగుచో దేహంబు దృఢమైన సోకిన
హరి కరాఘాతమో యనుచు గలగు,
గంధంబు లేమైన ఘ్రాణంబు సోకిన
హరిమాలికాగంధ మనుచు నదరు,

బలుకు లెవ్వియైన బలుకుచో హరిపేరు
పలుక బడియె ననుచు భ్రమసి పలుకు,
దలపు లెట్టివైన దలచి యా తలపులు
హరితలంపు లనుచు నలుగ దలచు"

వైరభక్తిని మహాకవి యెంత గొప్పగా కంసునిచేత నిరూపింపజేశాడు ?

అందుకే మనిషి నిరంతరం దేనిపై మనస్సున్న అదే వారికి లభిస్తుంది. కంసుడు సర్వకాల సర్వావస్థల్లో శ్రీకృష్ణ పరమాత్మ ధ్యానం తప్ప రెండేది ఉండేదిగాదు.

"గురుపాఠీనమవై జలగ్రాహమవై కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుడవై హయాననుడవై రామా దేవతా భర్తవై
ధరణీనాథుడవై దయాగుణ గణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలా భారంబు వారింపవే?"

ఈ పద్యంలో దశావతారా లున్నాయి. పద్యం హృద్యంగా యెలా ఉంటుందో పోతన మహాకవికి తెలిసినట్లు లింకొకరికి తెలీదు. యిందులో "గురుపాఠీనమవై!" ప్రారంభంతో "వై" అనే శబ్దాలతో నింపుట అందం అందగించింది.

"ఆత్మ వలన గలిగి యమరు దేహాదులు,
నాత్మకంటె వేరు లవి యటంచు
దలచువాడు మూఢతముడు గావున నీశ!
విశ్వమెల్ల నీవ వేఱులేదు"

ఈ పద్యంలో సమస్త శాస్త్ర, వేదాల్లోగల సారాంశాన్ని అందించాడు! హే పరమాత్మా! ఆత్మవలనే యీ సర్వ దేహాలూ పుట్టును, పోతే ఆత్మకన్న దేహాదులు వేరుగా భావిస్తారు తెలివిలేని వారు. యీ సమస్త విశ్వం నీవే. నీకన్నా వేరు కానే కాదు.

"అన్న క్షమింపుమన్న, తగ దల్లుడు గాదిది! మేనగోడలా
మన్ననసేయు మన్న! విను మానినిజంపుట రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనగదన్న! మహాత్ములు వోవు త్రోవ బో
వన్న! భవత్సహోదరి గదన్న! నినున్ శరణంబు వేడెదన్"

ఫుట్‌నోట్ : అష్టభాషా ప్రవీణులు - హరికథా పితామహులు - పుంభావ సరస్వతి - శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాస మహోదయులు తల్లికోరిక ప్రకారం అర్థాంగితో 1900 సం॥ కాశీ వెళ్ళారు. అప్పటికే శ్రీ దాసుగారి కీర్తి భారతదేశమంతా నిండింది. కాశీ హిందూ విశ్వవిద్యాలయ స్థాపకులు, మహాపండితుడు శ్రీ మదనమోహన మాలవ్యా గారు శ్రీ దాసుగారిని విశ్వవిద్యాలయంలో హరికథ చెప్పమన్నారు. శ్రీ దాసుగారు తన వయస్సు అయిదవ సంవత్సరంలో పోతన భాగవతాన్ని చదివి ఆ[illegible]ంథాన్ని పొందాడు. అందువలన పోతనగారి కవిత్వంపై అపారమైన మక్కువ దాసుగారికి. అందువలన ఆ హిందూ విశ్వవిద్యాలయంలో హరికథ చెప్పడానికి నిలువబడ్డారు. (తరువాయి పేజీలో)

కంసుడు దేవకి అష్టమగర్భం వలన తనకు మారకమని యోగమాయను వధింపగా ఉన్న సమయాన ఏడుస్తూ దేవకీ దేవి అన్నమాటలివి, స్త్రీ పరమగవాని సామాన్యంగా "అన్నా" అని సంబోధిస్తుంది. కంసును నిజంగా అన్న. స్త్రీ

ఆలోచించాడు. ఏ భాషలో చెప్పాలి? తనకు ఎనిమిది భాషలోచ్చు, ఐనా అన్ని భాషలకూ తల్లి సంస్కృతం. సంస్కృతంలో హరికథలు వ్రాయ లేదు. అప్పుడు శ్రీకృ జననం సంస్కృతంలో చెప్పారు. యీా దిగువ శ్రీకృ పరమాత్మ ప్రార్థనా సీసపద్యం తెలుగు వాలకంవేసి సంస్కృతం.

"పాహి ప్రసన్న రూప! దయకలాప! స
త్యాలాప! సర్వలోకైక దీప!
విజ్ఞానకంద! గోవింద! ముకుంద! ని
త్యానంద! సుస్మితాస్యారవింద!
పద్మావిలోల! తాపత్రయోన్మూల! స
త్కీర్తి విశాల! సదార్తపాల!
భవపాతకత్రాస! వైకుంఠవాస! సం
శ్రిత వేదనిశ్వాస! చిద్విలాస!
జలధరశ్యామ! దేవతాసార్వభౌమ!
భవ్యనుతిపాత్ర! పతితపావన చరిత్ర!
భక్త మన్దార! కైవల్య పదవిహార!
హేజగన్నాథ! సంశ్రిత హృద్విబోధ!"

(తరువాయి పేజీలో)

దీనంగా అనే మాటలు తెలుగు పలుకు లుట్టిపడ్డట్టు యిక్కడ మహాకవి యెంత మృదు మధురంగా వర్ణించాడు. యీ మాటలు విన్న రాతిగుండెకూడా కరిగిపోతుంది.

శ్రీకృష్ణ పరమాత్మ నందుని గృహములో ఉన్నాడు, గోపభామ లందరూ కలసి

"ఏమి నోము ఫలమొ యెంత ప్రొద్దోకవార్త
వింటి మబలలార! వీనులలర
మన యశోద చిన్ని మగవాని గనెనట
చూచివత్త మమ్మ! సుదతులార!"

శ్రీలాడు మాటలు యదాతథంగా వ్రాయుట, ఆమాటల సొంపు, యింపూ మహాకవికే తెలుస్తుంది. ఇందులో "చిన్ని" శబ్దం యెంత అందమయిందో! "చిన్ని" అనగా చాలాకాలం సంతానంలేని స్త్రీ. అందుకు అందరికూ ఆశ్చర్యం "మన యశోద చిన్ని" మగవానిని కన్నదట!.

కవిత్వంలో యెన్నిరకా లందాలున్నాయో, ఒకే శబ్దం యెలా విరిస్తే యెన్నిఅర్థాలొస్తాయో యీపద్యం వినండి.

అలాగే మూడు రోజులు ఆశువుగా సంస్కృతంలో శ్రీకృష్ణజననం - కుచేలోపాఖ్యానం - సత్రాజితీ కల్యాణం చెప్పారు; వాటిని వ్రాసి "హరికథామృతమ్" అని ముద్రించారు.

"విషధర రిపు గమనునికిని,
విషగళ సఖునికిని, విమల విషశయునునికిన్,
విషభవభవజనకునికిని,
విషకుచ చను విషముఁ గొనుట విషమే తలపన్"

కంసుని పంపున వచ్చిన రక్కసి పూతన విషపూరిత చనుపాలు పెట్టగా ఆ పాలతో పరమాత్మ పూతన రక్త మాంసాలన్నీ పీల్చి దానిని హతమార్చాడు. అప్పుడు పోతన యీ పద్యాన్ని వ్రాశాడు.

విషధర=సర్పాలకు, రిపు=శత్రువైన గరుడుని, గమనంగికి=వాహనముగా గలవానికి, విషగళ=శంకరుని, సఖుడు=శ్రీవిష్ణువు, విషశయనునికిన్=విష మనగా నీరు, అనగా పాల

పుట్‌నోట్ :—

"అనిమిషుడ వైతి భళిరా!
అనిమిషదాయాలను జంప, అనిమిషులెల్లన్
అనిమిషులై నుతిసేయక
అనిమిషాలను బ్రోచినట్టి అనిమిష వంద్యా!"

ఆంధ్ర పురాణ బాదరాయణ! మహాకవి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారింట గొప్ప కవులందరూ ఉండగా కొన్ని పద్యాలు చదివించారు. తరువాత వారికి

* [illegible]

సముద్రమున. విష్ణువు పవ్వళించునుగదా! విషభవ=నీటిలో పుట్టిన, భవ=బ్రహ్మయొక్క, జనకునికి=తండ్రికి, విషకుచ యగు పూతన విషముతీసికొనుట పెద్ద విషమగునా? యేమంత విషయముకాదనుట.

శ్రీకృష్ణపరమాత్మ బాలక్రీడలు గోపమ్మలు యశోదమ్మతో యెన్నో చెప్పారు. అప్పుడందరూ

"కడులచ్చి గలిగెనేనిఁ
గుడుతురు కట్టుదురుగాక! కొడుకుల నగుచున్
బడుగుల వాడల్పై బడ
విడుతురె రాకాంతలెందు విమలేందుముఖీ!"

ఈ వ్యాఖ్యాతను పరిచయముచేసి యేదైనా ఆశువుగా మీరు పద్యం చెప్పండి? అనగా యీ పద్యం చెప్పగా వారందరూ ఆశీస్సులిచ్చారు.

అనిమిషం = మత్స్యం, హే ప్రభూ! మత్స్యరూపు దాల్చావా? అనిమిషులు = దేవతలు, వారి దాయలు రాక్షసుల జంపగా, అనిమిషులెల్లన్=దేవతలందరూ, అనిమిషులై నుతిసేయఁగ=రెప్పలు వేయకుండా నుతింపగా, ఆ అనిమిషులను బ్రోచినట్టి, దేవతావంద్యా" అని అర్థం. దీనిలో శబ్ద చమత్కారమున్నది. పోతనగారి పద్యాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాసినది. ఆ మహామహు డెక్కడ? నేనెక్కడ? *

అందరకూ ఒళ్ళుమండి "ఏమమ్మా యశోదమ్మా! మీారు ధనవంతులైతే తినాలి, కట్టాలి, అంతేగాని మీాకొడుకుల్ని మీారు నవ్వుతూ, మా బడుగువాడలమీాద పడడానికి యిలా విడిచిపెడతారా యేరాజకాంతలైనా? "అవ్వ" అని చెక్కిళ్ళు నొక్కుకున్నారు.

యింత సహజంగా యే మహాకవీ చెప్పలేదు, చెప్పలేడు.

> "మన్నేటికి భక్షించెదు?
> మన్నియము లేల నీవు మన్నింపవు?, నీ
> యన్నయు సఖులును జెప్పెద
> రన్నా! మన్నేల మరి పదార్థము లేదే?"

అనే యశోదమ్మతో శ్రీకృష్ణపరమాత్మ

"అమ్మా! మన్ను దినంగనే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో నమ్మజూడకు వీరిమాటలు మదిన్, నన్నీవు కొట్టంగ వీరిమ్మార్గము ఘటించి చెప్పెదరు, కాదేనిన్ మదీయాస్యగంధ మాఘ్రాణము సేసి నావచనముల్ దప్పైన దండింపవే"

ఎంత సహజోక్తి భాసురంగా కృష్ణపరమాత్మ పలికించేడు మహాకవి. సామాన్యముగా మనముమాట్లాడుకొన్నట్లే యీాపద్యము నిర్మించాడు.

శ్రీకృష్ణుని నోరు చూచిన యశోదమ్మ

"కలయో! వైష్ణవ మాయయో! యితరసంకల్పార్థమో!
సత్యమో!
తలపన్నేరక యున్నదాననో? యశోదాదేవిగానో! పర
స్థలమో! బాలకుడెంత? యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుటకేమి హేతువో మహాశ్చర్యంబు
చింతింపగన్."

సాహిత్యోపాసకుడైన సామాన్యునకు కూడా యీ పద్యం వచ్చి ఉంటుంది. సామాన్యంగా వైష్ణవస్వాములవారి గూర్చి "కలయో వైష్ణవమాయయో!" అనడం కద్దు.

యశోదమ్మ శ్రీకృష్ణపరమాత్మ నోటిలో పదునాల్గు భువనాలనూ చూచి మూర్ఛపోయింది. లేచి యీ బాలుడు శిశువా? కాదనుకొంది.

అమృతానికి యిక్కడ రుచి, అక్కడ లేదని చెప్ప గలమా? అలాగే శ్రీ భాగవత పురాణంలో యేపద్యం అద్భుతం కాదు? యేపద్యాల నిందు వ్రాయాలి? నాకేమీ తోచుట లేదు. అందువలన నాబుద్ధికి దోచిన వానినే యిందు వ్రాసి వ్యాఖ్యానవసరమున్న వానికే వ్రాస్తున్నాను.

"నీపద్యావళు లాలకించు చెవులున్, నిన్నాడు వాక్యంబులున్
పేరంబని చేయు హస్తయుగమున్, నీమూర్తిపై జూపులున్,
పాదంబులపొంత మ్రొక్కు శిరమున్, నీసేవపై జిత్తముల్,
నీపై బుద్ధులు మాకునిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!"

ఈపద్య మొక్కటి భగవద్భక్తులగువారు నిత్యం ప్రార్థనచేసిన చాలును జన్మలు ధన్యమౌతాయి. శ్రీ భాగవతాన యెచ్చట పట్టినా అచ్చట రసం చిప్పిలును. మన జ్ఞానాన్ని బట్టి అది మన కర్థమౌతుందంతే.

## 6వ స్తబకం

శ్రీకృష్ణపరమాత్మ అనగా పోతన మహాకవి శరీరాన్నే మరచిపోతాడు; శ్రీకారం చుట్టడమే కైవల్యం కావాలనీ గోపాంగనా డింభకుని సంప్రార్థించాడు.

తన వయసు గోపబాలురతో నాటలాడి చల్దులు తినే ఘట్టాన్ని సహజపాండిత్యు డెంతసహజంగా వ్రాశాడు? కాదు, కాదు. ఆతని చేత శ్రీరామచంద్రుడు వ్రాయించాడో చూడండి—

"ఒకనొకని చల్దికావడి
నొకడొక డడకించి దాచు, నొకడొక డది వే
రొకరొకరి మొఱగికొని చన
నొకడొక డది తెచ్చియిచ్చు నుర్వీనాథా!"

శ్రీకృష్ణ పరమాత్మతో కూడా గోపబాలకులందరూ, చల్దులుమూట కట్టుకొని కావళ్ళు భుజాలకు వైచుకొని పసువులు తోలుకొని వెళ్ళేవారు. వల్లెటూళ్ళలో గల పసులకాపరుల కున్న తెలివి చాలచక్కం యెంత చదివిన నాగరకూ ఉండవు.

ఒకడు పట్టుకొని వచ్చిన చల్దికావడి, యింకొకడు హఠాత్తుగా పట్టుకుపోయి దాచగా, యింకొకడు దాన్ని పట్టుకుపోగా, యింకొకడు దాన్ని తెచ్చి మొదటివానికి యిచ్చేవాడు, యీవిషయ మెంత సహజ కవితా శిల్పసుందరంగా ఉంది ?

ఇటువంటి యీసన్నివేశం హృదయాలకు హత్తుకొంటుంది. యిచ్చటి మహాకవి చెప్పిన కవిత్వంగూర్చి వ్రాయాలన్న మాటలు చాలవు కదా!

—* గోపికా వస్త్రాపహరణము *—

గోపకాంత లందరూ "కాత్యాయినీ వ్రతం" చేయనెంచారు.

---

ఫుట్‌నోట్ :- మార్గశీర్ష మాసాన ప్రారంభంనుండీ కన్యలైన గోపికలు కాళిందీనదిలో స్నానాలాడి అనదీతీరాన వ్రతాన్ని చేస్తున్నారు. కాత్యాయినీదేవి విగ్రహాన్ని యిసుకతో తయారుచేసి దానిని పూజించి, నైవేద్యం పెట్టి కాత్యాయినీదేవీ! మాయారూపిణీ! తల్లీ! మాకందరకూ శ్రీకృష్ణుని భర్తగాచేయుము, అని ఉదయ సమయాల్లో ప్రతి దినం ప్రార్థించేవారు. వ్రతాంత ప్రాతఃదినాన నందవ్రజ మందాగల గోపకన్యలు అందరూకలిసి యమునానదికి స్నానానికి వెళ్ళేరు. అచ్చట గట్టుపైని తమతమ కట్టుబట్టలు విడిచి

(తరువాయి పేజీలో

"ఓ కాత్యాయని! భగవతి!
నీకును మ్రొక్కెదము మేము నేడనుకంపన్
మాకందరకును వైళమ
శ్రీకృష్ణుడు మగడుగాగ జేయుముతల్లీ!"

నదిలో జలక్రీడలాడుతున్నారు. ఆ సమయం చూచి బాల కృష్ణుడు మెల్లగా వారు చూడకుండా వచ్చి వారి బట్టలు పట్టుకొని తీరమందున్న కదంబవృక్షంపై కెక్కి కూర్చొని గోపికలను చూచి నవ్వుతూ కృష్ణుడు—

"అత్రా గత్యా బలాః! కామం
స్వం స్వం వాసః ప్రగృహ్యతాం
సత్యం బ్రువాణి, నో నర్మ
యద్యూయం వ్రతకర్శితాః॥
భవత్యో యది మే దాస్యః
మయోక్తం వా కరిష్యథ
అత్రా గత్య స్వవాసాంసి
ప్రతీచ్ఛత శుచిస్మితాః"

"ఓ గోపికల్లారా! మీరు హాయిగా వచ్చి ఎవరిబట్టలు వారు తీసికొనండి; మీరు వ్రతంలో చాలా కృశించున్నారు. నా మాటలు హాస్యాలు కావు. నిజం చెప్పుతున్నాను. నా దాస్యం మీరు చేయదలిస్తే నేను చెప్పినట్లు చేయండి.

(తరువాయి పేజీలో)

యింతమంది కాంతలు శ్రీకృష్ణపరమాత్మను మగనిగా గోరడమేమి? ఒక స్త్రీ భర్త వేరొక స్త్రీని చూచాడన్న ఓర్చుకోలేదే! అటువంటప్పుడు యెంతోమంది గోపికలు ఆనంద నందనుని కోరడంలో యేదియో పరమరహస్యం యిమిడియే ఉంటుంది.

"సుచిస్మితలై" అనగా చక్కని చిరునవ్వు కలవారై తీసి కొనండి" సిగ్గుపడి యెట్టకేలకు ఒక హస్తంతో యోనిభాగం కప్పుకొని, రెండవచేత్తో కృష్ణుని చేతిలోగల బట్టలు అందు కొనడానికి మెల్లగా దగ్గరకు వచ్చారు.

కృష్ణు డప్పుడు "గోపికలారా! మీరెంతో నియ మంతో యిన్నాళ్లు వ్రతాన్ని చేస్తూ, వివస్త్రలై స్నానం చేయడం వ్రతలక్షణమే కాదు. ఆ పాపం పోవడానికి మీ రెండుచేతులెత్తి నమస్కారంచేసి మీ అధోవస్త్రాలను (లంగాలు) తీసికొండి" అని అనగానే గోపికలు సిగ్గుభారంతో లంగాలు విప్పి నదీజలంలో ప్రవేశించి స్నానం చేయుటవలన వ్రతం భగ్నమైపోయినందుకు భయపడి, హస్తములతో యోనిభాగాన్ని కప్పుకొనియే గట్టుకు వచ్చారు.

మీ వ్రతం చెడకుండా ఫలితాన్ని పొందాలన్న మీరు మీ హస్తాలను పైకెత్తి నమస్కరించి మీ అధోవస్త్రాలను తీసికోండి" అనగా వారలాగే చేశారు. శ్రీకృష్ణుడు [illegible]రికిచ్చాడు. *

ఈ ఘట్టాన్ని మహాకవి మూలానికి మెరుగు పెట్టాడు.

"తోయజ నయనలు, యమునా
తోయములం దుండు టెరిగి దూరగుడయ్యుం
దోయజ నయనుడు హరి తన
తోయము గోపకులు దాను దో తెంచె నృపా!"

శ్రీకృష్ణపరమాత్మ వస్త్రము లపహరింప రించుననిగోపిక లిలా అన్నారు.

"మా మా వలువలు ముట్టకు
మామా! కొనిపోకు పోకు మన్నింపుతగన్
నూ మానమేల కొనియెదు
మా మానస హరణ! మేల మానుము కృష్ణా!"

"మా హృదయాలను యెప్పుడో హరించావు; అందువలన మా వలువలేల నీకు? ఓ మామా! వాటిని కొనిపోవద్దు. నూ మానమేల నీకు? మా హృదయాలే యిచ్చాంకదా! ఎంత [illegible]మకాలం[illegible]ంగా యీ పద్యాన్ని వ్రాశాడు?

"కొంటివి మా హృదయంబులు,
కొంటివి, మానంబు, లజ్జ, గొంటివి వలువల్
గొంటి విక నెట్లు సేసెదొ
కొంటెవు గద! నిన్ను నెరిగికొంటివి కృష్ణా!"

"మా వలువ లాగడంబున
నీ వేటికి బుచ్చుకొంటి నీవల్పుడవే
నీవెరుగని దేమున్నది
నీ విందరిలోన ధర్మనిరతుడవు గదే!"

ఏమి మహాకవి ధర్మభాషణలు "కృష్ణా! నీవెరుగనిది మాదగ్గరేముంది! నీవు ధర్మనిరతుడవుగదా!, యీ రెండు శబ్దాల్లో ఎంత హాస్యాద్భుత కవితాచమత్కృతీ భాగ్యముందో ఎవరు వివరింప గలరు?

"ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీతల బుట్టెగాక మరి యేవీక్ష యోచెల్ల నీ
చెంతన్ దాసులమై చరించెదము, మా లంబు లిప్పింపవే!"

స్త్రీలు యెంత మృదువుగా మధురంగా చమత్కారంగా పలుకుతారో పోతన మహాకవికి తెలిసినట్లుగా ఆంధ్ర కవులలో వేరొకరికి తెలియదని చెప్పాలి.

సంస్కృత భాగవతంలో యెంతో తక్కువగా ఉన్న యీ ఘట్టాన్ని తెలుగువెలుగు లుట్టిపడ్డులాగున వ్రాసాడు.

"చీరలపహరించి సిగ్గులు విడిపించి
పరిహాసించి తైన బరగ్గ మ
ఘనుడు నోము కొరత గాకుం బ్రమొక్కించె
ననుచు హరి నుతించి రబలలెల్ల"

వ్యాసభాగవతానికి యెంతో మెరుగులుదిద్ది, యెచ్చట యెంతవరకూ పెంచాలో, యెంతవరకూ తగ్గించాలో యీమహా కవికే తెలుస్తుంది. అంతేకాదు యీ ఘట్టం మనకు వాచార్థంగా చాలా శృంగారం, శృంగారంలో మరీ పచ్చి శృంగార మనిపిస్తుంది. "మీరు వివస్త్రలై రెండు చేతులూ పైకెత్తి

ఫుట్‌నోట్ :- "గోపిక" అనగా ఇంద్రియ విషయాలను గ్రహించే మనోవృత్తులు, కృష్ణు డనగా ఇహావాసనా సంబంధంలేని నిర్వృతి ముక్తితత్త్వాన్ని (కృష్ణుని) చేరడానికి సాధకులు చేసే సాధనాక్రమం. "కృష్ణు"డనగా ఆనందవృత్తి వలన కలిగిన వాసనలులేని మహాతత్త్వం. మాయా తెరను తొలగించుకొనుట వివస్త్రలు కావడం. మాయను తొలగించినా ఆ మాయ మరల తప్పకుండా చేరుతుంది. కాళిందీ నదిలో కంఠం వరకూ ఉండం మరల మాయచేరడం. బట్టలు పట్టుకుపోయి, వారి ప్రార్థనపై మరల యిచ్చుట తిరిగి మాయలు - వారిని పొందకుండా ఉండడం.

జలంలో నుంచి మళ్ళా జలములో దిగడమన్నది. మాయ. కమ్మడం తరువాత శ్రీకృష్ణులో చేరడం యింకా మాయావరణ గోపికలకు తొలగి తిరిగి రాకుండా ఉండడం.

"యోని" అనగా జనన మరణాలకు స్థానము. "మీరు మీ హస్తాలు పైకెత్తి నమస్కరించండి" కృష్ణుకనడం మీజన్మ వాసనా కారణాలైన మనోవృత్తులను అంటిపెట్టు

(తరువాయి పేజీలో)

నమస్కరించండి, నేనెరుగనిది మీదగ్గర యేముంది ?"
ఈ మొదలైన విషయాలు ఆధ్యాత్మికంగా మనకు గోపికా తత్త్వం వివరిస్తుంది. దాన్ని మనం బాగా ఆలోచించి అర్థం చేసికొని భాగవతత్త్వాన్ని భావగతం చేసికోవాలి.

కొని ఉండక ఐహిక వాంఛారహిత కృష్ణతత్త్వాన్ని ఉపాసించడ మన్నమాట.

"నాలో కలిసిన మీ బుద్ధులు దంచిన ధాన్యం తిరిగి మొలకెత్తనట్లు జనన మరణ హేతువులు" కావని శ్రీకృష్ణ పరమాత్మ గోపికలకు చెప్పాడు.

"మీరందరూ రాత్రులందు నాతో రమించండి" అనుటలో సాధకులలో తమోగుణావరణాన్ని కృష్ణతత్త్వం ఆవేశించి బాధలేని స్థితిని ముక్తిని పొందడం. యిటువంటి మహత్తర యోగసాధనా క్రమ మిందు రహస్యంగా దాగి ఉండుట వలననే వ్యాసమహర్షి అంతటివారు వ్రాయడం, శ్రీశుకులువారు చెప్పడం, పోతనవంటి మహాకవి దానిని అద్వితీయ కవితాశిల్పంతో మనకందించుట శతాబ్దాల తరబడి మహాయోగులంతా దానిని పారాయణచేసి ముక్తిని పొందడం జరుగుతుంది; లేదా! మామూలు పచ్చి శృంగార గ్రంథా లెన్నిలేవు వాటి నెవ్వరైనా చదివి పారాయణ చేస్తారా ? గోపికా "వస్త్రాపహరణ" సమయానికి శ్రీకృష్ణపరమాత్మకు

(తరువాయి పేజీలో)

## 7వ స్తబకము

"అపకారంబులు సేయ మెవ్వరికి నేకాంతంబులందుండు, నా
తప శీతానిల వర్ష వారణములై త్వగ్గంధ నిర్యాసభ
స్మ పలాశాగ్రి మరందమూల కుసుమచ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీయుర్వీజముల్ గంటిరే!"

బలరామ కృష్ణులు గోపబాలురతో ఆ వనములం దుండి అచ్చట నున్న వృక్షాల్ని చూపి "అపకారం ఎవ్వరికీ చేయవు, ఏకాంతవాసం చేస్తాయి. శీత వాత ఆతపాలను సహిస్తూ ఆకులూ, మూలాలూ, బెరళ్ళూ, పుష్పాలూ, ఫలాలను కోరినవారికి సమర్పించిన యీ వృక్షాలెంత పరోపకారులో" అన్నాడు కృష్ణుడు.

గోపాలురు ఆకలితో అలమటించగా గోపాలురు యోగి ఆవనములోగల విప్రభార్యలకు చెప్పగా వారు తమభర్తలూ, కొడుకులూ, కోడళ్ళూ అడ్డగించినా వినకుండా శ్రీకృష్ణ పరమాత్మకు మధుర పదార్థాలు తెచ్చారు.

ఏడేండ్ల వయస్సనగా నిర్వృతి సాధన అప్పుడు సాధకులలోని సప్తధాతువులలో నెలకొని ఉండును. గోపకన్యలు 5 లేక 6 సం॥రాలు వారన్నా యీ అర్థాన్నే మనం గ్రహించాలి. యిలా భారత, భాగవతాలకు, రామాయణానికి అంతరార్థం ఉండుట వలన అవి యుగయుగాలుగా పారాయణ గ్రంథాలై పరమార్థాన్ని అందిస్తున్నాయి.

*

"కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే
యే గామి
వింతున్ మీరాకిటు రండు మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతేవేడుకతో నేనెరుంగుదును నిర్వైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియ జేరి కందురు గదా మత్సేవలన్
సర్వమున్."

కృష్ణపరమాత్మ వారినిజూచి "తల్లులారా! రండి రండి, ఎంతో ప్రేమాభిమానాలతో నన్ను చూడ్డానికి వచ్చారు. ఆహా నిర్వైతుకంగా వచ్చిన ధీమంతులు మీరు తప్పక నా సేవలన్ సర్వమూ పొందగల"రని - ఆనందించెను. వారు శ్రీహరికి తృప్తిగా మధుర పదార్థాలు తినిపించారు. వారు తిరిగి వెళ్ళడం వారి భర్తలుచూచి సిగ్గునందారు.

ఫుట్‌నోట్ :- యజ్ఞపత్ని రత్నాణాం అనగా "కర్మ - యోగ - జ్ఞానత్రయ సాధన" బ్రాహ్మలు భార్యలందరూ రామకృష్ణులకు భోజనపదార్థాలు తెచ్చారు. తృప్తిగా వడ్డించగా వారు తిన్నారు. ఒక బ్రాహ్మణి భర్త భార్యను వెళ్ళకుండా యింటిలోపెట్టి తాళము వేయ చనిపోయింది. దీని రహస్యం వినండి—

గోపాలురనగా సాధకులలోని విషయాలను పోషించు మనోవృత్తులు; వారి ఆకలి అనగా మనోవృత్తులు అణగారక విజృంభించుట. కృష్ణుడు నిర్వృత్తి, రాముడు ఆనందానికి అధి దేవతలు. (తరువాయి పేజీలో)

"క్రతువుల్, ధర్మము మంత్రతంత్ర ధనముల్ కాలంబు దేశంబు, దే
వతయున్ వహ్నులు, మేదినీసురులు నెవ్వాడట్టి సర్వేశు డీ
క్షితిరక్షింప జనించినా డెరుగ మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్"

అని బ్రాహ్మణులు మాకా భగవంతుని జూచుయోగం లేదని దుఃఖించారు.

---

వేదవిహిత కర్మకాండలతో దేవతలను మెప్పించి వరాలను పొందేవారు "బ్రహ్మ నయతి ఇతి బ్రాహ్మణః" వేద మార్గాన నడిపించే సాధనలు.

బ్రాహ్మణ భాగాలు=వేదాలలో దాగి ఉన్న ముక్తి తత్వాన్ని తీసి జ్ఞాన మార్గంచూపే ఉపనిషత్తులుగా యెరుగ వలెను. ఉపనిషత్తులకే "వేదాంతాలని" పేరున్నది. వేదం కర్మకాండ పరంగా చెప్పిన విషయాల్లో ఉన్న అంతరార్థమే ఉపనిషత్తులు జ్ఞానపరంగా వివరణ యిస్తాయి. వేదంలో పైకి ప్రకృతి శక్తుల్ని వశపరచుకొనే యజ్ఞాది కర్మభాగం అర్థంగా కానుపించినా అదే కర్మభాగాన్ని అంతరార్థపరముగా విడదీసిన జ్ఞానమార్గ మర్థమాతుంది.

## —* గోవర్ధనోద్ధరణము *—

"రా తల్లి! రమ్ము తండ్రీ!
వ్రేతలు గోపకులు రండు వినుడీ గర్త
మ్మేతలమున నుండుదు గో
వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్"

శ్రీకృష్ణపరమాత్మ తన చేయి చిటికిన వేలితో గోవర్ధన పర్వత మెత్తిన దానికింద సమస్త గోపాలురు, గోవులూ అందరూ యింద్రుడు గురిపించిన రాళ్ళ వానకు యేడహోరాత్రాలున్నారు.

ఇంద్రునికి యీ చరిత్ర మహాశ్చర్యం కలిగించి మేఘాలతో యింటికేగాడు.

"ఉడిగెను వానయు నెంతయు
వడిసెడి నదులెల్ల బొలిచె వరద లిగరె గొం
డడుగున నుంటక వెడలుడు,
కొడుకులు కోడండ్రు సతులు గోవులు మీరున్"

దాంతో దేవేంద్రుడు వచ్చి పాదములపై బడి శ్రీకృష్ణ పరమాత్మ నీట్లనియెను.

"కావంటి వెఱ్ఱివానికి
శ్రీ వల్లభ! నీవు శాస్తి సేసితి వేనిం
గా ర్వము మాని పెద్దల
త్రోవన్ జరుగుదురు బుద్ధితోడుత నీశా!"

అని మహాకవి యెంత మధురముగా చెప్పించాడు?

"నల్లనివాడు! పద్మనయనమ్ములవాడు! కృపారసంబు పై
జ  డువాడు! మౌళిపరిసర్పిత పింఛమువాడు! నవ్వు రా
జి  డు మోము వాఁడొకఁడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మ  యలార! మీ పొదలమాటున లేఁడుగదమ్మ! చెప్పరే!"

అక్షర లక్షలీయవలసిన పద్యమిది. భాగవతంలో అత్యంత ప్రాధాన్యం వహించింది కూడా యిదే!

మల్లిపుష్పాలను చూచి "ఓ మల్లెలారా! మీచాటున శ్రీకృష్ణపరమాత్మ లేడుగదా! ఆతడు నల్లనివాడు! అంతేనా పద్మనయనుడు, కృపారసం పై జల్లెడువాడు! మా మాన ధనాన్ని దొంగిలించుకొచ్చాడు, మీ పొదల్లో ఉన్న నల్లని వాడు గూర్చి చెప్పగలరా? కవిత్వమన్న యిలా ఉండాలిగదా! వత్సాలనూ, వృక్షాలను, అశోకాలనూ, యిలా పుష్ప వృక్షాలనన్నీ అడిగించాడు మహాకవి.

"అలకభ్రాజితమై సుధాంసు నిభమై హాసప్రభోద్ధామమై
జలజాక్షుంబయి కర్ణకుండల విభ్రాజద్గండమైయున్న యా
జలజాతాక్షు ముఖంబు జూడగలుగున్ సత్యంబువో నాకు నా
వల దిక్కేఁగుచు నున్న పీవన మృగ వ్రాతంబు లీత్రోవలన్"

శ్రీకృష్ణపరమాత్మను గనుటకు కంసునిచే పంపబ
అక్రూరుని పల్కులివి. తనకవితా నతీ సువర్ణ మంజులమంజి

శబ్దాలతో సహజాంత్యానుప్రాస భాసుర భూషణాలతో నలంకరించిన మహాకవి పోతన కేసరి!

"కనె నక్రూరుఁడు! పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల! న్నలంకృతుల! నుద్యద్భాసులం! బీతనీ
ల నవీనోజ్జ్వల వాసులం! గుసుమమాలాధారులన్! ధీరులన్!
వనితా కాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్"

సంస్కృత కావ్య స్వర్ణఖండాల నెన్నిటినో దీసి, కరగి, కమ్మచ్చున దీసిన సువర్ణ శలాకతో గలానైపుణ్య ముట్టిపడ నొక మనోహర శిల్పి భాషాయోషకు భూషణముగా, ఉపాయనముగా నంతరించి సముత్సుకతా సంతోషసామ్రాజ్య మేల మేలిమి లగా జూపిన ఒక మహాకళాఖంటమే శ్రీపోతన మహాకవి భాగవతం.

అక్రూరుని జూచి హరి—

"శుభమే నీకు? ప్రమోదమే సఖులకున్, చుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజ, కెల్లగోత్రజుల కత్యానందమే మామ ము
క్తభయుండే, వసుదేవ దేవకులు తత్కారాగృహాంబందు మ
త్ప్రభవవ్యాజ నిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై"

ఎంతటి క్షేమాలను అడుగుట "మామ ముక్తభయుండే?" మా మామ కంసుడు భయంలేకుండా ఉన్నాడా? అనతే [illegible], భయాన్ని విడిచిపె[illegible]డా? దేకీ వసుదే లు కొన ప్రా హాయువులతో, నన్ను [illegible]టవల కారాగా మ్ములోనే [illegible]

బద్ధులై ఉన్నారా అక్రూరుడా ? అని కృష్ణపరమాత్మ అడిగాడు.

"భూనాథుండు మఖంబుజూడ బిలువం బుత్తెంచినా డవ్విభుం
గానం బోవలె బాలునెయ్యి పెరుగుల్ కట్నంబులున్ గానుకల్
మీ నేర్పొప్పగ గూడబెట్టుడు తగన్ మీ మీ నివాసంబులన్
యానంబుల్ గొనిరండు పొండు మథురా యాత్రాభి
ముఖ్యంబుగన్"

దీనికి శ్రీ ఆదిభట్ల సంస్కృతీకరణ -

శ్లో॥ భూనాథో మఖమీక్షితుం సపదినః కంసః సమాజ్ఞప్తవాన్
గోక్షీర ప్రభృతి ప్రదేశనచయః సజ్జీక్రియతాం సత్వరమ్
యానాన్యానయత ప్రభాత సమయే సన్నద్ధభద్రాణ్యలం
సంలాపైః సహసాభవామ మథురా యాత్రాభి
ముఖ్యం వయమ్"

ఫుట్‌నోట్ :- "అలక్రభాజితమై" అను మహాకవి పద్యానికి శ్రీ ఆదిభట్టవారి సంస్కృతీకరణ—

స అలభ్రాజిత మిన్దుబిమ్బ సదృశం హాస ప్రభోద్దామ ము
జ్జ్వాల పద్మాక్షి మమూల్యాల లసద్గణ్డం తదీ యాననమ్
కింద్రష్టుం ప్రభవాణి సంప్రతి శుభంమ్మే సూచయన్తః ఖగాః
సవ్యం యాన్తిమృగా అపిక్షితజన క్షేమఙ్కర శ్శ్రీపతిః"

శ్రీ ఆదిభట్టవారికి పోతన మహాకవి అన్న వల్లమాలిన అభిమానం. అందువలన భాగవత పద్యాల నెన్నిటినో సంస్కృతీకరించారు.

ఎంత అద్భుతంగా సంస్కృతీకరించారో !

అక్రూరుడు రామకృష్ణులను మథురకు గొనిపోతూ మార్గమున కాళిందీనదిలో స్నానముచేసిన అక్రూరునకు శ్రీకృష్ణపరమాత్మ కన్పించాడు. అక్రూరు డాశ్చర్యమంది స్తోత్రం చేయుట మహాకవి దండకం వ్రాశాడు.

నిగూఢభావ రమ్యత ప్రసన్నముగా ప్రసాదము యీ దండక వర్ణన వర్ణనాతీతము. శబ్దార్థ భావరస మాధుర్యాలు సమిష్టిగా భాగవతంలో కాన్పిస్తాయి.

యీాయన యిందులో ప్రయత్నపూర్వకముగా ఆరితేరెనో, లేదా! పురాకృత పుణ్యముతో కృతార్థుడైనాడో తెలీదు. బాణుడు "నవోర్థో జాతి రగ్రామ్యా । శ్లేషో క్లిష్టస్ఫుటోరసః । వికటాక్షర బద్ధశ్చ । కృత్స్న మేకత్ర దుష్కరమ్" అన్నాడు.

పోతనకు వికటాక్షర బంధత్వము అమోఘంగా కుదిరింది అనగా అర్థానికి అందచందాలు తేగల, పద్యానికి హృదయ నమస్కార్చగల తత్త్వం వీరికి కుదిరినట్లు ఆంధ్ర కవుల యెవ్వ కే కుదరలేదు. మథురానగర వాసులు శ్రీకృష్ణుని చూచి—

"వీడటే! రక్కసి విగత జీవిగ జన్న
బాలుడ్రావిన మేటి బాలకుండు
వీడటే! నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు

వీడటే! మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దావరీడు
వీడటే! యెలయించి వ్రేతల మానంబు
చూరలాడిన లోక సుందరుండు

వీడు లేకున్న పుర మటవీస్థలంబు
వీడు బొందని జన్మంబు విగతఫలము
వీని బలుకని వచనంబు విహగ రుతము
వీని జూడని చూడ్కులు వృథలు వృథలు"

ఇలా విని అపగతాఖిలరోగీ! సర్వసంగ పరిత్యాగీ! విసమిత సకల విరాగీ! మోక్షతత్త్వామృత భోగీ! శుకయోగీ! మహాత్మా తరువాత చెప్పమనగా శుకయోగి—

సాధుభో సుగుణవిశాల! దీనజనావనలోల! కరుణాల వాల! సఞ్ఛిత పాపజాల! శాత్రవాంబుద ప్రచణ్డవాతూల! ముక్తికాన్తానుకూల! చారుశీల! కురు భూపాల! వినమన్నాడు.

ఈయన స్వభావోక్తులు చెప్పడంలో రమణీయార్థ ప్రతిపాదకత ప్రత్యేకముగా గోచరిస్తుంది. అచ్చటచ్చట అలంకార సమ్మిశ్రితత్వమున కావ్యసుందరి గజ్జెలుగట్టి రసహృద యుల మానస రంగస్థలాల్లో నర్తనచేస్తుంది.

ఇచ్చట సుధాముడు శ్రీకృష్ణపరమాత్మనుగన్న శరీ రాన్నే మరచిపోయి అన్నమాటలు విన్నారా?

"నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును, నితాం
తాపార భూత దయయును
తాపసమందార! నాకు దయసేయఁగదే!"

బాణుడు "స్ఫుటోరసః" అన్నాడు. రసపుష్టవంగా సామాన్య జనులు పలికిన పలుకుల నేరి తెలుగు వెలుగులు విరజిమ్మినట్లు యీ మహాకవి రససిద్ధితో చాల జాగరూకత వహించి కావ్యాన్ని నడిపాడు. దీని సంస్కృతీకరణ చూడండి.

శ్లో॥ "త్వత్పాద కమల సేవాం
తవ భక్తై స్సహ సదాపి దృఢసఖ్యమ్
భూతదయా మత్యన్తం
తాపస మందార! దేహి మే సతతమ్"

బలరామకృష్ణులు రాజమార్గాన నేగుచుండగా మార్గములో కుబ్జ కానుపింపగా నీ వెవరివని అడిగాడామెను కృష్ణుడు.

"చక్కనివాఁడవౌదు, సరసంబుల నొంపకు, మెల్లవారికిన్
చక్కదనంబు లెక్కడివి చారుశరీర! త్రివక్రయందు నే
నిక్కము కంసుదాసిని వినిర్మల లేపన విధాన! నన్
మిక్కిలి మెచ్చు దగ్గ మీరు విలేపనముల్ ధరింపరే!"

దీని సంస్కృతీకరణను చిత్తగించండి.

నానా లేపన భాజనధారిణీ మానన రుచినిచయ విన మితాబ్జాం కుబ్జాం సమీాక్ష కాత్వం వేపనాని! కస్మై నివేద యితుం వ్రజసి - క్వెం త్వన్నామ దేహ్యేతాని మత్వా మతీవ సౌందర్యేణ ప్రతిభాసీత్య వదత్.

కుబ్జను జూచిన కృష్ణుడు—

"ఎవ్వరి దానవు, లేపము
లెవ్వరికిం గోరి కొనుచు నేగెదు నీపే
రెవ్వతె మా కిమ్మిన్నియు
నివ్వటిలెదు చక్కనగుచు నీరేజముఖీ"

ఈ పద్యం ఎంత హాస్యభాసురంగా ఉంది? దీనికి "చక్కనివాడ వాడు" అను పద్యం జవాబు. ఇచ్చట సూర్యాస్తమయ వర్ణన అందంగా ఉంది.

"కళలు గలుగుగాక కమల తోడగుగాక
శివుని మౌళిమీాద జేరుగాక
నన్యునొల్ల దపనుడైన మత్పతి యని
సాధ్వి భంగి కమలజాతి మొగిడె"

కళాప్రపూర్ణుడే కానీ, ధనవంతుడేగానీ, గొప్పవాని తలపైనే యెక్కించుకోనీ, సాధ్వి మాత్రం బాధించువాడైనా తన భర్తనే కొలుస్తుంది.

కళానిధీ, లక్ష్మి సోదరుడూ, పరమశివుని తలమీా దున్నా; సూర్యుడు తన కిరణాలచేత బాధిస్తున్నా పద్మాలు

సూర్యునే కోరును. అందువలన అన్ని ముఖాలు ముడుచు కొన్నాయి. సాయంసమయ మన్నమాట.

శబ్దశ్లేష సీతడెంత అందంగా పోషించాడు. తేటమాట లతో, తీయని రసాన్నందించాడు.

రామకృష్ణులు కువలయపీడ మదగజాలతో తలపడ రంగానికి ప్రవేశించారు. అప్పుడు పౌరులు—

"ధీరుల! వస్త్రమాల్య మణిదీప్తివిభూషణ ధారుల న్నటా
కారుల! సర్వలోక శుభకారుల! మానవ మానినీ మనో
హారుల! రంగభూతల విహారుల! గోపకుమారులన్ మహా
వీరుల! జూచి చూచి తనివిన్ తుదిముట్టక లోకులందరున్"

ఈ పద్యమెంత రసభావాలంకారంగా ఉంది.

సంస్కృతీకరణ చూడండి—

శ్లో॥ నటకారా! ధీరా! భువనశుభాకారా! మణిమయో
ర్వలంకారా! వీరా! వ్రజవీరకుమారా! జనతతిః
వధూమారా మల్లావనితల విహారా! బహుముదా
ముహుర్లోకిత్వా స్యపిమదపి నహితృప్తిం ప్రతియయౌః"

ఎంతో అభిమానము లేకుండా ఒకరి గ్రంథాన్న యింకొకరు వేరొక భాషలోకి అనువదింపరుగదా!

చాణూరుడు రామకృష్ణులను జూచి

"వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెనగన్ మిక్కిలినేర్చినారనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుండిట మిమ్ము జీర బనిచెన్ మల్లాహవక్రీడకున్
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపగాన్"

మహాకవి పోతన కొన్ని యెడల పూర్వకవుల అనుసరణలూ, మరొక యెడ తన సూక్తి వైచిత్రితో అల్పాక్షర అనల్పార్థ నూతనచ్ఛాయ లెన్నిటినో జూపించి రసజ్ఞుల మానసాలను దోచుకొనును.

కంస రాజేంద్రుని జంపి తరువాత ఆతని తండ్రి ఉగ్రసేనునికి రాజ్యాభిషేకంచేసి, అనంతరం కన్న తల్లిదండ్రులను దేవకీ వసుదేవులను చెరవిడిపించి రామకృష్ణులు

"కాంతా కాలల మానిమిత్తము మిముం గంసుండు కారింపగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపగా రాక ని
ష్కారుణ్యాత్ములమైన కూరిరుల మహాకౌటిల్య సంచారులన్
సారాలిక్షములార! మమ్ము గొరతల్ సైరించి రక్షింపరే"

యీ అద్భుత కవితానిర్మాణ శక్తిని గాంచండి.

అలా రామకృష్ణులు తల్లిదండ్రులకు మ్రొక్కి వారి దీవెనలంది యెంతటివారికైనా గురు ననుగ్రహము కావాలని కాశీకేగి అచట దివ్యుడైన "సాందీపుని" దగ్గరకు చేరిరి.

"వేదశ్రేణియు, సంగకంబులు ధనుర్వేదంబు దంత్రంబు మ
న్వాది వ్యాహృతధర్మ శాస్త్రములు సుధ్యాన్వీక్షయమున్
దర్క వి
ద్యాదక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియన్ జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూతప్రమోదంబునన్"

"అరువది నాలుగు విద్యలు
నరువది నాలుగు దినంబు లంతన వారల్
నెరవాదులైన కతమున
నెరి నొక్కొకనాటి వినికి నేర్చిరి లేశా:"

"ప్రపేదిశే ప్రాక్తన జన్మ విద్యా" అన్నాడు కాళిదాసు మహాకవి. సామాన్యుల పట్ల ఇట్లన ఇక కేవల శ్రీమహావిష్ణువగు శ్రీకృష్ణపరమాత్మ గూర్చి వేరుగా చెప్పవలెనా?

"నాపై చిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నారాకగాంక్షించుచున్
నా పేరాత్మల నావహించుచు పగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిపడిరో కోపించిరో దూఱిరో
వ్రేపల్లెన్ నిజధర్మగేహములలో విభ్రాంత చైతన్యలై"

ఇది గోపకాంతలు గూర్చి చెప్పినా ఆత్మలగూర్చి చెప్పిందిగా మనకు గోచరిస్తుంది. కృష్ణపరమాత్మను మానవాకృతిలో మనం చూడకూడదు. ఆతనొక ఆధ్యాత్మిక తత్త్వంగా గ్రహించాలి. ఆ తత్త్వాన్ని ఆకర్షించుకొనుటయే శ్రీభాగవత తత్త్వం భావగతం చేసుకోవడ మౌతుంది.

వ్యాసులవారు "కృష్ణ" శబ్దానికి యేమి చెప్పారో చూద్దాం.

"స ఆత్మా స పరం బ్రహ్మ కృష్ణ యిత్యభిధీయతే
కృషి స్తద్భక్తి వచనో నశ్చ తద్దాశ్య వాచకః
భక్తిదాస్య ప్రదాతయః స చ కృష్ణః ప్రకీర్తితః
స కృష్ణః సర్వస్రష్టాఽఽదిః ఏవహి"

(దేవీ భాగవతం - 8స్క; 2 అధ్యాయా; 22 శ్లో)

ఆత్మ - పరబ్రహ్మ అనే అర్థాలు రెండూ "కృష్ణ" పదంలో ఉన్నాయి. "కృషి" అనే ధాతువుకు "భక్తి" అని అర్థం. "న" దాస్యమునకు అర్థం. అనగా భాగ్యదాస్యం యిచ్చువాడని తెలియాలి అందువలన "కృష్ణ" అనగా "దాస్యమును యిచ్చువాడని అర్థం. అద్వైతరూపమే కృష్ణుడని దేవీభాగవతం చెప్పుతుంది

గోపకాంతల దగ్గరకు ఉద్ధవుని పంపుతూ శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన దీపద్యంలో మహాకవి అడుగడుగునా అద్భుతామృత కవిత్వాన్ని మనకు రుచిచూపిస్తాడు.

## 8వ స్తబకము

## (రుక్మిణీ కల్యాణము - జీవ సందేశ సాధన)

పరీక్షిన్నరేంద్రుడు శుకమహర్షిని చూచి

"కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తవై
కల్యుండెవ్వడు తృప్తుఁడౌ? నవి వినంగా గ్రొత్తలౌచుం దుసా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుగంబల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలో కౌతూహలం బయ్యెడిన్"

ఏమి కవితాతత్త్వం – వరుసగా నాల్గు పాదాల్లో "కల్యాణ - వైకల్యుడు - సాకల్యము - కల్యాణ పదాలతో బిగింపబడింది. శ్రవణ శుభగమైన నాదం "కల్యాణ మత్యయే స్వర్ణే కల్యాణం మంగళేఒపిచ" అత్యయము - బంగారము - సమస్త శుభ సంయోగము "కల్యాణ" మను పదాలకు అర్థం. శ్రీభాగవత పురాణములో "రుక్మిణీ కల్యాణము" ఒక మహత్తర ఆధ్యాత్మికౌన్నత్యము గల కళాఖండం. యీ పద్యం వినండి.

భూషణములు! చెవులకు, బుధ
తోషణము, లనేక జన్మ దురితౌఘ విని
శ్శోషణములు! మంగళతర
ఘోషణములు! గరుడగమను గుణభాషణముల్"

పంచప్రాస యమకాలంకార మీ పద్యం.

నిజముగా శ్రీకృష్ణపరమాత్మ భాషణలు చెవులకు భూషణలే! యిచ్చట మహాకవి "గరుడ గమనుడు" అన్నాడు గాని "కృష్ణపరమాత్మ" అనలేదు. అందుకొరకు "గరుడుని" గూర్చి తెలిసికొందాం యీతడు ఛందోమయుడు. అనగా వేదముల దివ్య స్వరూపమే గరుడుడుగా చెప్పతారు.

ఈ గొప్ప పద్యానికి సంస్కృతీకరణను చూడండి.

శ్లో॥ సదా సుభక్త శ్రుతిభావనాని!
మహోఘ దుఃఖాబ్ధి విశోషణాని!
ఆనన్ద నిశ్రేయస పోషణాని!
హరే ర్స్మరారే ర్గుణభాషణాని!"

పద్య మెంత హృద్యానవద్య సహృదయ నైవేద్యంగా ఉన్నదో దానిని మించినదీ సంస్కృతీకరణ శ్లోకము అనగా మహాకవి యందుండు మమకారమే యిందుకు కారణము.

"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
అబలలతోడ వియ్యంబు లందు,
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకు బెట్టించు చెలువ మెఱయ,
రమణీయ మందిరారామ దేశంబుల
బువ్వుదీగెలకును బ్రోదిచేయు,
సదమల మణిమయ సౌధ భాగంబుల
లీలతో భర్మ డోలికల నూగు
బాలికలతోడ జేలరేగి బంతులాడు
శారికా కీరపంక్తికి జగుపు చెప్పు
బర్హి సంఘములకు మురిపములు గరపు
మద మరాళంబులకు జూపు మందగతులు"

మహాకవి యీ పద్యంలో తనకాలమునాటి బాలికల ఆటలను గూర్చి చెప్పాడు. రుక్మిణి హృదయ సౌందర్యాన్ని గూడా దీనిలో ద్యోతకం చేస్తూ యెంత రమణీయ పదాలతో అలంకార యుతంగా నిర్మించాడో అనూహ్యం.

ఈ క్రింది పద్యంలో రుక్మిణీ కృష్ణపరమాత్మల యిరువురి యౌవనాన్నీ కలిపి యెంత గొప్పతనంతో మహాకవి చెప్పాడో మాటలందవు.

"దేవకీ సుతునకు గ్రక్కున తీగలు వీడంగ
వెలదికి మైదీగ వీడదొడగె,
కమలనాభుని చిత్త కమలంబు వికసింప
గాంతి నింతికి ముఖకమల మొప్పె,
మధు విరోధికి లోన మదనాగ్ని పొడచూప
బాలతికి చనుదోయి పొడవుసూపె,
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
జలజాక్షి మధ్యంబు సన్నమయ్యె,
హరికి ప్రేమబంధ మధికంబుగా, కేశ
బంధ మధికమగుచు బాల కమరె
బద్మనయను వలన బ్రమదంబు నిండార
నెలత యౌవనంబు నిండియుండె"

మహాకవి పోతనగారు యీ పద్యం అపూర్వ కవితాలంకార శిల్ప రమణీయ శబ్ద మాధుర్య ధురత్యంగా రచించాడు.

"బాలకమరె" అను శబ్దములో గల "కమరె" సంధిలో "అమరు - కమరె" రెండురూపా లున్నవి.

అంతవర కాడుతున్న మహాకవి కూతురు యీ "బాల కమరె" అనుట వలన అక్కడ వున్న కుంపటిలో పడిందని ఒక కధ ఉంది. తరువాత శ్రీరామోపాసనతో ఆ బాలిక బ్రతికినట్లు చెప్పుతారు.

యెంతోమంది యీతనికి ముందు కాలములలో ఉన్న వారూ, యీతని తరువాతి వారుగాని యిటువంటి అలకారం గల అనగా శ్రీకృష్ణ పరమాత్మ - రుక్మిణీదేవి గూర్చి యౌవనముల రెండిటి వర్ణన లాంటిది యెవరూ చేయలేదు. అంతేకాదు శబ్దములోగల సౌందర్యాన్ని గ్రహించి ఆశబ్దం యింకొకదానితో కలిస్తే వచ్చే మహత్తర అర్థం, ఆ శబ్దాన్నే యింకొక రీతిలో చెప్పితే వచ్చే అర్థాన్ని తెలిసి శబ్దనాడిని పట్టుకొని, శబ్దతత్వాన్ని గ్రహించి అక్షరాప్సరసల సహృదయ రంగస్థలాల్లో నర్తింపజేసే మహాశక్తి పోతన తరువాత యే మహాకవి అనేవారిలో కాన్పింపదు. ఇక ప్రస్తుతాంశం.

దేవకీ సుతుడైన శ్రీకృష్ణపరమాత్మ కోర్కె తీగలు ముందుగా వీడాయి ద్వారకలో, అట్టు విదర్భదేశానికి ముఖ్యపట్టణం "కుండినసగరము" అంతిపురిలోగల రుక్మిణీదేవి "మైదీగె" శరీర కోమలత - శుభగత - సౌష్ఠవాలను తీగ బాగా విప్పారింది, కమలనాభుడగు శ్రీకృష్ణుని మనఃపద్మం

బాగా వికసించింది, రుక్మిణీదేవి మంచి కాంతితో ముఖకమలం ఎంతో వికసించింది, స్త్రీకిగాని పురుషునికిగాని యౌవనం ప్రాపించిందో ఆ సమయాన హృదయంలో మన్మథాగ్ని రగులుట ప్రారంభిస్తుంది; అలాగే కృష్ణపరమాత్మకూ మద నాగ్ని పొడసూపింది. యిక రుక్మిణీదేవికో స్తనాలు ఉబ్బి అందంగా తయారయాయి. యీ స్థితిలో ఉన్న కృష్ణునికి ధైర్యం సన్నగిల్లగా, రుక్మిణీదేవి మధ్యము (నడుము) సన్న గిలింది. కవులు స్త్రీల నడుము చాలా చిన్నదిగా వర్ణిస్తారు. కృష్ణునికి రుక్మిణియందు యెంతో ప్రేమబంధ మధికం కాగా, రుక్మిణీదేవి కేశబంధం అనగా తలకురులు వంకరతో పురుషుల నాకర్షించు నట్లు అందం చిందించినట్లు తయారయింది. పద్మ నయనుడైన శ్రీకృష్ణపరమాత్మయందే ఆనందంనిండి రుక్మిణీ దేవి ఉన్నందువల్ల ఆమె యౌవనముతో నిండియున్నది.

శ్రీభాగవతంలో అపూర్వ అలంకారాన్వితమైన దీపద్యం. దీనికి వ్యాఖ్య వ్రాయాలన్న ఒక గ్రంథమే ఔతుంది. గ్రంథ గౌరవ భీతిని విరమించాను.

తన తండ్రి సంస్థానానికి వచ్చిన అనేకమంది మహా పురుషుల వలన శ్రీకృష్ణుని రూప - గుణ - బలాదులు చెప్పగా విని ఆతడే నా భర్తని రుక్మిణి శ్రీకృష్ణునే హృదయంలో రూఢిగాభావించు కొంది.

అలాగే కృష్ణుడు.

"ఆ లలన రూపు బుద్ధియు
శీలము లక్షణము గుణము చింతించి తగన్
బాలారత్నము దన కి
ల్లాలుగ జేకొందు ననుచు హరియుం దలచెన్"

శ్రీకృష్ణ పరమాత్మ కూడా రుక్మిణీ దేవిని జూచివచ్చి ఆమె రూపు - బుద్ధి - శీలము - లక్షణము - గుణము బాగా హృదయంగమంగా వర్ణించి చెప్పినవారందర నుండి బాగా విని తప్పకుండా ఆమెనే తన కిల్లాలుగా జేసికొంటానని మనస్సులో రూఢి చేసుకొన్నాడు.



అందరు బంధువులూ శ్రీకృష్ణునకే రుక్మిణీదేవిని యివ్వాలని యోజింపగా రుక్మిణి పెద్దన్న మాత్రం శిశుపాలునికే నా చెల్లెలిని యిస్తానని పట్టుబట్టాడు. యెవరు చెప్పినా వినలేదు, వినడు.



అందువలన రుక్మిణీదేవి ఆప్త బ్రాహ్మణోత్తముని బ్రతిమాలి ద్వారకానగరానికి పంపింది. ఆతడు నేగి కృష్ణునితో



"ఏ నీగుణములు కర్ణేంద్రియంబులు సోక
దేహతాపంబులు దీరిపోవు
నే నీశుభాకార మీక్షింప కన్నుల
కఖిలార్థ లాభంబు గలుగుచుండు,

నే నీచరణసేవ లేప్రొద్దు చేసిన
భువనోన్నతత్త్వంబు బొందగల్గు
నే నీలసన్నామ మేప్రొద్దు భక్తితో
దడవిన బంధసంతతులు వాయు,
నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చి యున్నది నీయాన, నానలేదు
కరుణ జూడుము కంసారి! ఖలవిధారి!
శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!"

ఈపద్యమెంత యెత్తుబడిలో అందము చిందులేస్తుందో! రుక్మిణిదేవి అంతఃపుర కాంత. తల్లీ, తండ్రీ అన్నలచాటు ఆడపడుచూ, కన్య. అటువంటప్పుడు వీరందరనూ కాదని, అందులో ప్రచండుడైన పెద్దన్నను కాదని చాటుగా ఎవరికీ తెలియకుండా కొన్నివందల మైళ్ళ దూరాన సముద్రంలో ఉన్న ద్వారకానగరానికి స్వీయంగా సందేశము పంపిం దంటే సామాన్య కన్యగా దలపవచ్చునా? చాలా గడుసుదనం గల దానిగా తెల్సుకోవాలి.

శ్రీకృష్ణపరమాత్మ గుణాలు చెవుల్లోకి వినిపింపగా శరీరాంతర్గత తాపం తీరిపోతుంది. ఆయన దివ్యదర్శనం చేసిన కనులకు సకలార్థాలూ సిద్ధిస్తాయి.

ఆతని పాదసేవ చేస్తే భువనోన్నతత్త్వం అనగా మోక్షం పొందగలుగుతారు. ఆతని నామపారాయణ చేస్తే సమస్త బంధాలూ వైతొలగుతాయి.

అటువంటి నీయందే నా చిత్తం చిక్కిపోయింది. నీపై ఒట్టుపెట్టుకొని మరీ చెప్పుతున్నానన్నది రుక్మిణి.

యీ క్రింది పద్యం తిలకించండి.

"ధన్యున్ లోకమనోభిరాము, గుల విద్యా రూపతారుణ్య సౌ
జన్య శ్రీ బలదాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు గోరదే మును రమాకాంతా లలామంబు, రా
జన్యానేకపసింహ!, నావలననే జన్మించెనే మోహముల్"

సామాన్యంగా ఒకనియందు "లోక మోహనత, కులము - విద్య - రూపము - యౌవనము - సౌజన్యము - శ్రీ - బలము - దానశీలత - శౌర్యము - కారుణ్యము" యీ పదకొండు ఉంటాయా? వుండవు. కనుక రుక్మిణి శ్రీకృష్ణ పరమాత్మను యెంత గడుసుగా అడుగుతుందో!

రాజులను ఏనుగులకు సింహము వంటి వాడవు. యిన్ని గుణాలున్న నిన్ను యేకన్యలు కోరరు? అంతేకాదు పూర్వం శ్రీమహాలక్ష్మి నిన్నుకోరి వివాహం చేసికో లేదా? కన్యగా ఉండి నిన్ను మోహించడం నాలోనే పుట్టలేదుకదా ప్రభూ?" అన్నది. యింకా యిలా అన్నది.

"శ్రీయుతమూర్తి! యో పురుష సింహమ! సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ
ధ్యాయిని యైన నన్ను వడి దా గొనిపోయెదనంచు నున్నవా
డా యథమాధముం డెరుగ డద్భుతమైన భవత్ప్రతాపముల్"

ఓ పురుషసింహామ! మృగరాజగు సింహానికే చెంద గల దానిని నక్కపోతు కోరిన విధంగా నీ పాదపద్మారాధనా మణినైన నన్ను అధమాధముడు శిశుపాలుడు కోరుచున్నాడు. నీ ప్రతాపం వాడేమెరుగును?

"వ్రతముల్ దేవ గురు ద్విజన్మబుధ సేవల్ దానధర్మాదులున్
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణు గాంక్షించి చే
సితినేనిన్ వసుదేవ నందనుడు నాచిత్తేశు డౌగాక ని
ర్జితులై పోదురుగాక! సంగరములో జేదీశముఖ్యాధముల్"

ఓ శ్రీహరీ! గత జన్మలో వ్రత, గురు, బ్రాహ్మణ పూజలేను చేసినదానినే యైన వసుదేవ నందనుడే నాభర్త యిప్పుడగుగాక! యుద్ధంలో శిశుపాలాది అధమాధము లందరూ ఓడి పారిపోవుదురు గాక!

రుక్మిణీదేవిచేత యెంత ధీరతతో చెప్పించుచున్నాడో మహాకవి చూడండి. అంతేకాదు నేను వస్తాను నీవు యేవిధంగా చిక్కగలవు అని కృష్ణుడనకుండా తానే తనను తీసికొని రాగల మార్గమెలా సూచిస్తుందో చూడండి.

"లోపలి సౌధంబులోన వర్తింపగ
[illegible] దే వచ్చునో నిన్ను దెత్తునేని
కావలి వారలు దల బంధువులు జంపి
[illegible] కాని, తే రాదని కమల నయన

భావించితేని నుపాయంబు జెప్పెద,
నాలింపు, కులదేవ యాత్ర జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క
బెండ్లికి మునుపడ బెండ్లి కూతు
నేఁమి మావారు పంపుదు రేను నట్లు
పురము వెలువడి యే తెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమునకు
వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్య చరిత"

"హేం ప్రభూ! నీవు అంతఃపురములోనికి ఎలాగ రాగ లను? కావలివారూ, దగ్గర బంధువులూ ఉంటారంటారేమో! వినండి. మాకొక ఆచార ముంది. పెండ్లికూతురును పెండ్లి పీటపై కూర్చుండ బెట్టేముందు, పార్వతీ పరమేశ్వరుల మంది రాన నూతన వధువుచే వారికి పూజచేయించిన అనంతరమే ఆ వధువును పెండ్లి పీఠమున కూర్చుండబెట్టు రివాజుంది. అలాగే నన్నూ చేస్తారు. అందువలన శివ పరమేశ్వరిల పూజచేసి వస్తున్న సమయమున మీరు నన్ను దీసుకొని పొండి" అని యెంత వివరంగా మహాకవి రుక్మిణిచేత చెప్పిం చారు. వ్యాసులవారి రుక్మిణి మాత్రం యింత నిర్భయంగా చెప్ప లేదు.

"ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని
కర్ణ రంధ్రంబుల కలిమియేల?
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని
తనులత వలని సౌందర్య మేల?

భువన మోహన! నిను బొడగానగాలేని
చక్షు రింద్రియముల సత్త్వమేల?
దయిత! నీ యధరామృతం బానగాలేని
జిహ్వకు ఫలరస సిద్ధి యేల?
నీరజాత నయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల? యెన్ని జన్మములకు!"

నేను గొప్ప కవిననీ, అభినవ పోతనలమనీ విఱ్ఱవీగెడు కవు లెందరైనా యెవ్వరైన యెన్ని జన్మ లెత్తినా యిటు వంటి పద్యం కనీసం ఒక్కటి వ్రాయగలరా? లేకున్న అభినవ పోతన లేమి? అభినవ పూతన లనవచ్చు. అమృతోపమాన మైన పోతన మహాకవి యెక్కడ? మన మెక్కడ?

ఈ విధంగా శ్రీకృష్ణ పరమాత్మకు రుక్మిణీదేవి పంపిన సందేశాన్ని అగ్నిద్యోతనుడను వృద్ధబ్రాహ్మణుడు చెప్పి

"పల్లవ వైభవా స్పదములు పదములు,
కనక రంభా తిరస్కారు లూరు,
లరుణ ప్రభా మనోహరములు! కరములు
కంబు సౌందర్య మంగళము గళము
మహిత భావాఽఽభా మధ్యంబు మధ్యంబు
చక్షు త్ప్రవదాయి చన్నుదోయి
పరిహాసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధుకర శ్రేణి వేణి

భావజాశుగముల ప్రావులు చూపులు
కుసుమ శరుని వింటి కొమలు బొమలు
చిత్త శోషణములు చెలువ భాషణములు
జలజ నయన ముఖము చంద్ర సఖము"

యేమి యీ అలంకారము, పాదము మొదలు శిరః పర్యంతం రుక్మిణీదేవిని బ్రాహ్మణోత్తముడు శ్రీకృష్ణపరమాత్మ ముందీ పద్యంలో సర్వస్వమూ నుంచి చెప్పాడు. ప్రతి పదమూ యమకముగా చెప్పడం పోతన మహాకవికి వెన్నతో పెట్టిన విద్య. అద్భుతాద్భుత వృత్తి యీపద్యం.

మరల సంక్షిప్తంగా యిలా అన్నాడు.

"ఆ యెలనాగ నీకు తగు, నంగనకుం దగు నీవు మా యుపాధ్యాయుల యాన, పెండ్లియగు, దప్పదు జాడ్యము లేల? నీవు నీ తోయమువారిఁ గూడుకొని తోయరుహానన దెత్తుగాని విచ్ఛేయుము, శత్రులన్ నురుము సేయుము, చేయుము శోభనం బిలన్"

యీ పద్యం ఎంత అందంగా సెప్పాడు!

ఆమెకు నీవు, నీ కామె తగినవారు, మా గురువుల తోడుగా చెప్పుచున్నాను. మీ యిరువురకూ తప్పక పెండ్లి జరుగుతుంది అని చెప్పించి "తోయము" అను శబ్దమ్ముపై యెంత అందమైన అర్థం చూపించాడు మహాకవి.

నీవు "తోయము" వారితో తప్పక రా! మా వారితో నీవు రా! "తోయరుహానన" చంద్రుని వంటి మోముగల రుక్మిణిని నీవు దెచ్చుటకు తప్పక విచ్చేయుము! తప్పకుండా రావాలని అర్థము. నీ శత్రువుల నందరనూ నురుము సేయుము, అంతే కాదు భూమికి శోభనము సేయుము, అనగా భూమికి శుభమును చేకూర్చుమని, అంతేనా శోభనము రుక్మిణీదేవికి చేయుమని యిందు ధ్వని ఉంది. యెంత అర్థ వంతమైన పద్యం.

సామాన్యంగా యెదుటి వారు మాట్లాడు నప్పుడు, వారేమంటారో సరిగా వినకుండా మాట్లాడుతారు. అర్థము లేని వాగాడంబరంతో అల్లరి సృష్టిస్తారు. అటువంటి దేమీ లేకుండా "వినదగు నెవ్వరు చెప్పిన" అన్నట్లు మహాకవి యిచ్చట అగ్నిద్యోతనుచేత యేలాగు యెంతవరకు రుక్మిణీ సందేశాన్ని చెప్పించాలో చెప్పించాడు. తరువాత శ్రీకృష్ణ పరమాత్మ ఆతడు చెప్పిన ప్రతి విషయాన్ని ఆనందానుభూతితో, అత్యంత శ్రద్ధా గౌరవభావంతో వినునట్లు చెప్పించి, అంతా అయిన తరువాత బ్రాహ్మణుడు మరి మాటలాడ కుండా ఆగిపోయాడు.

ఆ సమయాన శ్రీకృష్ణ పరమాత్మతో యెంత మృదువుగా గాంభీర్యంగా అల్పాక్షరములతో అనల్పార్థాన్ని ధ్వనింపజేశాడో మనమందరం నేర్చుకోవాలి గదా!

"కన్నియమీద నాతలపు గాఢము, కూరుకు రాదు రేయి నా కెన్నడు, నా వివాహాము సహింపక రుక్మి దలంచు కీడు, నే మున్నె యెరుంగుదున్, బరుల మూక లడంచి కుమారి దెత్తు వి ద్వన్నుత! మానుద్రచ్చి నవవహ్నిశిఖన్ వడి దెచ్చుకైవడిన్"

మహా విద్వాంసుల చేతనే పొగడబడిన ఓ మహాను భావా! నా హృదయ భావాన్ని స్పష్టంగా చెప్పుచున్నాను ఆ రుక్మిణీ కన్యామణిపై నాకున్న అభిప్రాయం వినండి. ఆమెపై నాకున్న గాఢమైన ప్రేమతో రాత్రు లెప్పుడూ నేను నిద్రపోనే లేదు, నాకు రుక్మిణవు తుందని రుక్మి కీడు నే తలపెట్టడం నాకు ముందే తెలుసు. విరోధుల వధించి తప్పక కుమారిని తీసుకొనియే వస్తాను. యెలాగను కట్టకట్టను రాపా డించి నూతనాగ్నిని తెచ్చినట్టుగా తెస్తాను.

ఇన్ని పద్యాల్లో రుక్మిణీ సందేశాన్ని బ్రాహ్మణుని ముఖంగా చెప్పించిన మహాకవి శ్రీకృష్ణపరమాత్మ అభిప్రా యాన్ని ఒక పద్యంలో చెప్పించాడు.

అక్షర రమ్యత యీ మహాకవికి అద్భుతంగా కుది రింది. యీ శక్తి ఆదికవినుంచి అరణంగా పొందా డీయన.

## 9 వ స్త బ క ము

సమస్త సైన్యంతో, బంధుమిత్రాదులతో పెద్ద ఆట్ట హాసంగా శిశుపాలుడు కుండిన నగరానికి వచ్చాడు.

జరాసంధ, దంతవక్త్ర, సాళ్వ, పౌండ్రక వాసుదేవాది శ్రీకృష్ణ విరోధులందరూ శిశుపాలుని పక్షాన కుండిన నగరానికి రానే వచ్చారు.

శ్రీకృష్ణ పరమాత్మ వచ్చాడు. తమ్ముడొక్కడూ వెళ్ళేడే అని బలరాముడు కూడా సైన్యంతో కుండిన నగరానికి వచ్చాడు.

యేకాంతంలో రుక్మిణి తన మనస్సులో సందేహాందోళనతో యేమీ తోచక

"ఘనుడా భూసుర డేగెనో, నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగా దలచెనో విచ్చేసెనో, యీశ్వరుం
డనుకూలింప దలంచునో దల్లపడో యార్యామహాదేవియున్
నను రక్షింప నెరుంగునో యెరుగదో నాభాగ్యమెట్లున్నదో!"

సహజానుప్రాస కవితా విస భాసురుడగు మహాకవి యీ పద్యం యెలా పలికించాడో!

"పోడను బ్రాహ్మణుండు యదుపుంగవు పీటికి, వాసుదేవుడున్
రాడను, నింకబోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుడున్
లేడను, రుక్మికిం దగవు లేదిట జైద్యున కిత్తునంచు నా
న్నాడను, గౌరి కీశ్వరికి నావలనన్ గృపలేదు నేడనున్"

సందేహ మందే హా రుక్మిణి మనస్సు యీ పద్యంలో మహాకవి చిత్రించాడు [illegible]. స్త్రీ ఆపదలో వున్న చిత్రీకరణ మింతకు మించి సాధ్యం కాదు.

నేను పంపిన బ్రాహ్మణోత్తము డసలు వెళ్ళి ఉండడు, వెళ్ళినంత మాత్రాన శ్రీకృష్ణపరమాత్మ వస్తాడా? రాడు. యిక మళ్ళీ హరి దగ్గరకు వెళ్ళేవారెవరూ లేరనగా, రుక్మి తప్పకుండా శిశుపాలునికి నన్నిచ్చి వివాహం గావిస్తాడను, సహజ సుందర కవితాసముజ్వలత యిందు చిందులు త్రొక్కుతుంది. యీ పద్యాలను తిలకించండి,

"చెప్పదు తల్లికిం దలపు జిక్కు దిశల్ దరహాస చంద్రికన్
గప్పదు, వక్త్రతామరసగంధ సమాగత భృంగ సంగముల్
రొప్పదు, నిద్రగైకొన, దురోజ పరస్పరసక్త హారముల్
విప్పదు, కృష్ణ మార్గగత వీక్షణ పంక్తులద్రిప్ప దెవ్వడున్"

అంత్యప్రాసాలంకార పంకజనాభుడైన మహా కవితా మార్గమే వేరు. యెంత చారదృష్టితో రుక్మిణీ పాత్ర ననల్ప శిల్ప కవితా కమనీయ సువర్ణ చిత్రంగా వినిర్మించాడో!

సామాన్యంగా బిడ్డలు తండ్రికన్న తల్లికే యేవిషయమైనా ముందుగా చెప్పతారు. రుక్మిణి తల్లికికూడా తన మనో వేదన చెప్పదు. ఆమె చూపులన్నీ కృష్ణపరమాత్మ రాగల మార్గాన్వేషణలోనే చిక్కుకొని వేరు వైపు రావడం లేనేలేదు. యీ పద్యం అపూర్వ భావబంధుర శుభగంగా కవులకు మార్గదర్శకంగా ఉంది.

"తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు, కొప్పు జక్కఁగా
ముడువదు, నెచ్చెలింగదిసి ముచ్చటకుంజన, దన్న మేమియున్
గుడువదు, నీరముంగొనదు, కూరిమి కీరముఁజేరి పద్యమున్
నొడువదు, వల్లకీగుణ వినోదము సేయదు, డాయ దన్యులన్"

ఈ రెండు పద్యాల్లోగల పదాలు "చెప్పదు" మొదలగునవి అవధానములలో దత్తపదిని బోలినా యింత మధుర మరంద భావనా తుందిలంగా యే అవధాని చెప్పగలడు?

యిటువంటి పద్యాలను వ్రాయాలన్న యెవరికి తరం? మొత్తం 12 స్కంధాల్లోగల గద్య పద్యాలన్నీ వ్రాయవలసినవే! యిందేవి మంచివి కావు అనగలగడం మన తెలివి తక్కువనే నిరూపించడం అవుతుంది.

"మృగనాభి యలదదు మృగరాజ మధ్యమ,
జలముల నాడదు జలజగంధి
ముకురంబు జూడదు ముకుర సన్నిభముఖి,
పువ్వులు దుఱుమదు పువ్వుబోణి,
వనకేళి గోరదు వనజాత లోచన,
హంసంబు బెంపదు హంస గమన,
లతల బోషింపదు లతికా లలితదేహ,
తొడవులు దొడవదు తొడవు తొడవు,

తిలక మిడదు నుదుట దిలకినీ తిలకంబు,
గమలగృహము జొరదు కమల హస్త,
గారవించి తన్ను గరుణ గైకొన వన
మాలి రాడు, తగవు మాలి యనుచు"

ఈ పద్యములో ఉపమానోపమేయ యమక గమక క్రమము. లలిత లాలిత్య పదబంధ అందచందాలు వివరింప గలమా? స్త్రీలకు గల పేర్లు వాటి అర్థాలలోగల అంత రార్థం యిందుగలవి వివరింప గ్రంథమే అగును.

"యిందుగల డందు లేడను సందేహము వలదు" పోతన మహాకవి తన కవితా సుందరికి కూర్చిన మార్పులేని అలంకారాలతో ఆంధ్ర భాషా యోషకు అపూర్వ సాహిత్య సౌధాన్ని నిర్మించాడు.

యిలా రుక్మిణి డోలాందోళిత మనస్సుతో నుండు సమయంలో అగ్నిద్యోతనుడు వచ్చి యెంత ఔచిత్యంగా చెప్పారో వినండి.

"మెచ్చె భవద్గుణోన్నతి, కమేయ ధనాదు నిచ్చె నాకు, దా
వచ్చె సుదర్శనాయుధుడు, వాడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షస వివాహమునన్ గొనిపోవు నిన్ను, నీ
సచ్చరితంబు, భాగ్యమును సర్వము నేడు ఫలించె కన్నికా."

అన్నాడు. ఒక మహత్తర కార్యక్రమమున పంపిన మనిషి తిరిగి వచ్చిన ఉత్తర క్షణంలో ఆ కార్య విజయాన్ని

వెంటనే ఒకమాటలో చెప్పాలి. ఈ విషయం ఆదికవి హనుమచే "దృష్ట్వా సీతా!" సీతమ్మ చూడబడింది అన్నాడు, మన మహాకవికి ఆదికవి ఆత్మీయు, ఆదర్శ, అభ్యుద, ఆరాధ్య కవిగదా! అందువలన బ్రాహ్మణునిచే ఒక్కపద్యంతో సర్వము చెప్పించాడు.

"వచ్చెను సుదర్శనాయుధుడు" అని ముందుగా చెప్పక, అమ్మా! రుక్మిణీ! నీ గుణోన్నతి మెచ్చాడు, నాకా లెక్కలేనన్ని ధనరాశులనే యిచ్చాడు, లోకవాసులెల్ల అడ్డము వచ్చినా "రాక్షస వివాహం"తో నిన్ను గొనిపోవుట నిజం; యిక నీ సచ్చరిత్ర, భాగ్యము, సర్వమూ ఫలించాయమ్మా!" అని చెప్పాడు. ఇందులో "సుదర్శ నాయుధుడు" అనుట యెంతో ఔచిత్యాన్ని యినుమడింప చేస్తుంది.

బ్రాహ్మణోత్తముని జూచి రుక్మిణి—

"జలజాతేక్షణు దోడి తెచ్చితివి నా సందేశమున్ జెప్పి, వన్
నిలువం బెట్టితి, నీకృపన్ బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్ముకుల్
గలరే దీనికి నీకు ప్రత్యుపకృతిన్ గావింపగా నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ!"

యీ పద్యంలో అమృతం జాలువారు శబ్దం "అంజలి" అంతకన్న మిన్న యేమిగలదు?

సామాన్యంగా మాటలాడుకొను శబ్దాల్లో అపూర్వ రంజనయోగ చాతురీధురీణ కవితామృత సృష్టితో ఆంధ్రుల [illegible]

ఇక కుండినవగర వాసులు శ్రీకృష్ణుని రాక విని ఆతనిని చూచి

"తగు నీచక్రి విదర్భరాజ సుతకున్ దథ్యంబు, వైదర్భియుం దగు నీ చక్రికి, నింత మంచిదగు నే దాంపత్య, మీా యిద్దరిం దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా, దర్పాహతారాతియై మగడౌగావుత జక్రి యీా రమణికిన్ మాపుణ్యమూలంబునన్"

ప్రజలందరు జూచి యిప్పుడు బ్రహ్మదేవుడు నేర్పరి. యీా యిరువురకు కూర్చాడు అందువలన. అంతేకాదు "మా పుణ్య మూలంబునన్" మా అందరి పుణ్యాలన్నీ యిస్తున్నాం. "పదుగురాడు మాట పాటియై ధర జెల్లు" అన్నట్లు తప్పకుండా జరుగుతుందని వారంద రెంతో సంతో షించారు, అంతే కాదు మా=లక్ష్మి "శ్రీరూపా భూపుత్రీ" శ్రీ భూపుత్రీ, రుక్మిణి కృష్ణజన్మని" అన్ని పురాణం.

శ్రీ లక్ష్మిదేవి యగు రుక్మిణి పుణ్యంచేతనై ఆహా యిరువురకూ బ్రహ్మ దాంపత్యం కుదిర్చినాడని పౌరులందరూ ఎన్నో విధాల చెప్పకొనుట లాగు అపూర్వ దివ్య వాక్యా మృతం వర్షించింది.

రుక్మిణీ దేవి విగ్రహాలంకారముతో కన్యాంగనలూ, మంగళ వాద్యాలుతో దుర్గ గుడికి తీసుకొనివె ంది. అప్పుడు రుక్మిణీ దేవి—

"నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము, బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిచేయుమమ్మ! నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ యీశ్వరీ!"

అమ్మా! నీవు తప్పక శ్రీకృష్ణపరమాత్మను నా పతిగా కూర్చుము. నిన్నే నమ్మాను.

ఎక్కడా చెవికి కటువగు శబ్దము కాన్పింపక నియమ యుక్త భాగచాలనంతో రసము నూరించు యీ కవిత్వము మహాకవికి యెన్ని జన్మల పుణ్యఫలమో!

పార్వతీ పరమేశ్వరుల గేహము వెలువడి వచ్చిన ఆ రుక్మిణీదేవిని గూర్చి ఒక గద్యము వ్రాసిన మహాకవి ఋణము మనము తీర్చగలమా?

"అళినీలాలక పూర్ణచంద్రముఖ నేణాక్షిన్ బ్రవాళాధరన్
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభ కుంభస్తనిన్
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాత హస్తన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యగని విభ్రాంతాత్ములై రందరున్"

స్త్రీ వర్ణన మిందు మహాద్భుత కవితా నిర్మాణ చాతురీ ధురీణముగా ఔచిత్యంగా వర్ణించారు శ్రీపోతనగారు.

సమస్త రాజలోకమూ శ్రీ రుక్మిణీదేవి జగన్మోహనాకృతిలో బడి అనిమేషులైరి. ఆయుధాలను విడిచి నేలపై వ్రాలారు. రుక్మిణి కూడా ఆ రాజులందరనూ జూచి అంచలో—

"కనియెన్ రుక్మిణి చంద్రమండల ముఖుం గంఠీరవేంద్రావల
గ్న నవాంభోజదళాక్షు జారుతర వక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్రహస్తనిభ బాహుం జక్రి బీతాంబరున్
ఘుర భూషాన్వితు గంబుకంఠు విజయోత్కంఠున్
జగన్మోహనున్"

ఆహా! యేమి పురుష వర్ణన?

శ్రీకృష్ణుడు తన కొరకై నలుదిక్కులూ జూచుచున్న రుక్మిణీదేవిని యెత్తుకొని రథమున నుంచుకొని పోవుచుండెను. అప్పుడు రాజలోకంబంతా యెదుర్కొన వారితో వచ్చిన శిశుపాలుని గూడా శ్రీకృష్ణాదులు కొట్టగా

"మగిడి చలించి పారుచును మాగధ ముఖ్యులుగూడి
యొక్కచో
వగచుచు నాలి గోల్పడినవాని క్రియన్ గడు వెచ్చ నూర్పుచున్
మొగమున దప్పిదేర తమ ముందట బొక్కుచునున్న
చైద్యుతో
బగతుర చేతులంబడక ప్రాణము తోడుత నున్నవాడవే!"

ఆ సమయమున జరాసంధుడు శిశుపాలు జూచి "శిశుపాలా! పగవారి చేతుల్లో పడకుండా ప్రాణముతో నున్నావా?, ఎంత హేళన? ఎంత నిజం?

యిలాంటి పట్టుల్లో మహాకవి - కలము విశృంఖల విహారంతో వీరవిహారం చేస్తుంది. అంతేనా!

"బ్రతుకవచ్చు నొడల బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని భార్యగలదు
బ్రతికి తీవు భార్య బట్టు దైవ మెఱుంగు
వగవ వలదు చైద్య! వలదు వలదు"

అబ్బా! యివి మర్మస్థానములలో నాటిన సూటిపోటులా? లేక జరాసంధుని మాటలా? ప్రాణములున్న బ్రతుకవచ్చు, బ్రతికిన వానికి భార్యా వచ్చును, వగవ వలదు! యిచ్చట మూడు "వలదులు" ఉన్నాయి, నీ జీవితంలో యింక యేమీ వలదనా? లేక భార్యా వలదనా? యేమో!

యెంత వ్యంగ్య వైభవ స్ఫూర్తితో మూర్తిని కట్టించాడు మహాకవి. అలతి అలతి పదాలతో అందరినీ అలరించే నేర్పు అద్భుతావహమే!

ఏట్లకేలకు జరాసంధుడు శిశుపాలుని ఊరడించి వెనుకకు మళ్ళించాడు. కాని రుక్మిణీదేవి పెద్దన్న రుక్మి కోపోద్రేకుడై రథముపై నేగు శ్రీకృష్ణ పరమాత్మను జూచి నిందా వాక్యములవేకము లాడి

"మా సరి కాడవా? మ్రా పాప గొల్లవై
నే పాటి గలవాడ వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడ బెరిగితి?
వెయ్యది నడవడి? యెవ్వ డెఱుగు?

మానహీనుఁడ వీవు, మర్యాద లెఱుగవు,
మాయ గైకొని కాని మలయరావు
నిజరూపమున శత్రు నివహంబుపై పోవు
వసుధేశుడవు గావు వావిలేదు,
కొమ్మనిమ్ము, నీవు గుణరహితుండవు
విడువు, విడువవేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల
గర్వమెల్ల గొందు కలహమందు."

ఈ పద్య మొక అద్భుతాద్భుత వ్యంగ్య వైభవ మర్యాదాపూర్వక సృష్టి. దానిని తెలిసికొందము.

సమస్త రాజలోకమూ, అందులో మహాబలవంతుడైన జరాసంధుకు యిరువది మూడు అక్షౌహిణుల సేనా సముద్రంతో శ్రీకృష్ణపరమాత్మనిపై పదునెనిమిది మారులు దాడిచేసిన వీరుడే గాక మహావీరు లెందరో, రాజు లెందరో ఉన్నారు.

శ్రీకృష్ణపరమాత్మ రుక్మిణీదేవిని తీసుకొని పోవుచుండగా అందరూ యెదిరించి ఆతనిచే దెబ్బలు దిని తిరిగివచ్చినా! కడకు రుక్మి మాత్రం విడువకుండా యెన్నో అనరాని మాటలాడి తుదకు దిక్కుతోచక యిలా అన్నాడు.

"ఓయీ! నీవు మా సరివాడవు కావు, నీవేపాటి కలవాడవు? నీ వంశమా? గొల్లకులము, యెచ్చట పుట్టావు?

యెచ్చట పెరిగావు? నీ నడవడి యేది? నీసీ యెవరైనా యెరుగునా? మానహీనుడవు, మర్యాదే తెలీదు, మాయతో గాని రావు, ధైర్యంతో శత్రువులను యెదిరించవు, రాజువా? కావు, వావీ వరుస లేదు. అందువలన మా సోదరి రుక్మిణిని విడిచిపెట్టు, అసలు గుణముందా నీకు? నీవు విడువవా? వాడియైన బాణాలతో యిప్పుడే నీగర్వం యుద్ధంలో నీరుచేస్తాను, ఇవి రుక్మి మహాకోపంతో పలికిన పలుకులు.

యింకొక కవి యిలా వ్రాయడు. యింత చప్పని పద్యాలతో వ్రాస్తాడా? భావము లేకపోయినా శబ్దాడంబరముతో ధమధమలాడిస్తాడు. మహాకవి యెప్పుడూ అలా చేయడు. అర్థగాంభీర్యముతో, శబ్దార్థ వ్యంగ్యవైభవముతో అతి తేలిక మాటలతో అనల్ప శిల్పార్థ మాచితీ యోగముతో సంయనత్వము బాటించి రసామృత సృష్టిని కురిపించి భక్తుల పాఠకుల జ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞాచక్షువులను తెరిపించే విధంగా వ్రాసి వారి మనఃఫలకలపై శాశ్వతంగా ప్రతిష్ఠవేస్తాడు. అదే జరిగిందీ పద్యంలో వినండి.

యాబది సంవత్సరాలు ఒక యింటిలో దీపము లేకపోయినా చిన్న దివ్వె వెలిగిస్తే యిన్ని సంవత్సరాలుగా నిలయు విద్వాంసునిలాగ తిష్ఠవేసిన ఆ గాఢాంధకారం పటాపంచలై యెక్కడకు పారిపోతుందో యెవరికీ తెలీదు.

అలాగే వంద సంవత్సరాలు మూర్ఖునిగా బ్రతికినవాని యేపూర్వ పుణ్యమో వచ్చి తొలకరి మెఱుపులాగ వానికి

భగవద్దర్శన భాగ్యం లభించిందా? వాడిలో అంతకుముందన్ని సంవత్సరాల నిలువగా ఉన్న అజ్ఞానాంధకార మంతరించి సుజ్ఞాన జ్యోతి వెలిగి వెలుగులో ప్రవేశించ గలుగుతాడు. అలాగే జరిగింది. రుక్మిణీదేవి పెద్దన్న రుక్మికి.

జరాసంధాది శ్రీకృష్ణపరమాత్మ యొక్క వైరి వీర రాజులతో కూడి శ్రీకృష్ణునిపై కత్తికట్టి తన చెల్లెలిని యెంద రెన్నివిధాల చెప్పినా ససేమిరా శిశుపాలునకే యిస్తానని పంతం పట్టాడు అటువంటప్పుడు యిందర రాజులోకాన్ని గెల్చి తన సోదరిని తీసుకొని పోవుచున్న శ్రీకృష్ణునిపై యెంత కసి క్రోధము ఉంటుందో వేరుగ చెప్పవలెనా? ఆ రోషంతో రుక్మి వచ్చి శ్రీకృష్ణుని అన్న మాటలా? పోటులా?

పద్య మెత్తుగడ యీ మహాకవిని చెప్పి, యెవరికైనా చెప్పాలి. మైనము ముద్దను ఒక మహాశిల్పి తన యిష్టాను సారంగా యెలా మలచగలడో యీ మహాకవితా శిల్పి పోతన అక్షరాల నప్సరసల వలె ఆడించి పాడించ గలడు.

"మ్రా సరివాడవా? మ్రా పాప గొనిపోవ" అన్నాడు క్రోధావేశ పూరితుడైన రుక్మి నిజముగా శ్రీకృష్ణపరమాత్మను తిట్టాడు. కాని రుక్మి యొక్క యెన్నో జన్మలపుణ్యము వలన ఆ సమయమున పరమాత్మ సాక్షాత్కారము కలిగింది. అందువలన రుక్మి నోటి వెంబడి వచ్చిన ప్రతి పలుకూ తొలి పలుకై (వేదము) స్తోత్ర రూపంగా మారింది; యిదంతా

మహాకవి సృష్టి. "మా" అనగా లక్ష్మి. హే ప్రభూ నీవు లక్ష్మితో సమానుడవా? కావు అతీతుడవు. అటువంటప్పుడు ఆ మా పాపనెందుకు కొనిపోవుచున్నావు?

యేపాటి కలవాడవు? అంతా కలవాడవు నీవే. యేది వంశము? నీకు వంశమా? జన్మములేని వానికి వంశ మేముంటుంది? వేరొక అర్థం - "వంశము" వేణువు; హే పరంధామా! నీ వేణునాదామృతానికి సర్వలోకాలూ మైమరచాయంటారే, మహర్షులు, అటువంటి వేణువు - వంశమేదీ?

ఎందు జన్మించితివి? చావు పుట్టుకలు లేని పరబ్రహ్మమునకు జన్మ యెందుకు? యెక్కడ పెరిగితివి? "పెరుగుట విరుగుట కొరకే" "పెరుగుట, విరుగుట, తరుగుట" యివి మాబోంట్లకేగాని నీకెక్కడివి? "ఎయ్యది నడవడి యెవ్వ డెరుగు?" నీ నడవడి వేదాలే పలుకలేక మౌనము వహించాయి గదా? "మాన హీనుడ వీవు" మనిషిగా పుడితే మానముండును. "మర్యాద లెరుగవు" నీకు మర్యాదా? సమస్తమును బొజ్జలో నుంచుకొన్న నీవు మర్యాదలే యెరుగవా? "మాయ గైకొని కాని మలయ రావు" నీయందున్న యోగమాయయే ముందుగా వచ్చి మాధుర్యమైన మాయందు ప్రవేశిస్తుంది, "మలయ" లయలేక మేమందమూ నీయందే లయమగుచున్నాము

"ని రూపమున శత్రు నివహంబుపై బోవు" నిజరూపమా - రూపా లున్నాయా? నీకు శత్రు లెవరు?

మిత్రు లెవరు? అందరూ నీలోనివారే! తండ్రికి ఒక కుమారుడు శత్రువు, మరొకడు మిత్రుడుండునా? వారి వారి కర్మల పరిభావముల వలన వారి వారికి శత్రుత్వ, మిత్రత్వములు దోచు నంతే!

"వసుధేశుడవు గావు, వాని లేదు" నీవు పదునాల్గు భువనాలనూ పుట్టగా, పెరుగగా, గిట్టగా చేయువాడవగు నీకు యీ యెల్లలు గల రాజ్యముండునా? వాపీ వరుసలు మేము కూర్చుకున్నవిగాని, నీకున్నవా?

"కొమ్మ నిమ్ము" మా సోదరి సామాన్యురాలు, నీవో సమస్తము నిండియుండువాడవు అగుటచే నీతో కాపుర మెలా చేయగలదు? "గుణ రహితుండవు" త్రిగుణములు మాకు గాని నీకున్నవా? అందువలన మా రుక్మిణిని విడిచిపెట్టు ప్రభూ! నీపై బాణపరంపరలు గురియింపనా? యెంత తెలివి లేని వాడిని?

ఇది మహాకవి యెచ్చటనుండి తెచ్చాడు. తన పరమ గురువు ఆది కవినుండి కొని తెచ్చాడు.

"రామ" అనలేక "మరా - మరా" అనినవాడు రామనామ దివ్య పరిభావముతో "శ్రీమద్రామాయణము" వ్రాసి అందులో గల యిరువది నాలుగువేల శ్లోకములలో గల ప్రత్యక్షరం తారక మహామంత్రంగా పరిణమించలేదా?

ఆ ఆది కావ్యమును "తారకనామ" మంత్రోపాసన చేసి సిద్ధి పొందిన మన మహాకవి "శ్రీ భాగవత పురాణము"

లోగల ప్రతి పద్యంలో యీ పద్యం కన్నా మిన్నయైన అర్థం యిమిడియే ఉంది. అది మన జ్ఞానమును బట్టి - మన సంస్కారాన్ని బట్టి అందుగల మహోనర్ఘరత్నాలు గోచరిస్తాయి. నేను సామాన్యుడను, శ్రీహనుమత్ స్వామి యిచ్చిన జ్ఞానముతో వ్రాయుచున్నా నంతే, అందువలన యిందు యింతే అర్థమున్న దనుకో వద్దని మనవి.

"చంపెడి దోషము గలిగిన
జంప జనదు బంధుజనుల, జను విడువంగా,
జంపిన దోష సిద్ధము,
జంపను మరి యేల? మున్న చచ్చిన వానిన్"

ఈ చిన్న పద్యమందు యెంత గంభీరభావమూ, అలతి పదాల్లో యిమిడ్చాడు మహాకవి. అందుకే శ్రీమద్భాగవతమును బోలిన మహాగ్రంథ మీ పృథ్విలోనే లేదన్నారు.

బలరాముడు రుక్మిణీదేవి నోదార్చుచూ

"అజ్ఞానజ మగు శోకము
విజ్ఞాన విలోక మున విడువుము, నీకుం
బజ్ఞావతికిం దగునే
యజ్ఞానుల భంగి వగవ, నంభోజముఖీ!"

యేపాత్రచే యేమి రూపంలో చెప్పించాలో మహాకవికే తెలియును. యేరూపములోనైనా ఆధ్యాత్మికమైన ఒక మహాతత్త్వాన్నే బోధ చేస్తాడు. అవకాశం కొరకు

యెదురు చూసి దొరికిందా! యింకేముంది అచ్చట హృదయా లను పట్టుకొనట్టు అతి మృదు భాషాభావాన్ని అలంకార యుతంగా చెప్పుతాడు.

ఇచ్చట శోకము అజ్ఞానముచేతనే పుడుతుం దని చెప్పి మరల రుక్మిణి ప్రజ్ఞావతి ఔటచేత యేడుపు మానాలి. యిలా చెప్పుతాడు పోతన.

రుక్మిణిని శ్రీకృష్ణపరమాత్మ వివాహము చేసికొన్నా డని తన సహజమైన అంత్యానుప్రాసతో యెలా చెప్పాడో చూడండి.

"ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతోహారిణిన్ మానవై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణి బుణ్యచారిణి మహాదారిద్ర్య సంహారిణిన్
సు విభూషాంబరధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్"

యిందు మహాకవి అంత్యానుప్రాస అడ్డులేక కదం త్రొక్కుతూ పదం పాడుతుంది. "రుక్మిణి" అను శబ్దం మీాద ప్రయోగించే శబ్దాలు.

ప్రారంభము అమోఘము. "ధ్రువకీర్తిన్" రుక్మిణీదేవి శ్రీకృష్ణపరమాత్మకు ధ్రువమండలమంత సత్కీర్తి నిచ్చునని అతని మనస్సు యెప్పుడో హరించింది; అప్రతిమాన "మాన - వైభవ - గాంభీర్య" మున నిరంతరం విహరించిన దా ని, రుక్మిణీదేవి యెంత మాన వైభవ గాంభీర్యము లే న్న

కొన్ని వందల మైళ్ళలో సముద్ర మధ్య నున్న ద్వారకానగ రానికి యెవరికీ తెయకుండా సందేశాన్ని పంపించింది. యెంత గుండె నిబ్బరం ? ఆత్మ విశ్వాసం ?

సర్వసంపలూ యిచ్చినదానిని, సాధుభావములు గల వారిని సత్కరించే దానిని, పుణ్యములలోనే చరించినదానిని, సమస్త సంపత్కారిణిని, దారిద్ర్య విచ్ఛేదిని, రుక్మిణీదేవి శ్రీదేవిగా ధ్వనింపచేశాడు. "రుక్మిణి" అను శబ్దముపై యిన్ని అంత్యాను ప్రాసలు మహాకవికే చెల్లును.

ఈ విధంగా పరమ పావనమైన రుక్మిణీ కల్యాణానికి శ్రీ పోతన ముగింపు ముక్తాయింపు చేశాడు.

భారత, భాగవత, రామాయణాలు అంతరార్థము తోనే ఆనాటి నుండి యీనాటి వరకు అందరిచేత ఆరాధింప బడి వారి వారి ఆత్మలలో అలరారుచున్నవి.

ఇక దీని అంతరార్థమును సంక్షిప్తంగా తిలకిద్దాం.

భీష్మకుడు = పట్టుదల గలవాడు; సాధన పరుడు యజ్ఞ యాగాలు ప్రయత్నాల్లో నుండడం. శిశుపాలుడు = యేమీ తెయని అజ్ఞాని. రుక్మిణీ - కృష్ణులు=జీవతత్త్వము- పరమాత్మ తత్త్వములో చేరడానికి చేసే ప్రయత్నము; బ్రాహ్మణుని త రుక్మిణీదేవి శ్రీకృష్ణునికి సందేశాన్ని పంపింది. "బ్రహ్మాన యతి ఇతి బ్రాహ్మణః" బ్రహ్మజ్ఞాన మును పొందిన విజ్ఞానమే బ్రాహ్మణుడు.

జీవతత్త్వము బ్రహ్మజ్ఞానముతో నిర్వృతి తత్త్వమైన పరబ్రహ్మ దివ్యస్వరూపమును, తనను ప్రకృతి యొక్క మాయ, అజ్ఞానవశం గాకుండా కాపాడుమని చేయు నిరంతర జ్ఞానసాధనమే రుక్మిణీదేవి బ్రాహ్మణునిచేత కృష్ణునికి సందేశము పంపుటలో గల అంతరార్థము.

శిశుపాల జరాసంధ దంతవక్త్రాదులు ఇది సమయం కాదని తిరిగి పోవుట నిర్వృతి తత్త్వము తమతో సరిపడడానికి యింకా బాగా సాధనలు సేయవలసి వుందని, సాధకునిలోని ప్రకృతి ననుసరించి యున్న అహంకారాదులు నిర్వృతిలో చేరలేక పోయారని అర్థము.

కృష్ణపరమాత్మ రుక్మికి తలగొరిగి విరూపం చేసినాడనగా నిర్వృతి తత్త్వము జీవుని తనలో ఐక్యము చేసికొనుటకు ముందు జీవుని అజ్ఞానము వైపునకు లాగే ప్రకృతి యొక్క ఆకారముని విరూపము చేసిందన్న మాట. జీవుడు బ్రహ్మజ్ఞాన సంపత్తితో పరమాత్మను నిరంతరమూ ధ్యానించుటచేత నిర్వృతి పరబ్రహ్మైక్యమును పొందుతాడు.

## 10 వ స్తబకం

సత్రాజిత్తనువాడు సూర్యోపాసకు డగుట అతనిని మెచ్చి భాస్కరుడు "స్యమంతకమణి" నిచ్చాడు. దానిని కంఠాన దాల్చి ఆతడు శ్రీకృష్ణుని దర్శింప వేగాడు, శ్రీకృష్ణుడు దానిని అడిగాడు, సత్రాజిత్తు నిరాకరించాడు.

సత్రాజిత్తు తమ్ముడు ప్రసేను డామణిని కంఠాన ధరించి అరణ్యానికి వెళ్ళగా అక్కడాతనిని చంపి జాంబవంతు డామణిని తీసుకొనిపోగా, శ్రీకృష్ణుడే నా తమ్ముని చంపి స్యమంతకమణి నపహరించా డని అపనింద మోపాడు సత్రాజిత్తు.

యీ విషయం మహాకవి కవితా శిల్పంలో

"మణి కంఠంబున దాల్చి నే డడవిలో మావాడు వర్తింపగా
మణికై పట్టి వధించినాడు హరికిన్ మర్యాద లేదంచు దూ
షణముం జేయగ వాని దూషణము గంసధ్వంసి యాలించి యే
వ్రణమున్ నా యెడ లేదు నింద గలిగెన్ వారించు టేరీతియో"

శబ్దాల పోహణింపుకు జోహారులర్పించాలి శ్రీ పోతనకు.

మహాబలుడు జాంబవంతుడు శ్రీకృష్ణపరమాత్మతో యిరువది యెనిమిది దినాలు యుద్ధం చేశాడు.

"అడిదములు దరులు విరిగిన
బెడిదములగు మగతనముల బిఱుతివక వడిన్
బిడుగుల వడుపున బడి యెడి
పిడికిటి పోటులను గలన బెరసి రిపురున్"

పోతన మహాకవికి లాటానుప్రాస యెంత యిష్టమో అదీకాక —ద్వర్ణనలోనే యిలా వ్రాయుట బాగా అల వాటు. "...దిగుచు మకరి" అని గజేంద్రమోక్షంలోనూ,

"అడిగెద నని కడువడి జను" అనియు "డ" కారా వృత్తు లతో వ్రాయుట బాగా అభ్యాస విద్య.

జాంబవంతుడు శ్రీకృష్ణుడే రాముడని

"బాణాగ్ని నెవ్వడు వరపి పయోరాశి
నింకించి బంధించి యేపుమాపె!
బరగ నెవ్వడు ప్రతాప ప్రభారాశిచే
దానవ గర్వాంధ తమస మణచె
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వడు
దశకంఠు కంఠ బృందములు ద్రుంచె
నాచంద్ర సూర్యమై యమరు లంకారాజ్య
మునకు నెవ్వడు విభీషణుని నిలిపె
నన్ను నేలిన లోకాధి నాథు డెవ్వ
డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వ
డాతడవు నీవ కావె మహాత్మ! నేడు
మారు పడి యెగ్గుజేసితి మరువ వలయు"

ఇది సంక్షిప్త రామాయణము. శ్రీరామచంద్రుని యెంత భక్తిభావ గరిమా పరివశ్యతో పోతన మహాకవి నుతించాడో! తాను శ్రీరామోపాసకుడే అగుట యిచట "నన్ను నేలిన లోకాధినాథు డెవ్వడు?" అను పద ప్రయోజ నము యెంత గొప్ప ఔచితీ మర్యాదా సనాథముగా ఉన్నదో? చెప్పలేము. యిటువంటి సందర్భమున మహాకవి గంటము కదం త్రొక్కుతుంది.

జాంబవంతుడు శ్రీకృష్ణుని మెచ్చి స్యమంతకమణితో తన కుమారీమణి జాంబవతిని అతనికి సమర్పించాడు.

విషయం తెలిసిన సత్రాజిత్తు పశ్చాత్తాపముతో కృష్ణుని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు సత్రాజిత్తుకు స్యమంతక మణి నీయ నాతడు కూడా తన కుమార్తె సత్యభామతో ఆ మణిని శ్రీకృష్ణునకు దత్తం చేశాడు. యీ పద్యం వినండి.

శ్రీకృష్ణ పరమాత్మ—

"మణి యిచ్చినాడు వాసర
మణి నీకును మాకు గలవు, మణులు, కుమారీ
మణి చాలు నంచు గృష్ణుడు
మణి సత్రాజిత్తునకును మరలగ నిచ్చెన్"

యీలాంటి సమయము యేకవిద్యైన వినచో ఎంత వాగాడంబరము చూపిస్తాడు. పోతన మహాకవి చిన్న కంద మున అందాన్ని చిందించి యెన్ని మణు లిచ్చాడో! పద్య ములో నాలుగు పాదాల్లో వరుసగా "మణి - మణి" అని "మణి" శబ్ద ప్రయోగము అద్భుతావహం.

సాత కీ మొదలగు వారితో శ్రీకృష్ణపరమాత్మ యింద్రప్ర పురానికి పాండవుల జాడ నేగేడు.

"చంచద్ఘనకుచ భారా
కుంచితయై క్రొత్త పెండ్లికూతు రగుట నిం
చించుక సిగ్గు జనింపగ
పాంచాల తనూజ మ్రొక్కె బద్మాక్షునకున్"

ఇచ్చ మహాకవి క్రొత్త పెండ్లికూతు రెలా గుండాలో చెప్పాడు. యింకింటుక సిగ్గు స్త్రీకి తప్పకుండా ఉండాలని, మరీ బరితెగించి పరాయి మగవాడితో సిగ్గులేకుండా వీధినిబడి తిరగరాదని మనందరకూ చెప్పాడు.

స్త్రీ వినయ విధేయతలతో అణుమాత్రము సిగ్గుతో పెర మగవారల దగ్గర సంచరించాలని అర్థము.

"అత్తా! కొడుకులు, కోడలు
చిత్తానందముగ బనులు సేయగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా
సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్"

ద్రౌపది మొక్కింది, ముందుగా పాండవులూ నమస్కరించారు శ్రీకృష్ణ పరమాత్మకు. ఆతడు కుంతీదేవికి నమస్కరించి అన్న మాటలు. ఇచ్చట కూడా మహాకవి చిన్న కందంలో "అత్తా! అని నీ కొడుకులు, క్రొత్త కోడలూ నీ చిత్తానందముగా పనులు చేస్తున్నారా?" అన్నాడు.

పోతన మహాకవి తన కావ్యములో యెందరిని యెన్ని కుటుంబాలను అత్తా కోడళ్ళ తగవులు సూచియే ఉంటాడు. సామాన్యంగా యింటికి కోడలు వచ్చిన తరువాత కొడుకూ మారిపోతాడు; అది వాడి తప్పుకాదు, సృష్టిలోనే అరహస్య ముంది అందువలన మరెవ్వరినీ అనవలసిన పని ఉండదు.

అందుకే "కొడుకులూ, కోడలు చెప్పినట్లు వింటున్నారా?" అని అనవలసి వచ్చింది.

దీనిలో మహాకవి కవితాత్మనే మనము చూడాలి.

వరుసగా శ్రీకృష్ణపరమాత్మ "కాళింది - మిత్రవింద - నాగ్నజితి - భద్ర - లక్షణ" అను కాంతలను వివాహ మాడెను.

"సౌవర్ణ కంకణ ఝుణ ఝుణ నినదంబు
శింజినీ రవముతో జెలిమి జేయ,
దాటంక మణిగణ ధగ ధగ దీప్తులు
గండ మండలరుచుల్ గప్పికొనగ,
ధవళ తరాంప ధళ ధళ రోచులు
బాణ జాల ప్రభాపటలి నణప,
శరపాత ఘుమ ఘుమ శబ్దంబు పరపంథి
సైనిక కలకల స్వనము లుడుప,
వీర శృంగార భయ రౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనగ
నిషువు దొడుగుట, విడుచుట యేయుటెల్ల
నెరుగ రాకుండ నని సేసె నిందువదన"

సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుట మహాకవి మృదు మధుర పదాలు సుధలు గ్రుక్కుతూ పఠితలను పరవశులను చేయలేదా?

యుద్ధాన్ని వర్ణించు ఘట్టము ఇటువంటి సమయములో ఎంత ఝుటితిస్ఫూర్తితో శబ్దాడంబరతతో వ్రాయాలి. ఇచ్చట "ఝుణఝుణ - ధగధగ - ధళధళ-ఘుమఘుమ"లు నాలుగు సీసపద్య పాదాల్లో ఝుణఝుణలాడి, ధగధగలాడి, ధళధళమని ఘుమఘుమలాడి అపూర్వ కవితాసౌందర్యాన్ని నింపుచున్నాయో చూడండి. ఇందులో వీర - శృంగార - భయ - రౌద్ర - విస్మయాలున్నట్టు మహాకవే చెప్పాడు.

ఆ యుద్ధరంగాన సత్యభామ స్థితి.

"పరుజూచున్ వరుజూచు, నొంప-నలరింపన్, రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు, శృంగారమున్
జరగన్ గన్నుల గెంపుసొంపు బరగన్ జండాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెరపుచున్ చంద్రాస్య హేలాగతిన్"

ఈతనికి ముందువాడు నాచన సోమన మహాకవి "ఉత్తర హరివంశము"లో ఇదే ఘట్టమున ఇటువంటి పద్యమే వ్రాశాడు.

సత్యభామ ఒకసారి పరుడైన నరకాసురుని చూచేది వాడిని ఎలా చంపాలో, తన వరుడైన శ్రీకృష్ణపరమాత్మను చూచేది అలరింపు సొంపులతో, నరకాసురునిపై రోషం, వరునిపై రాగోదయ దక్కులతో, నరకాసురుని క్రోధ వికటాట్టహాస భ్రుకుటితో, మధుర మృదు మందహాసాలతో

శ్రీకృష్ణునివైపు; ఒకవైపు వీరమూ యింకొక వైపు శృంగారమూ చూపుతూ తూపులేసేది.

అందముగా చెప్పడములో యీాయనదే పై చేయి. సత్యభామ నేత్ర సోయగము వివరింపరానిది, అరుణారుణ నేత్రాలు, శ్రీకృష్ణునివైపు సొంపు, యిచ్చట చెప్పడములో అందం కెంపు - సొంపు, నరకాసురునిపై ప్రచండాస్త్రాలు, తన పతిపై మన్మధ తూపులవంటి చూపులు నింపేది సత్యభామ.

యింత సొంపు పెంపు లలరింపు కవితా నిర్మాణము పోతన మహాకవికే దక్కింది. యింకొక పద్యం.

"రాకేందు బింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు!
కందర్ప హేతువై ఘన ధూమకేతువై
యలరు బూబోణి చేలాంచలంబు,
భావజు పరిధియై ప్రళయార్క పరిధియై
మెరయు నాకృష్ణమై మెలత చాప,
మమృత ప్రవాహమై యనల సందోహమై
తనరారు నింతి సందర్శనంబు,
హర్ష దాయియై మహా రోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి,
[illegible] నరికి జూడ నొదవు శృంగార
వీర [illegible]ము లోలి [illegible]గ రిల్ల."

దీనిలో గల పదాల అలరింపు, సొంపూ యింపునింపుట అలా ఉంచి వాటిని కూర్చు నేర్పు అద్భుతాలు. ఈ పద్యాలను బాగా అర్థంచేసికొంటే సత్యభామామణి దివ్యస్వరూపం మన కన్నుల యెదుట నర్తిస్తుంది; ఎలా? శ్రీకృష్ణపరమాత్మ ఒక వైపు, నరకాసురుడు యింకొకవైపు వుండగా మధ్యలో నిలచిన సత్య ఆపాదమస్తకమూ శృంగారమూర్తి స్ఫూర్తిజూపి హరికే; వీర శూరమూర్తి స్ఫూర్తితో అరికీ జూపుతూ ఉన్నట్లుగా మహాకవి చిత్రీణ జరిగింది. దీనిని వర్ణించడానికి యెవరికి సాధ్యం?

నరకుడు చెఱగొన్న పదారువేల కన్నియలు

"కని రాజకుమారికల్ పరిమళ త్కౌతూహలా క్రాంతలై
దనుజాధీశ చమూ విదారు నతమందారున్ శుభాకారు నూ
తన శృంగారు వికారదూరు సుగుణాధారున్ మృగీలోచనా
జన చేతోధనహారు రత్న మకుటస్ఫారున్ మనోహారునిన్"

నరకుడు చచ్చింతరువాత శ్రీకృష్ణపరమాత్మ వీరందరినీ చెరవిడిపింపగా వారందరూ శ్రీహరిని వరించారు. ఆ స్త్రీలందరూ మన్మథ తూపులులాంటి చూపులుతో శ్రీకృష్ణుని చూచారో యిందు వర్ణితము.

హరి సాక్షాత్కారమే మన కిందు ద్యోతకమౌతుంది. పోతన కవితా కల్పవల్లి నేగినదారు లెన్ని ఉన్నాయో ఆ దారులన్నీ యిందున్నాయి. "చమూ విదారు - నత

మందారు - శుభాకారు - నూతన శృంగారు - వికారదూరు-సుగుణాకారు - మృగలోచనా జన చేతోధన హారు - రత్న మకుట స్ఫారు - మనోహారు.

"తొమ్మిది దారులు పోతన మహాకవికి పూర్ణ సంఖ్య తొమ్మిదిపై చాలా యిష్టం. అందుకే తొమ్మిది హారులు దారులుగా చేకూర్చాడు.

మొత్తంమీద మహాకవికి మత్తేభ విక్రీడిత మన్న చాలా మోజు, కందాలన్నా హృదయానందమే. ఆతనికి, అందులో వర్ణనలలో మత్తేభాన్ని పంపుతాడు. ఒక నీతిని చెప్పినప్పుడు అందంగా కందాన్నందిస్తాడు.

సీసపద్యానికి యెత్తు ఆటవెలదే యితన్ని అలరిస్తుంది. అందుకే "భోగినీ దండకమునాడె పోతరాజు" అన్నారు శ్రీ వెంకటరామకృష్ణ కవులు. యీతని పరోక్ష శిష్యుడే వేమన మహాకవిగా మనం భావించాలి.

"వినా్నరమె యీ చెలువము
కన్నారమె యిట్టి శౌర్య గాంభీర్యంబుల్
మన్నారమింత కాలము
గొన్నారమె యెన్నడైన గూరిమి చిక్కన్"

రాకన్నెల భావాన్ని వెన్ని వన్నెలు చిన్నెలతో ... ల పంటగా చెప్పించాడు. సీస పద్యాల ఒడుపూ అందు చెప్పడంలో గల సొగసూ శ్రీ చిలకమర్తివారు గయో

పాఖ్యానములో యీతని దగ్గరే పట్టుకొన్నారు. అంత్యాను ప్రాసలు ముఖ్యంగా వీరి తరువాత కవులు మాత్రం వీరి శిష్యరికంతో నేర్చికొన్నవే! అయినా యేకవి అంత్యాను ప్రాస వ్రాసినా పోతన మహాకవికి అందగించినట్లు వారికి చందగించదు.

"వారి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపై బెట్టి సుం
దర గంధానుగత భ్రమద్ భ్రమరనాద వ్రాతముం బల్లవాం
కుర శాఖా ఫల పర్ణ పుష్పకలికా గుచ్ఛాధికోపేతమున్
గిరిభిత్త్రాతము బారిజాతము ద్రిలోకీ యాచకాఖ్యాతమున్."

యిక్కడ కూడా మహాకవి మత్తేభాన్నే చిత్తానికి హత్తేలాగున మనకిచ్చాడు.

"అమిత విహారు డీశ్వరు, డనంతుడు దా నొకనాడు మంచి ల
గ్నమున పదారువేల భవనంబులలోన బదారువేల రూ
పముల బదారువేల నృపబాలల బ్రీతి బదారువేల చం
దముల విభూతినొందుచు యథావిధితో వరియించె భూవరా!"

మహాకవి యీశ్వరుడు, అనంతుడు శబ్దాలు ముందుగా ప్రయోగించి పదారువేలమంది రాజకన్యకలనూ పదారువేల రూపాలుగా వారి నందరనూ అన్ని విధాలా సంతృప్తిపర చాడు. ఇక్కడ "విభూతి" శబ్దం యెంచక్కా అమరింది. "విభూతి ర్భూతి రైశ్వర్యా" అని ఉండుట వలన సమస్త ఐశ్వర్యాలూ వారికి సమకూర్చాడని చెప్పాడు.

మహాకవికి శబ్దనాడి బాగా తెలియును. ఏ శబ్దం యెచ్చట యెలా ప్రయోగిస్తే యెంతెంత గొప్పర్థం యిస్తుందో ఆంధ్ర కవులలో యీయనకు తెలిసినట్లు యింకొక కవికి తెలీదనుట సాహసం కాదు.

"దానములందు సమ్మద విధానములం దవలోక భాషణా
హ్వానములందు నొక్క క్రియ నా లలితాంగుల కన్ని రూపులై
తా ననిశంబు గానబడి తక్కువ యెక్కువ లేక యుత్తమ
జ్ఞాన గృహస్థధర్మమున జక్రి రమించె ప్రపూర్ణ కాముడై"

పోతన మహాకవి "ప్రపూర్ణ కాముడై" అను శబ్దము యిచ్చట యెంత అర్థస్ఫూర్తిగా ఉంచాడో! అలాగే అందరకూ యెక్కువ తక్కువలు లేక ఉత్తమ గృహస్థ జ్ఞానముతో రమించా డనుటలో కూడా గొప్ప అర్థాంతరము ధ్వనిస్తుంది. నిజముగా ఆంధ్రులనోము పంటయే శ్రీ పోతన మహాకవి యని చెప్పవచ్చును.

"ఎన్నో భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు
లీక్షింపుచున్
మున్నే దేవుని జూడగానక తుదిన్ తుదిన్ మోహింతు
రామేటి కే
విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర
చ్చిన్నాలోకన హాస భాషణ రతి శ్లేషానురాగంబులన్"

యీపద్య భావం యెంతని వివరింప గలం? బ్రహ్మేంద్రాదులు గూడా యోగమార్గములలో యెన్నో రీతుల పట్టుకోవాలని ప్రయత్నించినా దొరకలేదట! అటువంటప్పుడు యేమీ చేయలేక ఆ పరమాత్మను మోహించారంతే!

యిక యీ పదారువేల రాజకాంతలలో విడిపోని చూపులతో, హాస్య వాక్యాలతో, మృదుమధుర భాషణలతో శ్లేషారూఢమై అనుబంధంతో ఆయనతో నిరంతరం కూడి ఉన్నారో! యెవరు చెప్పగలరు?" అన్నాడు మహాకవి. ఆయనే యిలా చెప్పగలిగాడు గదా? యింకెవరు చెప్ప గలరు.

ఆ కాంతలాత్మ తృప్తిని మహాకవి—

"నన్నే పాయడు తాత్రుతుం దివములన్, నన్నే
కృపం జెందెడిన్
నన్నే దొడ్డగజూచు వల్లభలలో, నాథుండు నాయింటనే
యున్నాడంచు బదారువేలు దమలో నూహించి సేవించి రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తి
యోగంబునన్"

ఇవి వారి ఆత్మతృప్తిని పట్టి చూపిన మహాకవి వాక్యాలు. యిందరూ గాఢమైన పతివ్రతాత్మ పరిచర్యలతో భక్తియోగాన శ్రీకృష్ణపరమాత్మను సేవిస్తూ హృదయాలాతని కప్పగించి యుండుట వల్ల అందరకన్ని రూపాల్లో

ఉన్నాడన్నది ఒక మహాభక్త తత్వవేత్తయగు మహాకవియే అనగలడు.

ఒకనాడు మందహాసంతో రుక్మిణీదేవిని జూచి—

"లోకుల నడవడి లోనివారము గాము,
పరులకు మా జాడ బయలు పడదు
బల మదోపేతులు పగగొండ్రు మాతోడ,
రాజ పీఠములకు రాము తరచు
శరణంబు మాకు నీ జలరాశి సతతంబు
నిష్కించనుల మేము నిధులు లేవు
కలవారు చుట్టాలు కారు, నిష్కించన
జన బంధులము ముక్త సంగ్రహులము
గూఢ వర్తనులము గుణహీనులము భిక్షు
లైనవారి గాని యాశ్రయింప,
మింపు ముఖులు దగుల రిటువంటి మముబోటి
వారినేల తగుల వారిజాక్షి!"

కేవల కైవల్యపదంబు కోరి సర్వమూ హరికి సమర్పించి యున్నవాడగు మహాకవి యీ పద్యంలో గల ఒక్క పదమైనా వ్రాయగలడా? "పలికించెడివాడు రామభద్రుడే" అన్న నిజము [illegible]

తాను కన్న విధాన తగినవాడు లభించాడని పరమానంద సాగర [illegible] లో పరవశించే రుక్మిణీ మహాదేవికి యీ పద్యం

అశనిపాతములాగ మహాకవి శ్రీకృష్ణపరమాత్మచేత చెప్పించాడు. రుక్మిణీదేవి సొమ్మసిల్లి పోయింది. యింకా యిలా అన్నాడు:—

'సిరియును వంశము రూపును
సరియైన వివాహ సఖ్య సంబంధంబుల్
జరుగును, సరిగాకున్నను
జరుగవు లోలాక్షి! యెట్టి సంసారులకున్"

ఈ మాట మరీ విపరీతమైంది రుక్మిణికి.

యెంత ఆలోచించి యేతపస్సు యెన్ని జన్మలలో చేస్తే గాని యిటువంటి కవిత్వము వస్తుంది?

"విను ముదాసీనులము, క్రియా విరహితులము
పూర్ణులము మేము నిత్యాత్మ బుద్ధితోడ
వెలుగు చుందుము గృహదీప విధము మెఱసి
నవల తాన్వి! మాతోడ నవయ వలదు"

పూర్ణులము — అదీకాక నిత్యమూ ఆత్మబుద్ధితో నే వెలుగుదుము. యెలాగ "గృహదీప విధము మెఱసి" ఓహో యేమి వాక్కు? యిటువంటి మాతో "అవయ వలదు" మాతో నుండి యీ బాధలన్నీ నీ వెందుకు పడతావు?" అని.

సర్వమూ సర్వత్రా సమర్పించిన రుక్మిణీదేవిని పరీక్షించడానికి శ్రీకృష్ణపరమాత్మ పన్నిన పన్నాగ మిది; దీనిని మహాకవి యెలా వూహించి వ్రాశాడో యెవరి కెరుక,

మరల దీనికి ఆమె జవాబుకూడా మహాకవే చెప్పించాలి క దా
యీ మాటలకు ఆమె స్థితి చూడండి.

"అలికులవేణి తన్ను విభుడాడిన యప్రియ భాష లెమ్మోయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు సొన్పినరీతి గాగ బె
బ్బులి రొదవిన్న లేడిక్రియ బొల్పఱి చేష్టలుదక్కి నేలపై
వలనఱి వ్రాలె గీలెడలి వ్రాలిన పుత్తడిబొమ్మ కైవడిన్"

వహావా ! మహాకవివీ యేమి వాక్కు ?

మరపోయిన బంగారు బొమ్మలా రుక్మిణి నేలపై బడి
మూర్ఛబోయింది. మరల మహాకవి

"ప్రణతాన్నాయుడు కృష్ణుడంత గదిసెన్ భాష్పావరు
ద్ధారుణే
క్షణు విస్రస్త వినూత్న భూషణ దురుక్త క్రూర నారాచ శో
షణ నాలింగిత ధారుణి న్నిజకులాచారైక సద్ధర్మ చా
రిణి విశ్లేషిణి పీతతోషిణి పురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్"

యీ మత్తేభములో యెన్ని మణులున్నాయో! అలా
చూచిన కృష్ణపరమాత్మ

"తని సంభ్రమంబున దనువున దనువుగా
తనువున జందనం జల్ల నలది,
కన్నీరు పన్నీట గడిగి కర్పూరంపు
బలుకులు చెవులలో బాలు నూది

కరమొప్ప ముత్యాల సరులు చిక్కెడలించి
యురమున బొందుగా నిరవు కొలిపి
తిలకంబు నునుఫాల ఫలకంబుపై దీర్చి,
వదలిన భూషణావళుల దొడిగి
కమలదళ చారు తాలవృంతమున విసరి
పొలుచు పయ్యెద కుచముల బొందుపఱచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదదేర్చి
బిగియ కౌగిట జేర్చి నెమ్మొగము నిమిరి"

"నెరులు గల మరు నీలంపు టురుల సిరుల
సరులు గొనజాలి సరులను మరులు గొలుపు
నిరుల గెలిచిన తుమ్మెద గరుల దెగడు
కురు లులిదీర్చి విరులిడి కొప్పువెట్టి"

మహాకవి శబ్దలావణ్యము అనన్య సామాన్య లాటాను ప్రాస రమణీయ కమనీయ మహనీయ గణనీయ కవితా నందన వన పారిజాత పరిమళముల నల్లుకొన్నది.

అనరాని మాట లన్నాడు శ్రీకృష్ణపరమాత్మ - వినరాని మాటలు విన్నది రుక్మిణీదేవి. ఇన్నీ కల్పించినవాడు మహాకవి. ఆయన మాత్రం మనకు కానరాక పూవులలో దారము వలె నుంటాడు.

రుక్మిణికి స్వయముగా శ్రీకృష్ణపరమాత్మ శైత్యోప చారాలన్నీ చేసి తన హృదయపీఠానికి ఆమెను హత్తించు

కాని ఆమె మెడలోగల హారాల చిక్కులుదీసి, జారిన పయ్యెదను చక్కదిద్ది పద్మపత్ర తాలవృంతంతో స్వయముగా వీచాడు స్వామి. యిలా యెంతని వ్రాయగలము?

యిదంతా యెవరు సూచారు? మహాకవి పోతనగారు స్వయముగానే తిలకించారు. పులకించి యిలా వ్రాశారు. పలికించెడు రామభద్రు డున్నాడుగదా!

శ్రీకృష్ణపరమాత్మ ఒడిలో లాలింపబడిన రుక్మిణీదేవి సేదదేరి యేమన్నది? కాదు — యేమనిపించాడు మహాకవి

"సంచిత జ్ఞాన సుఖ బలైశ్వర్య శక్తు
లాదిగాగల సుగుణంబు లమరు నీకు
నేను దగుదునె సర్వలోకేశ్వరేశ!
లీలమై సచ్చిదానందశాలి ఘనము!"

ఇచ్చట పోతన మహాకవి గంటము అతీంద్రియ జ్ఞాన ప్రాభవప్రభా భావాంబర వీధుల విహారం చేసింది. యెన్నని వ్రాయగలుగుట — అన్నీ వ్రాయాలి. అవకాశమేది?

"నీరదాగమవేళ నిర్వృత పయఃపాన
చాతకం బేగునే చాటిపడకు,
బరిపక్వమాకంద ఫలసారంబులు గ్రోలు
కీరముల్ చనునె దుత్తూరములకు

ఘనరవా కర్ణనోత్కలిక మయూరముల్
గోరునే కలిన ఝిల్లీ రవంబు,
గరి కుంభ పిసిత సద్గ్రాస మోదిత సింహ
మరగునే శునక మాంసాభిలాష

ప్రవిమలాకార! భవదీయ పాదపద్మ
యుగ సమాశ్రయ నైపుణోద్యోగచిత్త
మన్యు జేరునే? తవకుపాస్యంబు గాగ
భక్త మందార! దుర్భర భవ విదూర!"

మహాకవికి సమయము దొరికినపుడు శరీరాన్ని మరచి వ్రాయును. ప్రహ్లాద చరిత్రలో "మందార మకరంద" అను లాంటిదే యీ పద్యము కూడా.

ఇక మహాకవి వాణిని వినండి. శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని జూచి చిరునవ్వుతో

"అలికులవేణి! నవ్వులకు నాడిన మాటలకింత నీమదిం
గలగగనేల? వేటలను, గయ్యములన్ రతులందు నొవ్వగా
బలికిన మాట లెగ్గులని పట్టుదురే భవదీయ చిత్తముం
దెలియగ గోరి యే బలికితిన్ మదిలో నిజపట్టు నేటికిన్!"

యింత గందరగోళాన్ని కల్పించిన కవి యెంత అందముగా రుక్మిణి నోదార్పించాడో!

ఆ... యేముంది నవ్వులాటకన్న మాటల కింతైతే పోతావా? అదిగాక వేటలందు - జగడాలందు - రతులందు యేవేవో అంటారు అవన్నీ నిజంగా భావిస్తే యెలాగ?

చివరకు శ్రీకృష్ణపరమాత్మచేత యిలా పలికించాడు.

"నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మ వివేక శీల స
ద్భావవు నీ మనోగతుల భాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయె కాని యన్యము భజింపవు పుట్టిన నాటనుండి నీ
భావ మెరింగి యుండియును బల్కిన తప్పు సహింపు మానినీ"

ఈ పద్యంతో మహాకవి ముక్తాయింపు పలికాడు.

రుక్మిణీ కృష్ణుల యీ నర్మసంభాషణ మీా విధంగా ఉంది—

సాధకునికి కైవల్యం ప్రాప్తిస్తుందనగా ప్రవృత్తి తత్త్వం ఒక్కసారిగానే తలెత్తి ప్రలోభము గలిగించును. ఎన్నో నాళ్ళనుంచి సాధన సంస్కార సచ్ఛరిత్ర విషయ రాహిత్య సాధనలో యేమీా ఆనందం చిక్కక పోవడంతో సాధకుడు విసిగి, వేసారి తనచుట్టూ తన అనుభవానికే వేచి లేచి ఉన్న సుఖాలవైపూ, ఐశ్వర్యాలవైపూ మ్రొగ్గు చూపడం చాలమంది సాధనలో జరిగేదే. మొదటిలో ఉన్న విరక్తి భావము చివరి వరకూ నిలుపుటా! సుఖాలవైపు మరల సాధన భ్రష్టత కావడం జరుగుతుందని భావించాలి. సాధన పరిపూర్ణత్వం పొందబోయే ముందు కలిగే విఘ్నాలుగా తెలియాలి. సాధకుడు యీ సమయమున అతి జాగ్రత్తగా ఉండాలి. యిదంతా వ్యాసులవారి భాగవంలో ఉన్నదే! అయినా మన మహాకవి అద్భుత కవితా ప్రతిభ చూపించాడు.

## 11వ స్తబకము

"హరి భజియించు హస్తములు హస్తము, లచ్యుతుగోరి
మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు, చక్రిధరు చేరిన చిత్తము చిత్త, మిందిరా
వరు గను దృష్టి దృష్టి, మురవైరి నుతించిన వాణివాణి, యా
హరు కథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లు నో భువిన్"

మన మహాకవికి అంత్య లాటాను ప్రాస నల్లేరుపై బండేగదా ! ఇది తిలకించండి.

"ఇందీవర శ్యాము! వందిత సుత్రాము!
కరుణాలవాలు! భాసుర కపోలు!
కౌస్తుభాలంకారు! గామిత మందారు!
సురుచిర లావణ్యు! సుర శరణ్యు!
హర్యక్ష నిభ మధ్యు! నఖిల లోకారాధ్యు!
ఘన చక్రహస్తు! జగత్ప్రశస్తు!
ఖగ కులాధిప యాను! కౌశేయ పరిధాను!
పన్నగ శయను! నబ్జాత నయను!
మకరకుండల సద్భాసు! మంజు భాసు!
నిరుప మాకారు! దుగ్ధ సాగర విహారు!
భూరి గుణసాంద్రు! యదుకులాంబోధి చంద్రు!
విష్ణు! రోచిష్ణు! జిష్ణు! సహిష్ణు! గృష్ణు!"

నిరుపమాన కవితా లావణ్య శోభిత లాటానుప్రాసాంత్య ప్రాస ఆంధ్రభాషా యోషా భూషిత పట్టభద్రుడగు మహాకవి సీసపద్యాన్ని చదివి ఆనందించండి. కుచేలుడు శ్రీకృష్ణపరమాత్మను గని చేసిన ప్రార్థన.

"కమనీయ పద్మరాగ స్తంభకంబులు
గోమరారు పటికంపు కుడ్యములును
మరకత నవరత్నమయ కవాటంబులు
గీలిత హరినీల జాలకములు
దీపిత చంద్రకాంతోపల వేదులు
నంచిత వివిధ పదార్థములును
దగు హంస తూలికా తల్పంబులును హేమ
లాలిత శయనస్థలములు దనర
సమధికోత్తుంగ భద్రపీఠములు సిరులు
మానితోన్నత చతురంత యానములును
వలయు సద్వస్తు పరిపూర్ణ వాటికలును
గలిగి చెలువొందు మందిరం బెలమి జొచ్చి"

శ్రీకృష్ణ పరమాత్మ కరుణాకటాక్ష కలిత ప్రేమానురాగ రసముతో చెలువొందిన కుచేలుని భవన వర్ణనము మహాకవి గంటము ఎంత సుందర కవితా నందనవనమును సృష్టించిందో! అందమేమి? చందమేమి! దీనిని వర్ణింప యెవరి వశం?

'సాంద్ర శరశ్చంద్ర చంద్రికా స్ఫూర్తిచే
రాజిల్లు పూర్ణిమా రజనివోలె
బూర్ణేందు బింబావతీర్ణమై యిలమీద
భాసిల్లు హారిణ శాబకము వోలె
సులలిత మేఘమండలమును నెడబాసి
వసుధ గ్రుమ్మరు తటిద్వల్లివోలె
మాణిక్య రచిత సమ్మోహిత చైతన్యంబు
బొందిన పుత్తడి బొమ్మవోలె
లలిత విభ్రమరుచి కళా లక్షణములు
పొసగ రూపైన శృంగార రసమువోలె
నర్థి జరియించుచున్న పద్మాయతాక్షి
బ్రకట సద్గుణ భద్ర! సుభద్ర జూచి"

అర్జునుడు సుభద్రను వర్ణించు యీ పద్యములో మహాకవి కవితా తి సకలాభరణ భూషితమై పాఠకలోక హృదయ మందిర మందు రత్నదీపికయై శాశ్వతముగా నిలుచును గదా!

"సజల నీలాంబుద శ్యామాయమానాంగు
నాశ్రితావన ముదితాంతరంగు
సనకాది యోగి హృద్వనజ మధుపేంద్రు
ముఖపద్మరుచి జిత పూర్ణచంద్రు

గమనీయ నిఖిల జగద్ధిత చారిత్రు
 ప్రత్యూష సంఫుల్ల పద్మనేత్రు
నిందిరా హృదయారవిందారు ణోల్లాసు
 శ్రీకర పీత కౌశేయవాసు

హార కుండల కటక కేయూర మకుట
కంకణాంగద మణి ముద్రికా వినూత్న
రత్న నూపుర కాంచీ విరాజమాను
భవ మహార్ణవ శోషు సద్భక్త పోషు"

ఈ పద మూ శ్రీహరి వర్ణనా ప ద్యమే! పోతన మహాకవి యె- మారులు తనివి తీరకుండా నారాయణుని వర్ణించినా, ఈ పద ప్రత్యేకత! సహజాంత్యానుప్రాస వైభవ విఖ్యాత సమే కమనీయ యార్థ భావ బంధుర కవితా సతీ సువర్ణ చరణ మంజు మంజీర ఝుళఝుళా రవణి భక్తుల హృదయ మందిరా రామముల హాయిగా తీయగా నిరంత రమూ ధ్వనింప చేయుచుండెను.

భాగవతంలో దశమస్కంధం ఉత్తరభాగం సంపూర్ణం. శ్రీ భాగవత గూఢార్థ దీపికా కర్త - శ్రీ మధుసూదన సరస్వతి శ్రీకృష్ణపరమాత్మ నిట్లు ప్రార్థించాడు.

శ్లో॥ కుర్వంతి [illegible] దప్యేనరంతే
 స్వాంతం [illegible] విషయాంతర శాంతి మేవ
 [illegible] బిందు
 [illegible] భిన్న నో మే॥

వంశీ విభూషిత కరాన్నవ నీరదాభాత్
పీతాంబరారుణ దరుణబింబ ఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందర ముఖా దరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వ మహం న జానే॥

"ఘనుని శ్రీకృష్ణుని గౌస్తుభా భరణుని
గర్ణ కుండల యుగ్మ ఘువ కపోలు
బుండరీకాక్షు నంభోదర శ్యాముని
గలిత నానారత్న ఘన కిరీటు
నాజానుబాహు నిరర్గళాయుధ హస్తు
శ్రీవత్సు బీత కుశేయవాసు
రుక్మిణీ నయన సరోజ దివాకరు
బ్రహ్మాది సుర సేవ్య పాదపద్ము
దుష్ట నిగ్రహ శిష్ట సంతోష కరణు
గోటి మన్మథ లావణ్య కోమలాంగు
నార్తజన రక్షణైక విఖ్యాత చరితు
గనిరి కరుణా సముద్రుని ఘనులు మునులు"

సర్వ మునులూ శ్రీకృష్ణ పరమాత్మను దర్శించారు ఆ సమయాన మహాకవి పోతన హృదయ ముప్పొంగి జాలువార్చిన మహాకవిత్వా సరస్వతి వర్ణన య్యిది.

"తరణంబులు!, భవజలధికి
హరణంబులు దురితలతల కాగమముల కా
భరణంబు! లార్తజనులకు
శరణంబులు; నీపదాబ్జ సంస్మరణంబుల్"

మహర్షులచేత మహాకవి పలుకులు అమృతపు చినుకులు. సద్భక్తులకు యెంతో ప్రాణ కుసుమాలు. యీ పద్యాలు
"సంతంబును గృష్ణ సంకీ నంబులు
వీనుల కింపుగా వినగవలయు
హరినామ కధనంబు హర్షంబు తోడుత
బాటల నాటల బరగవలయు,
నారాయణుని దివ్య నామాక్షరంబులు
హృద్వీధి సతతంబు నెన్నవలయు,
గంజాక్షు లీలలు గాంతారములనైన
భక్తి యుక్తంబుగా బాడవలయు
వెఱ్ఱి మాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోక బాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెరుగవలయు
భేద మొనరింప వలవదు మేదినీశ"

అవసరం పడితే నా మహాకవి అమృత లేఖిని అత్యద్భుతావహ కవితా సుందరి దివ్య మనోహర రాగరంజిత ఝత్కార సువర్ణ మంజీర నినాదాలు భక్తుల శ్రవణపుటాల్లో

నింతరమూ నిండిస్తుంది. అందుకే అన్నాడుగదా! "దీనిం దెనిగించి నా జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగాన్" అని శ్రీ పోతనకవి సార్వభౌమునకు పద్యపాద మెత్తిన పునర్జన్మ లేకుండా, లేదా మోక్షము, లేదా వేరొకటి యేది వ్రాసినా కేవల ఐహికాభిలాష యింత మహాగ్రంథములో యెందూ కాన్పించదు. నిజముగా యిదంతా యెందుకు? యెన్నాళ్లుంటుంది? శాశ్వతానందమైన పదమే గదా ప్రతివారికీ కావలసినది.

అందుకే "పోతన" అనగానే శరీరము పులకరిస్తుంది. అందునా పోతన పద్యపాదమైనా కనీసం రానివాడుండడు గదా!

"హరి కథలు హరి చరిత్రము
హరి లీలావర్తనములు నంచితరీతిన్
బరువడి నెరిగితి మంతయు
సురనుత! యనుమానమొకటి చొప్పడెడి మదిన్"

పరీక్షిత్తు కాలరూపం బడిగాడు. శ్రీ శుకులవారు చక్కగా చెప్పాడు; శ్రీ భాగవతము 12 స్కంధాలు చివర మృత్యుంజయుడైన మార్కండేయుని చరిత్రతో ముగిసింది. భాగవతము తెలుగుల వెల్లు. నిత్యపారాయణార్హమైనది యీ మహాగ్రంథము.

శ్రీ వ్యాస మహాభాగవత పురాణము 18000 శ్లోకాల మహా గ్రంథాన్ని మహాకవి పోతన కేవలం 8/91 గద్య

పద్యాలల్లో వ్రాశాడు. అనగా ఔచిత్య భాసురంగా తగ్గించాడు. శ్రీ వ్యాసులవారు అనేక వర్ణనాంశాలు యెంతో పెంచి వ్రాశారు. కాగా ఆ కాలము, ఆనాటి మనుష్యులూ, వారి వారి మన స్తత్వాలూ వేరు వేరుగా వుండేవి. శ్రీ పోతన మహాకవి కాలంనాటికి అంతటి దానిని పఠించే ఓపికా లేదు. అందువలన పోతన అంత సంక్షిప్తం చేశాడన్వి అనుకోవాలి.

అవసరమైన పట్టుల్లో మూలంలో లేకపోయినా పెంచి తన మహాభక్తి పారవశ్యంతో శరీరం తెలియకుండా వ్రాసిన పట్టులు లేకపోలేదు. అలాగని చాలా తగ్గించినవీ ఉన్నాయి. శ్రీ పోతన మహాకవి వ్రాసిన గద్య పద్యాలు యీ క్రింది విధముగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| ప్రథమ స్కంధం | | 536 |
| ద్వితీయ | ,, | 289 |
| తృతీయ | ,, | 1046 |
| చతుర్థ | ,, | 974 |
| పంచమ | ,, | 166 |
| షష్ఠ | ,, | 529 |
| సప్తమ | ,, | 482 |
| అష్టమ | ,, | 741 |
| నవమ | ,, | 735 |

| | |
|---|---|
| దశమ స్కంధ పూర్వభాగం | 1787 |
| దశమ స్కంధ ఉత్తర భాగం | 1887 |
| ఏకాదశ స్కంధం | 125 |
| ద్వాదశ స్కంధం | 54 |
| | 8791 |

కాలము అనంతం అయినా పూర్వపు మహర్షులు కాలానికి వారి తపోశక్తితో హద్దు లేర్పాటు చేశారు. అందులో సూర్యుడు నవగ్రహాలకూ రాజు.

జగచక్షువు సూర్యభగవానుడు పదిరెండు మాసాల రూపములో పరిభ్రమిస్తున్నాడు. అంతా యీశ్వర ప్రేరణమే.

శ్రీమన్నారాయణుడు యీశస్వరూపుడే! కాని

చైత్ర మాసమున :- సూర్యుడు "ధాతు" అనే నామంతో "కృతస్థలి హేతి - వాసికి రథకృత్తు - పులస్త్యుడు - తుంబురుడు" అనే తన పరివారాన్ని చేరి సంతోషముతో గడుపుతాడు.

వైశాఖ మాసమున :- "అర్యముడు" అను పేరుతో "పులహుడు - ఓజుడు - ప్రహేతి - పుంజికస్థలి - నారదుడు - కచ్ఛనీరు" అను అనుచరులతో కాలం గడుపుతాడు.

జ్యేష్ఠ మాసము :- "మిత్రుడు" అను పేరుతో "అత్రి - పౌరుషేయుడు - తక్షకుడు - మేనక - హాహా - రథస్వనుడు" అను వారిని జేరి కాలము గడుపుతాడు.

ఆషాఢ మాసము :- "వరుణుడు" అను పేరుతో "వశిష్ఠుడు - రంభ సహజన్యుడు - హూహువు - శుక్రుడు - చిత్రస్వనుడు" అనే వారితో కూడి కాలక్షేపము చేయును.

శ్రావణ మాసము :- "ఇంద్రుడు" అను నామముతో "విశ్వావసువు - శ్రోత - యేలాపుత్రుడు - అంగిరస్సు - ప్రమ్లోచ - రాక్షసుడు - చర్యుడు" అను వారితో గూడి కాలము గడుపును.

భాద్రపద మాసము :- "వివస్వంతుడు" అను నామముతో "ఉగ్రసేనుడు - వ్యాఘ్రుడు - అసారణుడు - భృగువు - అనుమ్లోచ - శంఖపాలుడు" అను వారలతో కూడి కాలక్షేపమ్మొనరించును.

అశ్వయుజ మాసము :- "త్వష్ట్రుడు" అనే నామంతో చరిస్తాడు.

కార్తీక మాసము :- "విష్ణువను పేరుతో" "అశ్వతరుడు - రంభ - సూర్యవర్చస్సు - సత్యజిత్తు - విశ్వామిత్రుడు - మఖాపేతుడు" అనే వారితో కూడి సంచరించును.

మార్గశిర మాసము :- "అర్యముడు" అను నామముతో "కశ్యపుడు - తార్క్ష్యుడు - ఋతసేనుడు - ఊర్వసి - విద్యుచ్ఛత్రుడు - మహాశంఖుడు" అనువారితో సంచరించును

పుష్య మాసము :- "భగుడు" అను పేరుతో "స్ఫూర్జుడు - అరిష్టనేమి - ఊర్ణుడు - ఆయువు - కర్కోటకుడు - పూర్వచిత్తి" అను సభ్యులగూడి సంచరించును.

మాఘ మాసము :- "పూషుడు" పేరుతో "ధనంజయుడు - వాతుడు - సుషేణుడు - సురుచి - ఘృతాచి - గౌతముడు" పరివారయుతుడై సంచరిస్తాడు.

ఫాల్గుణ మాసము :- "క్రతువు" అను పేరుతో "వర్చసుడు - భరద్వాజుడు - పర్జన్యుడు - సేనజిత్తు - విశ్వేదేవతలు - ఐరావంతుడు" అనువారితో గూడి పరిభ్రమిస్తాడు.

ఈ విధంగా పదిరెండు మాసాల క్రమములో మాసానికి ఒక నామంతో తన పరివారంతో సూర్యభగవానుడు తిరిగి ప్రపంచ రక్షణ గావిస్తాడు.

అందువలననే శ్రీ భాగవత పురాణము ద్వాదశ (12) స్కంధాలలో వ్యాసులవారి దివ్యరచనను మన తెలుగులు పంటగా మనకు మహాకవి పోతన అందించారు.

## —* శ్రీ మహాభాగవత తత్త్వమేమి *—

దీనికొరకే గదా మనమందరం తాపత్రయం పడేది. మానవ జీవితంలో కలిగే ప్రతి ఘట్టమునూ, తనకు గురువుగానే భావించాలి. దానివలన ఆత్మజ్ఞానాన్ని అలవరింప చేసుకోవాలి. ఆ జీవితములో జరిగే అనేక సంఘటనల వలనే గుణపాఠాన్ని నేర్చుకోవాలి. పుట్టినది మొదలు గిట్టిన వరకూ మనకు జరగే ప్రతి విషయమూ శరీరానికేగాని ఆత్మకు మాత్రము కావని ముఖ్యంగా తెలిసికోనాలి.

ఈ లోకములో మానవ దేహం చాలా దుర్లభము వచ్చినదిగా ముందు తెలియాలి. అటువంటి యీ దేహం యెప్పుడు నశిస్తుందో తెలీదు కనుక యీ శరీరం ఉన్న కాలంలో మన మనస్సును సత్సంగములోనే గడపాలి. ఇది మోక్షానికి ప్రథమ మెట్టు.

విగ్రహ పూజలోనే మనలో గల పరమాత్మను ఆరాధన చేస్తూ ద్వంద్వాతీత మనసుతో, అనగా "లాభ-నష్టాలు, సుఖ-దుఃఖాలూ, శత్రులు-మిత్రులు" మొదలైన వాటికి అతీతంగా నిస్సంగత్వంగా భావించాలి మోక్షభవనారోహణకు నిస్సంగమనే మెట్టు మీదుగానే ప్రయాణించాలి. వేరొక మార్గం లేదు. ఈ నిస్సంగత్వం మోక్షానికి రెండవ మెట్టు

యే విషయమూ ఈ పాంచభౌతిక దేహానిదే కాని, ఆత్మది యెంతమాత్ర కాదని అన్నిటియందూ నిర్లిప్తుడై యుండి కేవల పరమాత్మ (తనలో ఆత్మ తప్ప) యింకేదీ మిగిలేది లేదని నోటితో చెప్పకుండా తన జీవితంలోనే చూపిస్తూ జీవించే జీవితము ముక్తికి మూడవ మెట్టు.

తాను దేహధారిగా జీవించుచున్నా దేనినీ స్పృశించు కోక కలవంటిదే యీ జీవితమనే భావనచేస్తూ, సర్వస్వంలో పరమాత్మ దర్శనాన్నే గావిస్తూ, తనలో ఉన్న జ్ఞానాగ్నిని మేలుకొలిపి అజ్ఞానాంధకారాన్ని దహింపచేసి ప్రజ్ఞతో యే కోరికలూ లేకపోయి నిర్మోహత్వము వహించుట మోక్షానికి నాల్గవ మెట్టు.

మనస్సే సుఖ దుఃఖాలకు కారణ మని తెలిసికోనాలి. "మన ఏవ మనుష్యాణాం కారణం సుఖ దుఃఖాయోపి" అనునదే నిజమైనది మనో నిగ్రహంతో భగవతుని సాధించ గలము. మనో నిగ్రహము వలన నిర్వృతి త్త్వం అనుభవము లోనికి వస్తుంది. దీనివలన అమనస్కత సిద్ధిస్తుంది. అమనస్కతే జీవన్ముక్తి.

ఇక మనోనిగ్రహత సంపాదనకొరకే దాన ధర్మాలు, యజ్ఞయాగాలు, యిన్ని ఉపవాసాది వ్రతాలూ, పారాయణాలూ, అన్నిటికీ యేకైక మార్గము మనోనిగ్రహత. ఇలా

అన్నీ చేస్తూ చేస్తూ ప్రయాణము గావిస్తే ఒకప్పటికి గమ్యం దొరుకుతుంది. అదే మనోనిగ్రత. ఈ మనోనిగ్రత కలుగుట కొందరికి యెన్నో జన్మల పుణ్య విశేషము వలన అతిత్వరలో సిద్ధించవచ్చును. కొందరికి కొంచం యెక్కువకాలం పట్ట వచ్చును. అంతమాత్రంచేత పట్టినపట్టు విడువకూడదు.

ధనానికీ, అహంకారానికీ మనసే కారణం; ముందు నేనూ, నాదీ అను రెండిటినీ మెల్లగా యేలాగో ఓలాగు దినదినమూ కృషిచేసి విడిచిపెట్టామా యిదే జీవన్ముక్తి. అజ్ఞానమే కొందరిని మిత్రులనూ, యింకా కొందరిని శత్రువులుగా తయారుచేస్తుంది. అందువలన దానిని నెమ్మది నెమ్మదిగా తగ్గించుకొని రావాలి, అలాగైన వాడు మోక్ష సౌధాన్ని అధిరోహించడానికి అర్హుడౌతాడు. నిరంతరమూ భగవంతునిపై బుద్ధి నుంచుటే మనస్సును శుద్ధిగావిస్తుంది.

మొత్తం భాగవతం పదిరెండు స్కంధాల్లో యీ అమనస్క యోగసాధన గూర్చే చెప్పబడింది అందువలన భాగవతం నిత్యం పారాయణ గావించి యీ యోగాన్ని అందుకోనండి.

## —* పోతన మహాకవి అనువాదం *—

[illegible] అనువాదాన్ని కొంచము ముచ్చ టించు కొంటా[illegible] [illegible]కాసుర వధ ఘట్టమున సత్యభామ

గావించిన యుద్ధాన్ని యెంతో రమణీయంగా వర్ణించాడు. యీ విషయం శ్రీ వ్యాసులవారి భాగవతంలో కానరాదు. మహాకవి యీ సత్యభామ నరకాసురునితో యుద్ధముచేయుట "విష్ణుపురాణము - నాచన సోముని ఉత్తర హరివంశము నుండియూ తీసికొనినాడు. మొత్తం భాగవతములో యిదొక్కటే యితర గ్రంథం నుండి తెచ్చి తాననువదించింది యిందు కనబడుతుంది.

శ్రీ వ్యాసులవారి మూలము—

శ్లో॥ "ఇంద్రేణ హృతఛత్రేణ హృతకుండలబంధునా
హృతామరాద్రి స్థానేన జ్ఞాపితో భౌమ చేష్టితమ్
సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ
గిరిదుర్గైః శస్త్రదుర్గైర్జలాద్యనిల దుర్గమమ్"

శ్రీకృష్ణపరమాత్మ నరకాసురుని వధార్థం భార్యతో గరుడారూఢుడై ప్రాగ్జ్యోతిషపురానికి నేగెనని" మూలములో నుండగా మన మహాకవి— శ్రీకృష్ణపరమాత్మ వెళ్లుచుండ తననుగూడా యుద్ధానికి సత్యభామ తీసికొని వెళ్ళుమనియూ, శ్రీకృష్ణుడు మొదట వద్దనియూ, చివర కామె గట్టిగా పట్టు బట్టుటచేత ఆమెనుకూడా తీసికొని యేగినట్లు ఉత్తర హరివంశమున ఉండెను. సత్యభామ నరకాసురునితో యుద్ధము గావించుట మూలములోనే లేదు. నరక సత్యభామల యుద్ధాన్ని 17 పద్యాల్లో యెంతో విపులంగా రమ్యంగా వర్ణించాడు.

సత్యభామ నరకాసుర సంవాదము కూడా మూల ములో లేదు. మన మహాకవి స్వతంత్రించి పెంచిన భాగాలు.

హిరణ్యకశిపుః

శ్లో॥ "ప్రహ్లాద! ఉచ్యతాం తాత స్వధీతం కించిదుత్తమమ్
కాలే నైతావ తాయుష్మన్ యద శిక్ష ద్గురోర్భవాన్"

ప్రహ్లాద ఉవాచ—

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుం సార్పి తా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా
క్రియ తే భగవత్యద్ధా తన్మ న్యేఽధీత ముత్తమమ్"

ఈలాగు మూలమందు హిరణ్యకశిపుడు తొడమీద ప్రహ్లాదుని కూర్చుండబెట్టుకొని నీ వేమి చదివావనే ప్రశ్నా, దానికి ప్రహ్లాదు డిచ్చిన సమాధానం యెంతో సంక్షిప్తంగా ఉన్నాయి. యిచ్చట మహాకవి అత్యద్భుతంగా యెంతో పెంచి వ్రాశాడు.

"చదివించి రె నిను గురువులు చదివెద వే మైన బట్టి చదివితి తండ్రీ"
"చదువుల లోపల మర్మము చదివితి..."

"చదు బయ్యెడి నింత కాల మరిగెన్"
"నిన్ను చ్చరు నీతి పారమహిమన్"

యిందులో మొదటి పద్యంలో రెండుపాదాలు మాత్రం మూలాను సారంగా ఉన్నాయి. తక్కినదంతా మహాకవి పెంచి వ్రాసినద్దే!

"చదివించిరి నను గురువులు"

"తనుహృద్భాషల సఖ్యమున్"

"అంధేందూదయముల్"

"కమలాక్షు నర్చించు కరములు"

"కంజాక్షునకు గాని కాయంబు కాయమే"

"సంసార జీమూత సంఘంబు విచ్చునే"

యిందులో యేదీ మూలం

అంతేకాక మూలములో లేకపోయినా భక్త్యావేశ పూరితుడగు మహాకవి ఒడలెరుంగకుండా తన భక్తి శక్తి నిందు నిరూపించాడు.

మొసలినుండి తనను రక్షింప గజేంద్రుడు గావించు స్తోత్రాన్నాలించి బ్రహ్మాదు లందరూ మౌనం వహించారు. శ్రీ నారాయణుడే తన భక్తుని సంరక్షింప నెంచాడు అని చెప్పిన తరువాత మూలములో

శ్లో॥ "తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేన స ఊహ్యమాన
చక్రాయుధో௨భ్యగమ దాశు యతో గజేంద్రః"

“స్సోంతస్సర స్యురుబలేన గృహీత అఙ్ఘ్రో
దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్త చక్రమ్
ఉత్క్షిప్య సాంబుజ కరం గిరమాహ కృచ్ఛ్రా
న్నారాయణాఖిల గురో భగవన్నమస్తే”

అని మాత్రమే ఉంది.

ఇచ్చట మహాకవి పెంచిన దెంతయో అంత మహత్తర కవితా రామణీయకతా, అక్షర రమ్యతా, భక్తిపారవశ్యతా జూపించాడో చెప్పనలవి గానట్లుంది.

“అల వైకుంఠపురంబు”
“సిరికిం జెప్పడు శంఖచక్రయుగమున్”
“ఇట్లు భక్తజన పాలన పరాయణుండును”
“తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్”
“తను వేంచేయు పదంబు బేర్కొనడు”
“తాటంకా చలనంబుతో”
“అడిగెద నని”
“నిటలాలకము లంట”
“వినువీధిం జను దేర”
“అయ్యవసరంబున గుంజరేంద్ర”

ఇవన్నియు మహాకవి కల్పించినవే! ఇందులో శ్రీమన్నారాయణుని భక్తరక్షణ దక్షత అపూర్వ కవితా రామణీయకతతో పోషింపబడింది. 15వ అధ్యాయములో 11 నుండి

22 వ శ్లోకముల వరకూ మూలమున స్వర్గం వర్ణన వ్రాయ బడింది. యిచ్చట మహాకవి తనకుగల శబ్దార్థాలంకార యమ కముతో యెంతో సుదీర్ఘ వచనమును వ్రాసెను. యీ గద్య మున మన మహాకవి కల్పించి వ్రాసినదే యున్నది.

అనలమున వ్రేల్చిన తరుహాత వామనమూర్తి బలిచక్రవర్తిని చూడ నేగెనని ఈ శ్లోకమున నున్నది.

"శ్రుత్వా మే ధైర్యజమాన మూర్జితం
బలిం భృగూణా ముపకల్పితైస్నః
జగామ తత్రాఖిల సారసంభృతో
భారేణగూ సన్నయన్ పదేపదే"

మన మహాకవి—

దేశాంతర సమాగతులైన బ్రాహ్మణుల వలన బలి వదాన్యతను గూర్చి విని భిక్షార్థియై బలియింటికి కరిగెనని ఆరు పద్యాలలో హృద్యంగా వ్రాశాడు,

"చండస్ఫూర్తి వటుండు గాంచె" నను పద్యం మూల ములో లేదు. మహాకవి అంత్యానుప్రాసతో తన సహజసిద్ధ కవితాస్ఫూర్తి జూపించిన పద్యాలన్నిటికీ మూలము లేదు.

మూలములో

"ఇత్థం స శిష్యేషు భృగు ష్వనేకధా
వితర్క్యమాణో భగవాన్ స వామనః
స దండ ఛత్రం సజలం కమండలుం
వివేశ బిభ్రద్ధియమేధ వాటమ్"

దీనిని మహాకవి వామనుడు హయమేద వాటాన్ని చేరి అనేక వినోద వింతచేష్టలునూ, బలిని హస్తహొత్తి ఆశీర్వదించుటయూ యీ క్రింది పద్యాల్లో చూడండి.

"చవులుగా చెవులకు"
"వెఱచుచు వంగుచు లేచుచు"
"కొందరితో జర్చించును"
"మఱియు ననేక విభ్రముల నంటరకు"
"వెడవెడ నడకల్లు నడుచుచు"
"ఇట్లు డగ్గరి మాయాభిక్షుకుండు"
"ఇతడే దానవ చక్రవర్తి"
"ఇట్లు కుశ పవిత్రాక్షత యుతంబగు"
"స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు"

బలిచక్రవర్తి వామనుని జూచి "వడుగా! యెవ్వరివాడ వెవ్వడవు" అని అడుగగా సమాధానముగా వామనుడు వ్యంగ్య భంగిమలతో భగవత్తత్వము వ్యక్త పరిచాడు.

ఇలాంటి పట్టులలో మహాకవి లేఖిని పరవళ్లు త్రొక్కుతూ ఉరకలు వేస్తూ చంగలిస్తుంది.

బలిని మూడడుగులు నేల యిమ్మని అడుగుట బలి వదాన్యత వామనుడు కొనియాడుట మూలమందు కాన రాదు. అయినా అద్భుత కవితార్తిత్వముతో ఆనంద నందనవన చందనాన్ని అందిస్తుంది.

ఈ వామన చరిత్రలో మహాకవి పోతన మూలమును వదలక దానికి అనల్పశిల్ప కవితాక్షర రమణీయ దివ్యసౌంద ర్యానవద్య హృద్య పద్యములతో పరితల నుజ్జ్వాతలూ గించాడు.

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై"
"ఎన్నడుం బరు వేడ బోడట"

పద్యాలు ఆ మహాకవియొక్క లోకజ్ఞాన బంధుర కవితా నవద్య విద్యను జూపుచున్నాయి.

దశమ స్కంధం అష్టమాధ్యాయములో రామకృష్ణుల బాల్య క్రీడలను, గోపికలు యశోదాదేవితో చెప్పిన వారి చిలిపి చేష్టలను మూలమున

"కాలేన వ్రజతా అల్ప! । గోకులే రామ కేశవా
జానుభ్యాం సహ పాణిభ్యాం । రమమాణౌ విజహ్రతుః"

ఇది వారి బాల్యక్రీడలను వర్ణించు ప్రథమ శ్లోకము.

"శ్రీకృష్ణస్య గోప్యోరుచిరం । వీక్ష్య కౌమార చాపలమ్
శృణ్వంత్యాః కిలతన్మాతు । రితిహోచు స్సమాగతాః"

గోపకాంతలు యశోదాదేవితో శ్రీకృష్ణు చేయు దుడుకు తనములు చెప్పెడు నాలుగు శ్లోకాలు మూలములో నుండగా మన మహాకవి యిరువది రెండు పద్యాలు వ్రాసి బాలగోపాలుని అనగా "నందాంగనా డింభ

కునిపై తనకుగల భక్త్యాతిశయమూ, కవితా సౌందర్యమూ రెండూ కలిపి తన్మయత్వముతో వ్రాశాడు. గోపికలు కృష్ణుని గానక వెదకుచూ బరవశులై చేసిన వింతవింత చేష్టలు యెన్నో వర్ణింపబడ్డాయి. మహాకవి శ్రీ వ్యాసులవారి భావాలకు తన అపూర్వ భావ సౌష్ఠవ రామణీయకా విన్యాస భంగిమలతో తన సహజకవితా రమణికి అనల్ప శిల్పాభరణీయాలైన అంత్యానుప్రాస వైభవాన్ని జూపించాడు.

"నల్లనివాడు పద్మనయనంబులవాడు"
"ఈ చరణంబులే యిందు నిభానన సనకాది ముని
యోగ సరణి నొప్పె"

యిటువంటి అపూర్వమైన పద్యాలీ ఘట్టములోనివే.

## —* రుక్మిణీ కల్యాణము *—

ఈ కథయందు మహాకవి పోతన జూపిన అపూర్వ భావనా శబలతకు దేవతలైనా మోకరిల్ల వలసినదే!

రుక్మిణీదేవి బాల్య యౌవనాలను యిచ్చట వర్ణించాడు.

"బాలేందు రేఖ దోచిన"
"మరియు దినదిన ప్రవర్ధమానయై"
"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు"
"దేవకీసుతుకోర్కె తీగెల్లు వీడంగ"

పూర్వము ధనవంతుల గృహాలలో జరుగు విషయా లను "పేర్వేర బొమ్మల" అను పదార్థం స్పష్టము గావిం చును. మూలములో యీ విషయము లేనేలేదు. మహాకవి యీ ఘట్టమందు తన్మయుడై తన గంటాన్ని మనోహరంగా నడిపాడు.

తన అన్న రుక్మి శిశుపాలున కిచ్చుటకు యేర్పాటు గావింపగా రుక్మిణి ఒక బ్రాహ్మణుని శ్రీకృష్ణపరమాత్మ దగ్గరకు పంపినట్లే మూలములో నున్నది.

ఇచ్చట మహాకవి అతిలోక రామణీయకతతో కొన్ని పద్యాలు పెంచి వ్రాశాడు.

రుక్మిణీదేవి పంపిన బ్రాహ్మణుడు శ్రీకృష్ణపరమా త్మతో రుక్మిణీదేవి సందేశము దెల్పు సందర్భమున 8శ్లోకాలు మాత్రమే మూలమున గానవచ్చును. మన మహాకవియో యెన్ని పద్యాలనో దివ్య సౌందర్య తుందిలంబుగా పఠితల హృదయా లుప్పొంగి ఊటలూరులాగున వ్రాశాడు.

బ్రాహ్మణుడు శ్రీకృష్ణపరమాత్మ దగ్గర రుక్మిణిని వర్ణించిన తీరు సారభూతమై యెంతో ఔచిత్యాన్ని పోషిం చినదై యున్నది.

బ్రాహ్మణుడు ద్వారకనుండి వచ్చి తన యెదురుగ నిలువ రుక్మిణి ఆనందంతో ఆతనికి నమస్కారం చేసినట్టుగానే మూలంలో నున్నది.

మహాకవి—

"జలజాతేక్షణు దోడి తెచ్చితివి" యీ పద్యంలో రుక్మిణీదేవి కృతజ్ఞతా పూర్వక భక్తిని నిరూపించెను.

శ్లో॥ "కుత్ర యాసి స్వసారం మే ముషిత్వా ధ్వాంక్షవద్ధవిః" అనియే మూలంలో ఉన్నది. దీనిని "మాసరివాడవా మాపాప గొనిపోవ" అను వ్యంగ్యార్థ వైభవోపేతముగా అత్యద్భుత ఔచిత్యంతో మహాకవి వర్ణించిన విధము వివరించ నేరనిది.

## —* కుచేలోపాఖ్యానము *—

శ్లో॥ తం విలోక్యాచ్యుతో దూరాత్
ప్రియా పర్యంక మాస్థితః
సహసోత్థాయ చాభ్యేత్య
దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా"

యీ శ్లోకానికి మహాకవి

"కన్నె డాయంజను నంత కృష్ణుడు" అని యెంతో సందర్భోచితముగా వర్ణించాడు.

కృష్ణపరమాత్మ కుచేలునితో సల్లాప మొనరించు సందర్భమున శ్రీకృష్ణుడు గురుప్రశంస చేస్తూ వారరణ్యానికి వెళ్ళుట మొదలగు విషయాలుమాటలలో

శ్లో॥ "ప్రవిష్టానా మహారణ్యం। మృగరాః సుమహద్ద్విజ
వాత వర్ష మహా భూతైర్వనో। నిమ్మురాః స్థన యిత్నవః"
అని అతి సంక్షిప్తముగా ఉన్న దానిని శ్రీ పోతన

"ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత" అను సీసపద్యము వ్రాసి అచ్చం మన కనులయెదుట వర్షం కురుస్తున్నట్లు యెంతో అమృతోపమాన ఉపమా అంతా నుప్రాసలతో వ్రాశాడు.

మూలములో "సూర్యశ్చాస్తంగ తస్తాప" అను శ్లోకాన్ని యెంతో అద్భుతమైన పద్యాల్లో మన మహాకవి అనువదించాడు.

"ఉదితే తవా" అను మూలాన్ని "తెల తెల వారిన" అను పద్యాన్ని ఘనంగా పెంచి వ్రాశాడు.

శ్రీ వ్యాస భాగవతానికి నలువది వ్యాఖ్యలున్నాయి ఇందులో "భాగవత భావార్థ దీపిక" అనే పేరుతో శ్రీధరాచార్యులవారు వ్రాసిన "అద్వైత వ్యాఖ్యానమూ, భాగవత వర్తిక" అను పేరుగల శ్రీ విజయధ్వజాచార్యుని "ద్వైత" వ్యాఖ్యానమూ ప్రసిద్ధాలై ఉన్నాయి.

ఇందులో శ్రీధరాచార్యుల వ్యాఖ్యానమే యెక్కువ ప్రచారంలో ఉంది. మహాకవి పోతన ఆతని వ్యాఖ్యానమ్ము ననుసరించి అద్వైత పరముగా చాలచోట్ల అనువాద మొనర్చించాడు.

తత్త్వ విషయాలను వ్రాయు సందర్భంలో మహాకవి తప్పకుండా వ్యాఖ్యాన విషయాలనే అనువదించాడు. అందు వలన యీతని శ్రీమదాంధ్ర మహాభాగవతమును పారాయణ చేయువారికి శ్రీ వ్యాసులవారి భాగవతమూ, దాని వ్యాఖ్యానమూ రెండూ పారాయణ గావించు నట్లు ఫలము కలుగుతుంది.

అశ్వత్థామను కృష్ణార్జునులు వెంబడించగా, అశ్వత్థామ పిక్కబలం కొలదీ పరుగుపట్టు సందర్భమున మూలమున "రుద్రభయాద్యథాకః" అనియె యున్నది.

"కః బ్రహ్మ మృగో భూత్వా సుతాం యబ్ధ ముద్యతస్సన్ రుద్రస్య భయా ద్యథా పలాయ సేస్మ" అని శ్రీధరుని వ్యాఖ్య. మహాకవి దీనిని "శిశుహంత గావున నిజ ప్రాణేచ్ఛ బారెన్ విడిన్" అనియూ

"మున్నా బ్రహ్మ మృగాకృతిన్ తన[illegible]కున్ మోహించి క్రీడింప నా పన్నుండై హరు జూచి పారుపగిదిన్ పంచేంద్రియ భ్రాంతితోన్"

అనువదించాడు.

[illegible] భీముని శ్రీకృష్ణుడు [illegible]

[illegible] గదితం। ద్రౌపద్యాశ్చ చతుర్భుజః
ఆలోక్య వదనం సఖ్యు। రిద మాహ హసన్నివ

అను శ్లోక మున్నది. ఇందులో "చతుర్భుజ" అనే శబ్దాన్ని శ్రీధరాచార్యుడు "భీమేతం హంతుం ప్రవృత్తే, ద్రౌపద్యాంచా నిచ్ఛంత్యా సహసా తన్నివారణే ప్రవృత్తా యాం, ఉభయో స్సన్నివారణా యావిష్కృత చతుర్భుజః" అని వ్యాఖ్యానించెను.

"శ్రీకృష్ణుడు తన రెండు హస్తముల భీమునీ, మరి రెండు కరముల ద్రౌ పట్టుకొని వారించెను" అని మహాకవి అనువదించినాడు.

ఈ విధంగా శ్రీధరాచార్యులవారి వ్యాఖ్యానమునే యెక్కువగా అనువదించాడు శ్రీ పోతన.

శ్లో॥ "తరవః కిం న జీవంతి । భస్త్రాం కిం నశ్వసంత్యుత
న ఖాదంతి న మేహంతి । కిం గ్రామ్యాః పశవోపరే
శ్వవిడ్వరాహో ష్ట్రఖరై స్సంస్తుతః పురుషః పశుః
న యత్కర్ణ కథోపేతం జాతునామ గదాభృతః"

ఈ శ్లోకాలు "భక్తియోగము కన్నా మిన్నయైన యోగంలే" దని శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు చెప్పెను.

దీనికి మన మహాకవి ఆంధ్రీకరణము చూడండి.

"అలరు జొంపములతో నభ్రంకషంబులై
బ్రతుకవే వనముల పాదపములు,
ఖాదన మేహనాకాంక్షల బశువులు
జీవింపవే గ్రామ సీమలందు,

నియతిమై నుచ్ఛ్వాస నిశ్శ్వాస పవనముల్
ప్రాపింపవే చర్మ భస్త్రికలును,
గ్రామ సూకర శునక శ్రేణు లింటింట
దిరుగవే దుర్భోగ దీనవృత్తి,
నుష్ట్ర ఖరములు మోవవే యురుభరముల
బుండరీకాక్షు నెరుగని పురుష పశువు
లడవులందు నివాసములందు ప్రాణ
విషయభర యుక్తితో నుంట విఫల మధిప!"

ఈ అనువాద మెంత అందముగా చందగించింది. శ్రీధరాచార్యులవారి వ్యాఖ్య గాక మూలమునే అనువదించి కొంచం పెంచి వ్రాశాడు మహాకవి.

వామనావతార ఘట్టములో

అదితి దగ్గరకు కశ్యప ప్రజాపతి వచ్చి అనేక కుశల ప్రశ్నలు వేయుట అదితి

"భద్రం ద్విజగవాం బ్రహ్మన్ । ధర్మస్యాస్య జనస్య చ
త్రివర్గస్య పరం క్షేత్రం । గృహమేధిన్ గృహా ఇమే"

అని విపులంగా యెంతో మూలములో నున్నదానికి

"ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డల బిడ్డలున్ మహా
భీమ బలాఢ్యులై తనదు బిడ్డల నందరఁ దోలి సాహసా
క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచు నున్నవారు; నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర! మేలు దలంచి చూడవే!"

ఇందులో కశ్యపు డడిగిన సామాన్యవిషయా లన్నింటికి సమాధాన మియ్యక అదితి తన గోడును విన్నవించుట యెంతో ఔచిత్యముగా ఉన్నది. యెంతో సహజముగా కూడా ఉన్నది మామూలు పరిస్థితులలోనైన తన భర్త అడిగి నన్నిటికీ సమాధాన మిచ్చియే ఉండేది.

అదితికి కశ్యపుడు "బహు సౌఖ్యముల నందు" మనగా నామె ఆ సేవా, మంత్రవిధానము లడిగిన కశ్యపుడు "పయో భక్షణ"మను వ్రత విధానము, ఆ మంత్రముల ననుసరించుట సుమారు 40 శ్లో॥ మూలములో ఉన్నాయి. మన మహాకవి చిన్న వచనమున వాటిని సంక్షేపించెను.

భోజనాదులూ మొదలగునవి చప్పగా ఉండుటచే శ్రీ పోతన వాటిని విడిచెను.

అదితి పయోభక్షణ వ్రత మాచరించి తన దగ్గర ప్రత్యక్షమైన శ్రీమన్నారాయణుని స్తోత్రించేసి తన కుమారులకు కలిగిన బాధలు తొలగింపమని అనేక విధాల శ్రీవిష్ణువును ప్రార్థింపగా ఆమె నోదార్చి, నారాయణుడు నీగర్భములో నీ కుమారునిగా జన్మిస్తానన్న సందర్భమున 17 వ అధ్యాయంలో 9 శ్లోకాల్లో వ్రాసిన విషయమును మన మహాకవి యెంతో క్లుప్తీకరించి రెండు పద్యాల్లో వ్రాశాడు.

రుక్మిణీ కల్యాణ ఘట్టమున రుక్మిణిని గొనిపోవుచున్న సమయాన అందరు రాజులూ విడిచిపెట్టారు. రుక్మి మాత్రం విడువకుండా

శ్లో॥ "అహత్వా సమరే కృష్ణ। మప్రత్యూహ్య చ రుక్మిణీమ్
కుండినం న ప్రవేక్ష్యామి। సత్యమేతద్బ్రవీమి వః"

అని శపథం చేసినట్లు మూలములో ఉండగా, అదంతా విడిచిపెట్టాడు మహాకవి. అంతేకాక అతనిని అవమానం కృష్ణుడు గావించినట్లు వ్రాశాడు.

## పోతన మహాకవి ఔచిత్యముతో గావించిన మార్పులు

మహాకవి మూలములో గలవాటిని కొన్నిటిని ఔచిత్య పరమాదరణ గావించి విడిచిపెట్టాడు. కారణం? యేమీలేదు. శ్రీ వ్యాసులవారి భాగవత రచనాకాలం ఆనాటి సంఘమూ-వారి సంస్కారాలూ వేరు; మన మహాకవినాటి సంఘమూ, సంస్కారాలు, పఠితల దృక్పథం వేరగుటచేత ఔచిత్యం కొరకు కొన్ని మార్పులూ, చేర్పులూ చేయక తప్పలేదని మనము దూరదృష్టితో ఊహించాలి.

ఒక భాషనుండి వేరొక భాషానువాదము చేయనెంచుట కత్తిపై సాముచేయుట వంటిది. మూలకర్త విశృంఖలతతో స్వాతంత్ర్యుడు కనుక తన యిష్టానుసారంగా వ్రాయగలడు. అనువాదకుడో! అలా కుదరదు, మూలకర్త అడుగులో అడుగు వేసుకొని తన ప్రత్యేక స్థానాన్ని తాను నిర్ణయించుకోవాలి. బుద్ధిమంతులకు యీ విషయం బోధపడుతుంది. అందువల్లనే పోతన మహాకవి తప్పకుండా కొన్ని మార్పులు గావించాడు. వాటిని చర్చించుకుందాము.

పరీక్షిన్మహారాజుకు శుకమహర్షి భక్తిమార్గమే ముఖ్యమని తెలుపుట మూలములో

శ్లో॥ "జీవన్ శవో భాగవతాంఘ్రి రేణుం
న జాతు మర్త్యోఽఖిలభేత యస్తు
శ్రీవిష్ణు పద్యా మనుజస్తులస్యాః
శ్వసన్ యస్తు న వేదగంధమ్"

అన్నాడు. భాగవతాంఘ్రి రేణువును స్పృశింపక జాలనివాడు జీవచ్ఛవమనీ, శ్రీహరి పదలగ్నమైన తులసీ గంధాన్ని నాఘ్రాణింపనివాడు తో నున్న శవమని" వ్రాయబడింది. యిచ్చట రెండు ద "జీవచ్ఛ"వ మను అర్థం వచ్చును. అందువలన మహాక నిని మార్చి

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ ము హస్తంబులు సత్యవచన
హరిపద తులసీదళామోద రతిలేని
ముక్కు పందిముక్కు మునిచరిత"

అని తన సహజాంత్యానుప్రాస క్రీడతో యెంతో మనోహరముగా రచించాడు.

శ్లో॥ కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
అభీర కంకా యవనాః ఖసాదయః
యేఽన్యేచ పాపా యదుపాశ్ర
యాశ్రయా శ్శుద్ధ్యంతి తస్మై ప్రభవిష్ణవేనమః॥"

యిందులో ఆంధ్రులు కూడా పాపులలో చేర్చబడ్డారు. అందువలన మహాకవికి అది యిష్టలేక పోయింది.

"యవన వ్యాళ పుళింద హూణ శక కంకాభీర
చండాల సంభవులుం దక్కిన పాపవర్తనులు"

అని ఆ పాపాత్ముల నుండి ఆంధ్రులను విడిపించాడు.

శుక్రాచార్యులు వామనమూర్తికి మూడడుగుల నేల యీయవద్దని చెప్పుచూ

శ్లో॥ "త్రిభిః క్రమైరి మాన్ లోకాన్
విశ్వకాయః క్రమిష్యతి
సర్వస్వం విష్ణవే దత్వా
మూఢ వర్తిష్యతే కథమ్"

"మూఢ" అని సంబోధించుట మన మహాకవికి ఉచితంగా తోచలేదు. అందుచేత దానిని విడిచి

"ఒక్క పదంబున భూమియు
నొ[illegible]ట త్రిదివంబు ద్రొక్కి యున్నతమూర్తిన్
[illegible] లు గగనము దానై
వెక్కసమైయున్న నెందు వెడలెదు చెపుమా!"

అని అపూర్వ కవితా శోభతో అనువాదం సాగింది. [illegible]

బలిచక్రవర్తి భృగుని [illegible] ద్రోహింతు. సమయాన "[illegible] ఇవ [illegible]" "[illegible] ప్రజ్వలించు అగ్ని [illegible]

వలె" అని మూలార్థము. రథముపై నున్నవాడు అగ్నివలె నున్నాడనుట సముచితము కాదని

"రాజద్రథారూఢుడై
వెలిగెన్ దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దావాగ్నిప్రభన్"

అని మహాకవి అపూర్వంగా ఆంధ్రములో అనువదించాడు. ఈ విధంగా మహాకవి పోతన తన అనువాదములో ఔచిత్యం కొరకు యెన్నో మార్పులు చేశాడు.

ఒక్కొక్క సమయాన మూలార్థం సరిపోయిన పద్యం మిగిలితే యెంతో రమణీయ ఔచిత్యముతో వ్రాసిన పట్టులెన్నో ఉన్నాయి.

శుకమహర్షి భక్తి యొక్క గొప్పతనాన్ని వివరించి చివర—

శ్లో॥ "త దశ్మసారం హృదయం బతేదం
యద్గృహ్యమాణైర్హరి నామధేయైః
న విక్రియే తాథ ముఖే వికారో
నేత్రే జలం గాత్ర రుహేషు హర్షః"

దీని అనువాదానికి మహాకవి సీసపద్యాన్ని ప్రారంభింపగా రెండు పాదాల్లో మూలభావము ముగిసింది. అప్పుడు ఆ భావాన్నే చూపుతూ

"నారాయణుని దివ్య నామాక్షరములపై
గరగని మనములు కఠిన శిలలు,
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు,
చక్రికి మ్రొక్కని జడుని యౌదలనున్న
కనక కిరీటంబు గట్టెమోపు,
మాధవార్పితముగా మనని మానవు సిరి
వనదుర్గ చంద్రికా వైభవంబు,
కైటభారి భజన గలిగియుండనివాడు
గాలిలోన నుండి కదలు శవము,
కమలనాభు పదము గననివాని బ్రతుకు
పసిడి కాయలోని ప్రాణి బ్రతుకు"

ఆహా ! యేమి యీ ఔచితీ మాధురీమహిత! మహ
నీయ మంగళకర ఆంధ్రీకరణమో వివరింప జాల కష్టము.

నారద మహర్షి బ్రహ్మదేవుని ప్రపంచముగూర్చి అడి
గెనని శుకమహర్షి చెప్పడానికి ముందుగా గురువందన
మొనరించుచు

శ్లో॥ "భూతైర్మహద్భిర్య ఇమాః పురో
ర్విభుర్నిర్మాయ శేతే య దమూషు పూరుషః
భుంక్తే గుణాన్ షోడశ షోడశాత్మక
సోఽలంకృషీష్ట భగవాన్ వచాంసి మే"

"భగవంతుడు వాక్కుల నలంకరించుగాక" ఈ శ్లోకములో గల నాల్గవ పాదార్థం అనువాదం చూడండి.

"అట్టి భగవంతు డవ్యయుం డచ్యుతుండు
మానసోదిత వాక్పుష్ప మాలికలను
మంజు నవరస మకరంద మహిమలుట్టి
శిష్ట హృద్భావ లీలల జేయుగాత!"

ఏమి యీ అద్భుతోపమమానాద్భుత వాగ్వైచిత్రి యుత అనువాద విద్యా సద్యోగ హృద్య పద్యం? మహాకవికే చెల్లును.

గోపికా గీతలో వ్యాసులవారు

"విష జలాశయాద్వ్యాళ రాక్షసా
ద్వర్ష మారుతా ద్వైద్యుతానలాత్
వృషమయాత్మజా ద్విశ్వతో భయా
వృషభ తే వయం రక్షితా ముహుః"

వ్రాసినదానికి మహాకవి

"విష జలాంబు వలన విషధర దానవు
వలన గాలి వాన వలన వహ్ని
వలన నున్న వాని వలనను రక్షించి
కుసుమశరుని బారి గ్రుచ్చ దగునె"

అని ఆంధ్రీకరించాడు. శ్రీ వ్యాసులవారి శ్లోక భావము పద్యం మూడుపాదాల్లోనే యిమిడింది. నాల్గవ పాదము

మహాకవి స్వంత భావము. "హే కృష్ణా! యెంతో పెద్ద ఆపదనుండి మమ్ము రక్షించావు, తుదకు "అంటిన కందు" పూల విలుకానికి అప్పజెప్పి మేము జీవింపనట్లు చేశావా?"

ఓహో! యెంత మహత్తర భావమిది?

## మూలానుసారముగా అనువాదము

పై విషయాల వలన మహాకవి మూలాన్ని పెంచియూ, మూలాన్ని త్రుంచియూ అనువాదం గావించాడనుకోవలదు. మూలానుసారంగా వ్రాయబడినవి పరిశీలించుదాము: యథా మూలంగా వ్రాసి అపూర్వ భావనా శబలత నిరూపించాడు.

శ్లో॥ జన్మైశ్వర్య శ్రుత శ్రీభి
రేధ మాన మదః పుమాన్
నచార్హత్యభి ధాతుం
వైత్వా మకించన గోచరమ్" (దీనికి తెలుగు)

"జననము నైశ్వర్యంబును
ధనమును విద్యయును గల మదచ్ఛన్నులకిం
చన గోచరుడగు నిన్నున్
వినుతింప లేరు నిఖిల విబుధ స్తుత్యా"

ఈ అనువాద కౌశల మెనన్య సామాన్యరీతిలో సాగింది. అందులో మహాకవికి కందములోం యెంత అర్థాన్నైనా యిమడ్చగల ప్రజ్ఞ శ్రీరామ వరప్రసాదం.

శ్లో॥ భారావతరణా యాన్యే
భువో నావ ఇవోదధౌ
సీదంత్యా భూరి భారేణ
జాయె హ్యాత్మ భువార్థితః"

ఈ భగవానుడగు శ్రీ వ్యాసులవారి శ్లోకానికి

"జలరాశిలో మునింగెడు
కలము క్రియన్ భూరిభార కర్శితయగు నీ
యిల్గ నావ నజుఁడు గోరిన
గలిగితి వని కొందఱందు గణనాతీతా!"

మహాకవి యిందు చాలా జాగరూకతతో అనువాదం సాగించాడు. అతికోమల పద మాధుర్య ధురంగా భావచాతుర్యనత పారీణతా పండితునకే యీ కార్యం సాధ్యం.

శ్లో॥ "శ్రియఃపతి ర్యజ్ఞపతిః ప్రజాపతి
ర్ధియాం పతి ర్లోకపతి ర్ధరాపతిః
పతి ర్గతి శ్చాంధక వృష్ణి సాత్వతాం
ప్రసీదతాం మే భగవాన్ సతాం గతిః"

శ్రీపతియు యజ్ఞపతియు, ప్ర
జా పతియున్, బుద్ధిపతియు, జగదధిపతియున్
భూపతియు, యాదవ శ్రే
ణీపతియున్, గతియునైన నిపుణు భజింతున్"

శ్లోకంలో శ్రీ వ్యాసమహర్షి యతి ప్రాసలు అక్కర లేనివారగుట యిన్ని పతులను లాటానుప్రాసతో సమ కూర్చాడు.

మన మహాకవికి యతి ప్రాసలతో చిన్నదైన కంద ములో అత్యంత అందముగా మూలానికి వన్నె పెట్టినట్టుగా అనువదించుట హేలా లీలగా శక్తి శ్రీరామచంద్రు డిచ్చా డని చెప్పవచ్చును.

శ్లో॥ "యథా భ్రామ్యత్యయో బ్రహ్మన్
స్వయ మాకర్ష సన్నిధౌ
తథా మే భిద్యతే చేత
శ్చక్రిపాణే ర్యదృచ్ఛయా"

"ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నావిధమున
గరగుచున్నది దైవయోగమున జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంతమగుచు"

మహాకవియొక్క అనువాద ప్రతిభా ప్రాభవము వివ రింప యెంతటి వానికిని సాధ్యపడదు.

## మూలానికి భిన్నముగా అనువాదము

మహాకవి యెందుచేతనో కొన్ని ఘట్టాలలో మూలా నికి భిన్నంగా అనువాదములు కాన్పిస్తాయి. ఉద్దేశపూర్వ

కంగా గానీ, పొరపాటున గాని యిలా జరిగి ఉండునని మనము ఊహించాలి.

శ్లో॥ గోపైర్మఖే ప్రతిహతే వ్రజవిప్లవాయ
దేవేఽభివర్షతి పశూన్ కృపయారిరక్షుః
ధర్తోచ్ఛిలీంధ్ర మివ సప్త దినాని సప్త
వర్షో మహీధ్ర మనఘైక కరే సలీలమ్"

"శ్రీకృష్ణపరమాత్మ పశువుల రక్షణకు గిరిని ఏక హాస్తముతో అవలీలగా శిలీంధ్రములాగు (వర్షాతూత్పన్నం శిలీంధ్ర కుసుమమిత - అని వ్యాఖ్య) ధరించాడని" శ్లోకార్థం; కుక్కగొడుగు యెంతో తేలిగ్గా ఉండును. అలాగే యెత్తాడని శ్రీ వ్యాసాభిప్రాయం.

మహాకవి "శైలరాజ మచలచ్ఛత్రంబుగా దాల్చి" అని శిలీంధ్ర పదాన్నే విడిచాడు.

శ్లో॥ "య ఏతేన పుమాన్నిత్యం
స్తుత్వం స్తోత్రేణ మాం భజేత్
తస్యాన్వహం ప్రసీదేయం
ర్వకామవరేశ్వరః"

వాఖ్య: సర్వకామ వరేశ్వరః=సర్వకామ వరప్రద. మహాకవి యీ పదాన్ని

"అవాప్త సకల కాముడ నగుచున్" అని అనువదించాడు.

శ్లో॥ "స సర్జాగ్రేఽంధతా మిస్ర
మథతా మిస్ర మాదికృత్
మహా మోహంచ మోహంచ
తమశ్చాజ్ఞాన వృత్తయః" అని మూలము.

"సృష్ట్యాది అంధతా మిస్రము, మహా మోహము, మోహము, తమస్సు అను అవిద్యావృత్తులను బ్రహ్మ సృష్టి చా"డని భావము.

పాతంజల యోగశాస్త్రములో కూడా అవిద్యాపంచకము బాగా వివరింపబడింది.

"ధాత యీ సృష్టి ప్రారంభమున "అహ" మను శరీరాభిమానముగల మోహాన్ని, అంగనా సంగమ ప్రసక్చందనాది భోగేచ్ఛలుగల మహా మోహంబును, దత్ప్రతిఘాత జాతంబైన క్రోధంబునందు గలుగు తామిస్రమును, దన్నాశంబు నందహమేవ మృతోఽస్మి యను నంధతామిస్రంబును చిత్త విభ్రమంబునును నవిద్యాపంచక మిశ్రంబుగా" అని మహాకవి అనువాదము.

మూలములో గల క్రమమును తారుమారు చేసెను. మోహముతో ప్రారంభించి - చిత్త విభ్రమముతో ముగించాడు. చిత్త విభ్రమాన్ని తమస్సుకు మారుగా వాడెను. "తమము" అనగా "స్వరూపా ప్రకాశ" మని శ్రీశంకరాచార్యులవారు అవివేకమని పాతంజల యోగశాస్త్రమూ వివరించాయి. యీ విషయము రెండిటికీ విరుద్ధము.

శ్లో॥ "కాలోఽయా పరమాణ్వాది
ద్విపదార్థాంత ఈరితః
సై వేశితుః ప్రభుర్యాభువ్న
ఈశ్వరో ధామమానినామ్" అని మూలము.

"మందిరార్థాది కర్మాది మానశీలు
రైన వారికి నాశ్రయం బగుట జేసి
యరయ హరి దద్గుణ వ్యతికరుడుగాన
కాల మమే టి కెన్నడు గర్త కాదు"

ఇందు "హరి ద్గుణ వ్యతికరుడు గాన" అను కారణం మహాకవి కల్పించింది.

"ఈ శితుః - భూమ్నః" అనే శబ్దాలను "అమ్మకి" అనీ; "ప్రభుః" అనగా "కర్త" అనీ; "ఈశ్వరః" అనుదానిని "ఆశ్రియం బగుట జేసి" అనియు మహాకవి అనువాదం.

శ్లో॥ "రూప భేద విద స్తత్ర
తత శ్చోదయతో దతః
తేషాం బహుపదా శ్శ్రేష్ఠా
శ్చతుష్పాదా స్తతో ద్విపాత్" అని మూలము.

"వెలయు శబ్ద విదులకంటెను మరి రూపవేదులైన
వాయసాదులు శ్రేష్ఠముల్" వానికంటె
వరుస బహుపాదు లుత్తముల్, వారికంటె,

దలప చతుష్పదు లధికులు
బలగొని మరి వారికంటె బాదద్వయముం
గల మనుజుల లఘుతము లి
మ్ముల, వారలయందు వర్ణములు నాల్గరయన్"

మహాకవి అనువాదములో "ఉభయతో దంతః" అను దానిని విడిచిపెట్టెను.

ప్రహ్లాదునికి విరోధ శాస్త్రములు గరపితిరని హిరణ్యకశిపుడు పురోహితుని నిందసేయగా, ఆతడు

శ్లో॥ "నమత్ప్రణీతం న పరప్రణీతం
సుతో వదత్యేష తవేంద్రశత్రో
నైసర్గికీయం మతిరస్య రాజన్
నియచ్ఛ మన్యుం కదదాస్స్మ" అని మూలము.

వ్యాఖ్య : ఇంద్రశత్రో ఇత్యనేన సహి బ్రాహ్మణేషు తవకోప ఉచిత ఇతి భావః—

శ్రీధర వ్యాఖ్య: హే ఇంద్రశత్రో! ఇంద్రశత్రో స్తవ బ్రాహ్మణేష్వాగ్రహః అనుచితః - అవిషయాత్వాదితి భావః - అని భాగవత చంద్రిక.

ఇందలి "ఇంద్రశత్రో" అనే సంబోధన యెంత గొప్పదో. తెలుస్తుంది. మహాకవి దీనిని విడిచి

"తప్పులు లేవు మావలన దానవనాథ"
"నీపుత్రుని నిటువలె జేయగ
శత్రులమే దైత్యజలధి చంద్రిమ వింటే"

అని అతి పేలవములుగా వాడినాడు.

ఈ విధంగా పోతన మహాకవి విరుద్ధముగా కొన్ని యెడల అనువాదం యెందుకు చేసెనో మనకు తెలీదు. సమర్థుడు కాడని అందుమా? అలా అనడానికి యెవరు సాహసించ గలరు? శ్రీ మహాకవి భాగవతము తరువాత యెవ్వరో కొందరు దీనిని ఆంధ్రిభాషలోకి అనువదించిననూ యేమంత చెప్పగలుగు నట్లుగా లేవు. ఇంతకన్నా అధికం వ్రాయను.

## మహాకవి పోతన - భాగవతము

పదియారు కళలతో అమృతాన్ని ఒలికిస్తూ పూర్ణిమా చంద్రిడు హాయినీ, తీయదనాన్నీ అందిస్తున్నాడు.

అది ఆ దినం;

రంగదుత్తుంగ తరంగాల చల్లనిహస్తాలతో శ్రీ గోదావరీ నదీమతల్లి ఆనందాన్ని అందిస్తుంది. మహాకవి బమ్మెర పోతన శ్రీ గోదావరీమతల్లి ఒడిలో స్నాతుడై ఆమె పిరుదుల వలెనున్న యిసుక తిన్నెలపై పద్మాసనస్థుడై ధ్యాన నిర్మగ్నుడైనాడు; నిమీలిత నయనారవిందు డైనాడు.

కొొక్కారు మెరవు తీవలా ఒక ప్రక్క పద్మనేత్ర యైన పద్మాలయాదేవి మెరుస్తుంది. ఆషాఢమాస ప్రథమ దివసంనాడు వచ్చిన నీలమేఘములాగ అపూర్వ శ్యామల కాంతిపుంజం మహాకవి కట్టెదుట ప్రత్యక్షమైంది. నవ్వుల పువ్వులు రువ్వి జాబిల్లి మింటనుండి చల్లని మెల్లని హాయిని విరజిమ్ముచున్నాడు ఆ అమృతకిరణాలు యావత్ ప్రకృతిని పులకరింప చేస్తుంది. లత ప్రాకిన తమాల సాల తరువులాగ మహావుపై విల్లు ప్రేలాడుతుంది. మహాకవికి దర్శనమైంది. జగజ్జేయమాన ప్రకాశమానమ్మ మాధుర్యం ఎవరు వర్ణింప గలరు? అదిగో! మహాకవి యేదో చెప్పబోవుచున్నాడు. అంతలో ఆతని శ్రవణపుటాలలో మార్మోగా సాగింది; "ఓయీ! మహాకవీ! శ్రీ వ్యాస భాగవతాన్ని తెనుగు చెయ్యి, నీ సమస్త బంధాలు తెగిపోతాయి" అనే అమృతపు చినుకులు అందాయి. యింకేముంది?

పులకించిపోయాడు మహాకవి. "ఆహా! నా శ్రీరామ చంద్రుడేనా నాకు సాక్షాత్కరించి యీ సువర్ణాక్షరాలు పలికేడు?" పరవశుడయ్యాడు. ఆనందం పట్టలేక గంతు [illegible] శ్రీ [illegible] ఆదేశం మహాకవి మస్తిష్క ములో [illegible] మాహాత్మ్యంతో తిరిగి ఆపాద్మమస్తకం [illegible] సర్వ నాడీమండలాన్ని ఆక్రమించింది. తనను తాను నమ్మలేక [illegible] అంతర్గత రామమయం. యింకేమిటి [illegible] మహాకవికి [illegible] కలా? నిజమా?

కలకాదు ఘనకావ్యమని శ్రీరాముని ఆజ్ఞ! అంతే, అనుకు
న్నాడు మహాకవి. యీ విషయాన్ని అర్ధశరీరాని కందిం
చాడు; ఇంకేముంది? ఆమెకూడా నర్తించింది; ప్రోత్సాహ
మందించింది. శ్రీ వ్యాసులవారి శ్రీమద్భాగవత మహా
పురాణం ఆంధ్రులందరికీ అందించమని అభ్యర్థించి, వేడు
కొన్నది. ఆత్మారాముని స్తోత్రం చేసింది.

ఒక సుముహూర్తాన మహాకవి పరమపావని గోదా
వరిలో శిరస్స్నాతుడై వచ్చి పూజామందిరంలో చేర్నాడు;
అంతా రామమయంగానే ఉందికదా! తనివితీరా ఆత్మా
రామారాధనా మగ్నుడయ్యాడు. లేచి వచ్చి శ్రీ వ్యాస
భాగవత తాళపత్ర మహాగ్రంథాన్ని తీసి వ్యాసపీఠంపై
ఉంచి నమస్కరించాడు. ఆ మహాగ్రంథాన్ని ముమ్మారు
కనులకద్దుకున్నాడు.

దక్షిణ హస్తముతో గంటాన్ని పట్టాడు. శ్రీకైవల్య
పదంబు చేరనెంచాడు. సమస్త దేవతా వందన చందన
లందించాడు; ఉమా - రమా - శారదా రమణులకు
హృదయ మంత్రపుష్పంతో పూజ జరిపాడు. పూర్వ మహా
కవులందరినీ వినుతించాడు. మధుర ప్రియోక్తులు వర్తమాన
కవికులానికి సమర్పించాడు. భావి కవులకు బహుమానా
లందించాడు. మౌన మహాకవికి క - కే - పు - లు అసలు
దృష్టికి గోచరింపనేలేదు.

మహాకవి పోతనకు ఆత్మారామమయ జగత్తులో తక్కువ ఎక్కువ ఎలా కానవస్తాయి? ఆయన శుద్ధ సాత్త్విక యోగ పూరుషుడు. నిరంతరం ఆత్మారామారాధనలో మునిగి తేలినవాడు. ఆతనికి హరి - హరా భేదమే లేదు. సర్వం హరిమయం, నందాంగనా డింభకుని దివ్య స్వరూపం యింకేమీ లేదు. అంతా చిదానంద పరిపూర్ణమే.

"పండిత స్సమదర్శనః" అను పలుకుకు నిదర్శనమైన వాడు. తన ధ్యానయోగ మంతా భాగవతార్థము కొరకే; తన జీవితమే భాగవతం. అంతేకాదు ! తన మహాగ్రంథ రచనలో ప్రత్యక్షరం ఒక మంత్ర బీజాక్షరంగా వర్ణించాడు పోతన మహాకవి.

## శ్రీ పోతన సహజ పాండిత్యము

మహాకవి తనకు తానే "సహజ పాండిత్యుడ" నని చెప్పికొన్నాడు. అంతఃకరణములు నాలుగింటిలో బుద్ధి ఒకటి, ఈ బుద్ధినే సప్త విధాలుగా భాగించారు.

(1) పండా, (2) మేధ, (3) ధారి్వ, (4) చత్వ, (5) గృహీతి, (6) [illegible] శౌతి, (7) పతిభగా పరిగణించారు. ఏదో ఒక విషయా [illegible] గూర్చి అన [illegible] ణంగా, ధారాపాతంగా అ[illegible] గ్రంథ[illegible]లో [illegible] ల సర్వ శాస్త్ర విషయ పరిశోధనాత్మ కంగా ఎదుటివ[illegible] [illegible]ండా, సభవారిని మంత్రముగ్ధ

లుగా చేయగల వాగ్ధోరణి కలిగినవాడే ప్రతిభావంతు డన బడతాడు.

ఎన్నో జన్మల వాసనా ఫలితం అపూర్వాద్భుత ఫలాన్ని ఒకే జన్మలో నిచ్చిన ఘట్టాలు లేకపోలేదు. మా పరమగురువు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు (1864 – 1945) మనందరికీ తెలిసినవారే. వారు అనేవారు మాతో "ఒక శాస్త్రాన్ని గురుముఖంగా కొన్ని సంవత్సరా లధ్యయనం గావించిన వానికి ఆ శాస్త్రములో గల రహస్యాలు నాకే వానికంటే తెలిసేవి. అలాగ నేను దేనిని చూసినా నాకంతా వెంటనే స్ఫురించేది అనేవారు. శ్రీ దాసు గారు అష్టభాషా విశారదులు.

అందువన మహాకవి పోతన "సహజ పండితు" డనడానికి సందేహ మేముంటుంది? యీతని రచనా బంధాన్ని బాణునితో పోల్చవచ్చును. అనేక గ్రంథాలు పుక్కిటిలో నుండి సమయం వచ్చినప్పుడు వాటంతటవి వచ్చిపడిననే యిటువంటి మహాకావ్యాన్ని వ్రాయగలుగుతాడు.

ఈతని గంగావతరణ గద్యంలో 66 ముక్త పదగ్రస్తములు గుత్తగొన్నవి. అంతరాంత రుపమానోపమేయములు– శ్లిష్టపదాలు - శేషానుప్రాణితరీతి యివన్నీ రంగదుత్తుంగ తరంగ సంకలిత గంగావేణీ పాయలులాగ అల్లుకొని నందనవన పారిజాత పరిమళాల్ని పాఠకుల హృదయమందిల్లో ఆనందాలను చిందిస్తున్నాయి.

జన్మ జన్మాంత తపస్సాధన ఫలితమే మహాకవి కవితా సంస్థానం. తన దివ్యాక్షర రామణీయక మహనీయ మనోహర మంగళకర మాధుర్య అత్మ మంత్రపుష్పాన్ని సమర్పించుట, సమర్పించుటకే రచనానైపుణి శ్రీమదాంధ్ర భాగవత పురాణమైంది.

ప్రీత్యాత్మా చ రసః” అని. ఈ ఆత్మీయతా ఆస్వాదయోగ్యతా, అక్షర శిల్పమూ, అంత్య ప్రాసాదులతో అత్యంత అద్భుత నిర్మాణ కౌశలమున్న నే ఆత్మకు ఆ కావ్య రసము పట్టును.

గంభీర భావము ఆనందముతో స్వీకరించిన తరువాతనే మనసు, బుద్ధి, చిత్తమూ, ఆత్మ నాలుగూ ఆనందింపగలుగును.

శ్రీ మహాభాగవతంలో అన్ని పాత్రలూ మర్త్యులు కావు, వ్యాపారము ఐహికము కాదు. అందువల్లన భాగవత సేవనమున సిద్ధించునది బ్రహ్మానందమే! దీనిలో రసానుభూతి పొందవలసినవారు భక్తులే!

[illegible] మహాకవి కావ్యములలో (1) శిల్పమూ, (2) [illegible] మిళితమై ఉన్నదన్నాడు. కవి ప్రతిభా విలసనమైనది. [illegible] మృదు పదముల నేర్చి తీర్చి వాక్య విన్యాసమున [illegible] వలెను. పద్యపాద లయ గమక యమకములను [illegible]. శ్రవణ, శుభగ సుందర పద సంయోగమ్ము, [illegible]

లలిత లాలిత్య, లావణ్యము శ్రవణ తర్పణము కూర్చును. అదే అంతరంగానికి హాయిని చేకూర్చును. పదబంధ శైథిల్యత గాకుండా జాగ్రత వహించాలి.

కావ్యానికి వక్రోక్తియే ప్రాణమని ఒక గొప్ప సిద్ధాంతముంది. అనగా వక్రముగా చెప్పడం; లాక్షణికు లేందరో యీ విషయానికి బహు ప్రాధాన్యాన్నిచ్చారు. వక్రోక్తి హాస్యాన్నిస్తుంది.

వక్రోక్తి గాకొన్ని పద్యాలు వ్రాయవచ్చును. కాని కావ్యమంతా వక్రోక్తితో నిర్మింపగలగడం హాస్యోక్తికైనను. భాగవతంలో శ్రీకృష్ణపరమాత్మ రుక్మిణీదేవితో సరసోక్తుల నాడుట వక్రోక్తిగా చెప్పాలి. యిలా ప్రతి కావ్యంలోనూ యీ వక్రోక్తికి కొంత స్థానాన్ని కల్పించా రాయా కవులు.

ఫుట్‌నోట్: మహాకవి ఉక్తి వైచిత్రి బాగా తెలిసిన వారు. శ్రీ యస్వీ జోగా రావుగారు. "ప్రసన్న కుసుమాయుధము" అను మహాకావ్యాన్ని కేవలం వక్రోక్తితోనే నిర్మించారు. అసాధారణ మేధా సంపత్తిగల శ్రీ జోగా రావుగారీ కావ్యాన్ని అత్యద్భుత వక్రోక్తి మయంగా నిర్మించారు. ఆంధ్ర కావ్య ప్రపంచంలో యింతవరకు యేకవీ యిటువంటి కావ్యాన్ని నిర్మించలేదూ, నిర్మించలేరు కూడా.

ఇంతవరకూ వ్రాయుట ఎందు కనగా, మహాకవి పోతనతో అసగా శ్రీ భాగవతంలో లాక్షణికులు చెప్పిన గుణాలు ముమ్మరంగానే ఉన్నాయి.

యీ మహాకవి అనవద్య హృద్యమైన పద్యాలు ఆంధ్రుల కంఠాలలో యెంతో రాగయుక్తగా మురిపిస్తూ, అందరి హృదయాలనూ అంత మరిపించాయి. కవితకు గీటురాయే యిది కదా! ఆ పదబంధ సంయోగ భాగ్యమూ, ఆభాల యింపు సొంపులూ, అర్థమాధుర్యమూ, పద్యంలోగల లయల హొయలూ, యింక యే మహాకవిలో లేవంటే సాహసము కానేకాదు.

ఈ మహాకవి రచనలో ఒక్కొక్క పద్యం, ఒక్కొక్క శిల్ప కళాఖండ మనడంలో సందేహము లేదు. యీాయన శీలాది సుగుణసంపదచేత పరిష్ఠ గరిష్ఠుడు, శిష్టులలో వశిష్ఠుడు, సహజ పాండిత్య సాగరుడు, భావగత భాగవత రచనతో జీవన్ముక్తుడు. శ్రీ తారకరామ నామోపాసనా దురంధరత్వముతో మహాకవీంద్ర చంద్రుడు, చిన్మయానంద తుందిల హృదయ సౌందర్యముతో ఆంధ్రుల హృదయ శయ్యలను కైవల్య సిద్ధిని పొందించిన మహాయోగ సంపన్నుడు. [illegible] వెదకుట వలన నిజముగా వారు [illegible] అర్థ సంప్రదా[illegible] భాష శయ్యాసౌభాగ్య

దాయిని యైన ఆ దివ్యపురుషుని వాణి ఆంధ్రుల ఆరుకోట్ల హృదయవీణలను మార్మోగింప జేయగలదు.

ఎందుకో ఆంధ్రులందరికీ మహాకవి పోతన భాగవత మన శరీరము పులకరించి పోవును; ప్రాణాలు లేచివచ్చును. అందులో భామలలో సత్యభామ మిన్న. "సత్యభామ" అన గానే ఆంధ్రులందరి ఆడపడుచుగా అక్షులు చాచుదురు. మహాకవికీ సత్యభామపై వల్లమాలిన ప్రేమానురాగాలు జూపించాడు.

"అరిజూచున్, హరి జూచు సూచకములై యందంద
మందార కే
సరమాలా మకరంద బిందు సవిలస్యందంబు లందంబులై
తొరగన్, పయ్యెద కొంగొకింత తొలగన్, తోడ్తో
శరాసారమున్
దరహాసామృత పూరముస్ కురియుచున్ దన్వంగి
హేలాగతిన్"

ఇందులో "మందార కేసరమాలా మకరంద బిందువులు" అందముగానే అందగించాయి. యీ పద్యములో వీరరసములో సారము కానరాలేదు.

ఇక మహాకవి పోతన కవితా శిల్పాన్ని పరిశీలించుదాం.

"పరు జూచున్ వరు జూచు, నొంప నలరింపన్, రోష
రాగోదయ-
విరతి భ్రూకుటి మందహాసములతో, వీరంబు శృంగారమున్
జరగన్, కన్నుల కెంపు సొంపు పరగన్, చండాస్త్ర
సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ చంద్రాస్య
హేలాగతిన్"

యీ పద్యములో సరితూకముగా వీర శృంగారసాలు రెండూ పోటీపడుతూ నీవా? నేనా? అన్నట్లుగా ఉన్నాయి.

పరుడు నరకుడు, ఆతని నొంపగా జూచి, రోష రక్తాతిశయముతో కలిసిన భృకుటితో కనుల నిప్పులు గురిపిస్తూ చండాస్త్ర సందోహాన్ని విసరింది.

వరుడైన శ్రీకృష్ణ పరమాత్ముని నలరింప జూచుచున్నది. మందహాసాన్ని ప్రసారం గావిస్తూ, కనుల సొంపు పెంపుతో ప్రసాదించింది. ఆహా! యేమి మహాకవి యొక్క సత్యభామ వీర శృంగారములు?

ఈయన అనువాదము అనన్యసామాన్యము. యింతకు ముందంతా వివరింపబడింది.

శ్లో॥ "కాత్యాయనీ! మహామాయే
మహాయోగి న్యధీశ్వరి!
నందగోప సుతం దేవి!
పతిం మే కురుతే నమః" అనువాదము.

"ఓ కాత్యాయని భగవతి
నీకున్ మ్రొక్కెదము నేము, నేడనుకంపన్
మా కందరకున్ వైళమ
శ్రీకృష్ణుడు మగడుగాగ జేయుము తల్లీ!"

ఆహా! యేమి యీ అనువాదము? యిలాగ యెవ్వరు అనువదింపగలరు?

---

ఫుట్‌నోట్:-

శ్లో॥ "శ్వత్రిప్త తస్తే పితరో మమేత్యే
త్యపర్ణ యోక్తే పరిహాస పూర్వం,
శ్వ వా మమేవ శ్వశురా తవేతి
తా మీరయన్ సస్మిత మీశ్వరోవ్యాత్"

ఇది ఒక చాటువు - తెలుగు చూడండి.

"నాకున్న తల్లి దండ్రిలు
మీ కేరీ యని యపర్ణ మేలమాలాడన్;
నాకున్న అత్తమామలు
నీ కేరీ యనుచు నగు త్రినేత్రుని గొల్తున్"

వ్యాఖ్యాత

పతితలు తెనిగింపు యింపు సొంపులు యించుక చూపుటకె దీనిని వ్రాసితిని.

అందుకే మహాకవి కేవలము శ్రీరామచంద్రుడే పలికాడు గాని మాత్రం వ్రాయలేదనుట తప్పక అందరం ఒప్పుకొని తీరవలసినదే! యీ మహాకవి శ్రీ భాగవతము గూర్చి వ్రాయుట మన మన పూర్వజన్మ పుణ్య ఫలంగా భావించాలి. అపూర్వ మహత్తర యోగమున్ననే యిటువంటి గ్రంథం దొరుకదు. యిటువంటి అవకాశము దొరుకుట గూడా చాలా కష్టమే! యీ అవకాశము యిప్పటికి నాకు చిక్కింది. తరించాను. యింతకన్న నేనేమి వ్రాయగలను?

"నీలోన ని చోద్యము
లేలోకము దు జెప్ప రీశ్వర! నీట
న్నేలన్నిరంగిన నున్నవె
నీలో జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!"

సర్వం కృష్ణానుమదర్పణమస్తు.

రామకృష్ణ ప్రింటర్స్, రాజమండ్రి.